శ్రీ వాణీ ఆర్ట్ కంబైన్స్

# ఒకే రక్తం






# బాధ నివారణ కోసం
# అయొడెక్స్
# రుద్దటం అవసరం

ఇతర ఆయింట్‌మెంట్స్ మీకు బాధనుంచి ఉపశాంతిని ఇయ్యవచ్చు. అయొడెక్స్ ఉపశాంతిని ఇస్తూ, బాధను నివారిస్తుంది. దీనిలో అయొడిన్ ఉంది గనక.

కండరాల నొప్పులకూ, కీళ్ళ నొప్పులకూ ఒకే ఒక ఆయింట్‌మెంట్-అయొడెక్స్.






అయొడెక్స్-మిమ్మల్ని మళ్ళీ చురుకుగా పనిచేసేలా చేస్తుంది.

ఐటాప్-IODEX.3-75 TL





పసి బిడ్డకు
జీర్ణసంబంధమైన
బాధలు కలిగినప్పుడు

సౌమ్యంగా పనిచేసే
# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్
బాధను అతి త్వరగా తగ్గిస్తుంది




గృహౌషధములు
తయారుచేయుటలో
తరతరాలుగా
నమ్మికకు పాత్రమైన
అమృతాంజన్ వారి
తయారి.

కడుపునొప్పి, అజీర్ణము, వాయువు, పళ్ళు పచ్చేటప్పుడు కలిగేబాధలు మొదలైన వాటిలో దేనితోనైనా సరే, మీ పసిబిడ్డ బాధ పడుతూంటే అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్‌తో అతి త్వరగా ఉపశమనం కల్గించండి త్వరగా సులభంగా తిరిగి మీ పసిబిడ్డ ఆనందంగా నవ్వుతుంది.

అమృతాంజన్ లిమిటెడ్

OBM 3410/2 TG

# జూన్ నెల క్విజ్

## సమాధానాలు

1 — ఎ  2 — సి  3 — బి

4 — సి  5 — ఎ

6 పార్ధు

7 జన్‌కొటాబి

8 ఫోన్

9 సముద్రగుప్త

10 దిలీప్ సర్‌దేశాయ్

ఈ క్రింది పదముగ్గురు ఆల్ కరెక్ట్ ఎంట్రీలు పంపారు ఒక్కొక్కరికి 17-85 ల చొ॥న ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

1. పి. నాగేశ్వరరావు, హైదరాబాద్
2. టి భారతి, హైదరాబాద్
3 లోకం సుబ్బారావు, వైజాగ్
4 రమ, రాజమండ్రి
5. కె. సూర్యారావు, తొర్రేడు
6. కె శారద, రాజమండ్రి
7. టి. తాతారావు, హైదరాబాద్
8. వై. యస్. యం. విష్ణు, హైదరాబాద్
9 శ్రీమతి సుధాదేవి, హైదరాబాద్
10. బత్తుల కామేశ్వరరావు, కాకినాడ
11. వి. నరసింహాచారి(?), కాకినాడ
12. కాశిన వెంకటేశ్వరరావు, కాకినాడ
13. కాశిన జగన్మోహనరావు. కాకినాడ.

# యువ

## సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు చక్రపాణి

సంపుటి 36 జూలై 1977 సంచిక 1



ఆంధ్రప్రదేశ్ తొలి మహిళా గవర్నర్ శ్రీమతి శారదా ముఖర్జీ

ప్రభుత్వ కార్యాలయాలలో ఖర్చు తగ్గించవలసిందని ఆదేశిస్తూ, కేంద్ర ప్రభుత్వ ఆర్థిక మంత్రిత్వశాఖ కార్యదర్శి ఇటీవల ఒక ప్రకటన చేశారు. ఆ ప్రకటనలో ఉదహరించిన అంశాలను పరిశీలిస్తే ప్రభుత్వ కార్యాలయాలలో అనవసరమైన ఖర్చు ఇంతవరకూ ఎంత ఎక్కువగా జరుగుతోందో బోధపడుతుంది. అలాటి అనవసరపు ఖర్చు ఇన్నాళ్ళూ జరుగుతూ ఉండక పోయినట్లయితే, ఆర్థిక మంత్రిత్వశాఖ కార్యదర్శి, ఖర్చు తగ్గించవలసిందనే ప్రకటన చేయవలసిన అవసరమే ఉండేదికాదు.

ఏమయినా, కేంద్రప్రభుత్వోద్యోగులూ, రాష్ట్రప్రభుత్వోద్యోగులూ చాలా జాగ్రత్తగా పరిశీలించవలసిన విషయం ఇది ప్రభుత్వోద్యోగులకు యిచ్చే జీతాలూ, భత్యాలూ యిళ్ళ అద్దెలూ అన్నీ ప్రజల డబ్బు. ఈ డబ్బంతా ప్రజలను పీడించి వసూలుచేస్తున్న పన్నులద్వారా వచ్చేదే.

స్వాతంత్ర్యం వచ్చిన గత ముప్ఫయి సంవత్సరాలనుంచీ, ఏటేటా ప్రతి పన్నూ ఎక్కువకావడమే కాని, తగ్గడమనేది జరగలేదు. రోజురోజుకూ పెరిగిపోతున్న ధరలతో, నిత్యజీవితావసర వస్తువులను కొనుక్కొని సంసారాలు గడపడమే చాలా కష్టంగా ఉన్న సామాన్యపౌరుల మనుగడకు, పన్నుల పెరుగుదల మరొక అదనపుభారం అవుతున్నది.

పన్నులను తగ్గించినట్లయితే, ప్రజల నిత్యజీవితానికి అవసరమైన అనేక వస్తువుల ధరలు కొంతవరకు తగ్గడమూ, ప్రజలు యిచ్చుకోవలసిన పన్ను కూడా తగ్గడమూ జరుగుతుంది. దానివల్ల సామాన్యపౌరుల, అంటే ఎదుగూ బొదుగూలేని తక్కువ ఆదాయం వచ్చే కుటుంబీకుల మనుగడ కొంత వరకైనా యిబ్బందిలేనిది అవుతుంది.

అయితే, ప్రభుత్వ కార్యాలయాల ఖర్చులూ, ప్రభుత్వోద్యోగులు చేసే వ్యయమూ తగ్గి, ప్రభుత్వానికి కావలసిన డబ్బు అవసరాలు తగ్గితేగాని, పన్నులను తగ్గించడం సాధ్యంకాదు. ఈ దృష్టితోనే ప్రభుత్వ కార్యాలయాల ఖర్చును తగ్గించవలసినదని ఆర్థిక మంత్రిత్వశాఖ కార్యదర్శి ప్రభుత్వోద్యోగులకు సూచనచేసి ఉండవచ్చును. కేంద్రప్రభుత్వ కార్యదర్శి చేసిన సూచన కేంద్రప్రభుత్వ కార్యాలయాలకు సంబంధించినదే అని అనుకోనక్కరలేదు. రాష్ట్రప్రభుత్వోద్యోగులు ఈ అంశాలను జాగ్రత్తగా గమనించి, ప్రభుత్వపు ఖర్చులను తగ్గించాలి. మరొక ముఖ్యమైన విషయం ఏమిటంటే, ప్రభుత్వ వాహనాలను సొంతపనులకు ఉపయోగించడం! రాష్ట్రాల రాజధానులలోను, జిల్లా కేంద్రనగరాలలోను, ప్రభుత్వపు జీపులలో, ఆ శాఖలకు సంబంధించిన అధికారుల భార్యాబిడ్డలు సంచారం

చెయ్యడం ఎక్కువగా కనిపిస్తూ ఉంటుంది. అలా చెయ్యడం, ప్రభుత్వపు నిబంధనలకు వ్యతిరేకం. అయినా ఎంతోమంది ఈ పని చేస్తూనేఉన్నారు. ప్రజలు దీనిని గమనిస్తూనే ఉన్నారు. మనదగ్గర తీసుకున్న పన్నులు, ఈ జీపుల పెట్రోలుకు ఖర్చు అవుతున్నాయనేభావం ప్రజలలో కలుగుతూనే ఉంది. అయినా, తమలాటి ప్రజలే అయిన ఉద్యోగుల మనస్సుకు బాధ కలిగించడం ఎందుకు అనే భావంతో, ప్రజలు మాట్లాడకుండా వూరు కుంటున్నారు. ఈ విషయాన్ని గ్రహించి, ప్రభుత్వోద్యోగులు ప్రభుత్వ వాహనాలను తమ సొంతపనులకు త్రిప్పడం మానుకుంటే, ప్రజల మన్ననలకు పాత్రులవుతారు. ప్రభుత్వోద్యోగులు మానుకోవలసిన ఇలాటి అలవాట్లు అనేకం ఉన్నాయి. అవి వారికే తెలుసు.

ఎమర్జెన్సీ అమలులో ఉన్న కాలంలో అనేక ఘోరాలు జరిగాయి. కాని, కొన్ని మంచి ఫలితాలుకూడా లేకపోలేదు వాటిలో ముఖ్యమైనది, ప్రభుత్వ కార్యాలయాలలో పని కొంతవరకు చురుకుగా జరగడం. న్యాయానికి, ప్రభుత్వ కార్యాలయాలలో పని చురుకుగా జరగడానికి ఎమర్జెన్సీ అవసరం లేదు. పనిచేయవలసిన కాలంలో, ప్రతి ఉద్యోగి తన బాధ్యతను, తనకు జీత భత్యాలు యిచ్చి పోషించే ప్రజలపట్ల తన విధినీ మనసులో పెట్టుకొని, కాలాన్ని వృధాగా గడపకుండా తను చెయ్యవలసిన పనిని చేసినట్లయితే, ప్రభుత్వ కార్యాలయాల చుట్టూ తిరగవలసిన అవసరం ప్రజలకు ఉండదు.

అనేక ప్రభుత్వ కార్యాలయాలలోని ప్రభుత్వోద్యోగుల వివిధ అంతస్తులలో వివిధమైన లంచగొండితనం ఎక్కువగా ఉందని ప్రజలలో ఒక నమ్మకం ఉంది. ఇది నిజం కావచ్చు; అబద్ధం కావచ్చు. కాని ప్రభుత్వోద్యోగులపట్ల అలాటి నమ్మకం ప్రజలలో ఉండటం. ప్రభుత్వానికే ఒక కళంకం. ఈ కళంకాన్ని పోగొట్టడానికి అన్ని అంతస్తులలోని ప్రభుత్వోద్యోగులూ కృషి చెయ్యాలి. ఈ కృషికి ప్రభుత్వోద్యోగులు ప్రత్యేకం చెయ్యవలసిన దేమీ లేదు. ఏ రోజు పనిని ఆ రోజు ముగించడానికి, తమ ఆఫీసు పనివేళలో, తమ పనిని శ్రద్ధగా చేస్తే చాలు. తాము జీత, భత్యాలు తీసుకోవడం ఆ పని చెయ్యడానికే. తమకు జీత భత్యాలు యిచ్చి తమకూ, తమ కుటుంబానికీ పోషణ కల్పిస్తూ, తమకొక గౌరవస్థానాన్ని యిచ్చిన ప్రజల పనులను చెయ్యడానికి. లంచాలకు చెయ్యిజాపడంకన్న హీనమైన ప్రవర్తన మరొకటి లేదు. అలాటివారు ఎవరైనా ఉంటే, వారు తమ ప్రవర్తనను మార్చుకోవాలి. అలా చేసినట్లయితే, ప్రజలకు తమపట్ల గౌరవాన్ని కలిగించుకోవడమే కాక, ప్రభుత్వంపట్ల ప్రజలకు విశ్వాసాన్ని పెంపొందించిన వారవుతారు.

—:o :o—

జులై నెల యువ భావపరిచయ పోటీ

**బహుమతి పొందిన వ్యాఖ్య**



*డబ్బుకు చతురంగం – దొంగకు చదరంగం*

— ఎ వేణుధర్ రెడ్డి హన్మకొండ

ఆగస్టు నెల యువ

## భావపరిచయ పోటీ

బహుమానం రూ 25-00





**ఈ కార్టూనుకు హాస్యయుత వాఖ్య (Caption) కావాలి**

గమనిక వ్యాఖ్యలు పోస్టుకార్డుమీదనే వ్రాయాలి జులై 2వ తేదీ లోపు అందాలి




నిశాదేవి పశ్చిమ గవాక్షానికి విసురు విసురుగా చీకటి తెరలు లాగేస్తోన్నవేళ

పాపంతో ఒడినిండిన విధవ పడుచులు వడివడిగా నడిచి ఊరుబయట పాడు బడిన బావిలోకి భళ్లున దూకి చచ్చేవేళ—

ఆ అసుర సంధ్యావేళ పచ్చని పొలాల మధ్యనుంచి పరుగెత్తుకుని వచ్చి ఆగింది బస్సు. అందులోనుంచి దిగిన వాళ్ళంతా ఎవరిదోవన వాళ్లు తలవంచుకుని ఊళ్ళోకి వెళుతున్నారు, ఎదురైన వాళ్ళని పలుకరిస్తూ.

చంద్రం ఆ ఊరికి కొత్తగా వస్తున్నాడు కనుక బస్సుదిగి చుట్టూ చూస్తూ నిలబడ్డాడు. రేపటినుంచి తాను నివసించబోయే ఈ ఊరు ఎలాంటిదో, ఎన్నెన్ని అనుభవాలను తనకోసం దాచి ఉంచిందో చూడాలనుకుంటూ ఉండగానే ఠకీమని శాల్యూట్ కొట్టారు ఇద్దరు కానిస్టేబుల్స్.

"ఫర్వాలేదు, గుర్తు పట్టేశారు" అనుకున్నాడు చంద్రం.

"రండి సార్, వెళ్దాం" అన్నాడొక కానిస్టేబుల్.

"పైన సామాను ఉంది దించాలి" అన్నాడు చంద్రం

"తమరు పదండి సార్. సామాను నేను ఇంటికి తీసుకవస్తాను" అన్నాడు రెండో అతను. ఆ సామాను వివరాలు చెప్పి ముందుకు సాగాడు చంద్రం.

"దూరమా ?" అని అడిగాడు తనకు దారి చూపిస్తున్న వాడితో.

"అదుగో. ఆ రావిచెట్టుదగ్గర లైటు కనిపిస్తోందే, అదే సార్ స్టేషను" అన్నాడు కానిస్టేబులు.

చంద్రం పోలీసుస్టేషనులోకి అడుగుపెట్టగానే ఇన్‌స్పెక్టరు స్వాగతం పలికాడు.

"వెల్‌కం టు యు మిష్టర్ చంద్రశేఖర్......అయామ్ లక్ష్మీకాంత్" అన్నాడాయన ఆదరంగా చెయ్యిచాపుతూ.

చిరునవ్వుతో కరచాలనం చేస్తూ "గ్లాడ్ టు మీట్ యు" అన్నాడు చంద్రం.

"మీరు నిన్ననే వస్తారనుకున్నాం" అన్నాడు లక్ష్మీకాంత్‌గారు.

"రావల్సింది కొంత సామాను అక్కడ మిగిలిపోయింది. ఇటువైపు వచ్చే ఏ లారీలోనో పంపమని చెప్పి వచ్చాను. ఆ ఏర్పాటు చేసుకురావటంతో కొంచెం లేటయింది."

"నిన్నటినుంచి మన భటులు మీకోసం ప్రతి బస్సూ గాలించేస్తున్నారు."

"చూడగానే గుర్తు పట్టారు" అన్నాడు చంద్రం నవ్వుతూ.

"పోలీసు డిపార్టుమెంటు వాళ్ళుగదా. దొంగలమాట ఎలావున్నా, వాళ్ళ దొరలనన్నా గుర్తుపట్టారు" అన్నాడు లక్ష్మీకాంత్‌కూడా నవ్వేస్తూ.

ఇంతలో రెండు కాఫీలు వచ్చినయి. అవి త్రాగడం పూర్తయిన తర్వాత లక్ష్మీకాంత్ అక్కడ పనిచేస్తున్న వాళ్ళందర్నీ ఒక్కొక్కళ్ళనే పరిచయం చేశారు. వాళ్ళంతా యాంత్రికంగా శాల్యూట్ కొట్టారు.

"చార్జి తీసుకుంటారా ? మంచిరోజు చూస్తారా ?" అని అడిగాడు లక్ష్మీకాంత్ గారు.

"నాకా పట్టింపులేం లేవు. మీరు ఎప్పుడు తీసుకోమంటే అప్పుడే తీసుకుంటాను."

సంతకాలు చేసిన తర్వాత బీరువాల తాళం చెవులు చంద్రానికి అందిస్తూ "అన్నీ చెక్‌చేసుకోండి" అన్నాడు లక్ష్మీకాంత్‌గారు.

"ఫర్వాలేదు మనల్ని మనమే నమ్మలేకపోతే ఎలా ?" అన్నాడు చంద్రం చిరునవ్వు చిందిస్తూ.

"ఫైల్స్ ఒకసారి చూస్తానంటే, ఆ కేసులగురించి క్లుప్తంగా చెప్తాను"

"నేను తర్వాత తీరిగ్గా చూసుకుంటానులెండి ఇప్పుడు మీరేం చెప్పినా చెవి కెక్కదు . పోనీ ఈ ఊరుగురించి రెండు ముక్కలు చెప్పండి..."

"చెప్పడానికి ఏముందండి? మనదేశంలోని పల్లెటూళ్లు అన్నీ ఒకేలాగుంటాయి. ఇక్కడివాళ్ళు ఎక్కువశాతం అమాయకులు. దేన్నిగురించీ స్వంతంగా ఆలోచించరు. ఆలోచనల దగ్గరనుంచీ ప్రతిదీ స్పూన్‌ఫీడింగ్ అంటే ఎక్కువ యిష్టం. అంచేత ఎవరేది చెపితే అది తేలిగ్గా నమ్ముతారు. ఆ చెప్పేవాళ్ళకు మాత్రం ఎవరి స్వార్థం వాళ్ళకుంటుంది."

"తెలుగుదేశంలో ఏదో ఈ మారుమూల పల్లెటూళ్లో పడేశారు. నిశ్చింతగా ఉండవచ్చనుకున్నాను. ఇక్కడా ఇంతేనా ?" అన్నాడు చంద్రశేఖర్ నవ్వుతూనే.

"ఎక్కడయినా ఇంతేనండి. ఈ ఊళ్లో జనాన్ని చూస్తే పనీ పాటా లేకుండా రోడ్లమీద తిరుగుతూ కాలక్షేపంచేసే సోమరిపోతుల్లా కనిపిస్తారు కానీ వీళ్ళంతా నివురుగప్పిన నిప్పులాంటివాళ్ళు. ఎవరైన రెండు చిదుగులువేసి ఉఫ్‌మని ఊదారంటే, ఊరుఊరంతా భగ్గుమని మండిపోతుంది. అదిగో అల్లాంటప్పుడే మనకు చేతినిండా పని," అని ముగించారు లక్ష్మీకాంత్‌గారు.

ఇంకొంచెంసేపు లోకాభిరామాయణం మాట్లాడుకున్నాక ఇల్లుచేరారు ఇల్లు స్టేషనుకు రెండు ఫర్లాంగులు ఉంటుందేమో. నడిచి వెళ్ళినా పెద్ద దూరమేమీ కాదు.

ఇల్లు పెద్దదిగాను, సౌకర్యంగాను ఉంది. గేటు తీసుకుని పదిగజాలు నడిస్తే గాని వరండామెట్లు రావు. ముందువైపువున్న ఖాళీ స్థలంలో చిన్న పూలతోట శ్రద్ధగా పెంచబడింది. వరండాదాటి లోపలికివెళితే విశాలమైనహాలు. ఈహాలుకు కుడి పక్కగా నున్నదే పడకగది. ఈ గదికూడా పెద్దదే. హాలుకు వెనకపక్క దీర్ఘచతురస్రాకారంగా ఇంకొక గది. ఇది భోజనాలకు వాడుకోవచ్చు. దీనిని ఆనుకుని ఉన్న మరోగది వంటకీ, స్టోరుకీ ఉపయోగించుకోవచ్చు. ఇవన్నీ దాటి వెళితే విశాలమైన పెరడు ఉంది. ఒకమూల బావి, కొంచెం ఇవతలగా బోరింగు పంపూ ఉన్నాయి. ఈ రెండిటికి మధ్యన రెండు అరటిచెట్లు గెలలు తొడుగుతూ ఉన్నాయి. మరోమూల స్నానాలగది వగైరా. ప్రహరీని అంటిపెట్టుకుని ఉన్న మల్లెపందిరి విరగబూసింది.

"ఎలా వుంది ఇల్లు ?" అని అడిగారు లక్ష్మీకాంత్‌గారు.

"బావుంది"

"ఈ ఊళ్లో ఇంతకన్న మంచి ఇల్లు దొరకదు."

"బావీ, పంపూ రెండూ ఉన్నాయే ?"

"నూతిలోనివి ఉప్పునీళ్ళు పంపులోవి మంచినీళ్ళు ఈ ఊళ్ళోని జలమే కాదు జనంకూడా ఇలాగే గమ్మత్తుగా ఉంటారు "

చంద్రశేఖరం ప్రసంగం మార్చాడు "మీ బెటర్‌హాఫ్‌కి మల్లెపూలంటే ఇష్టం అనుకుంటాను."

"లేదండీ. ముందూ, వెనకానున్న ఈ పూలమొక్కలన్నీ నీలవేణివి."

"నీలవేణి ఎవరండీ ?"

"నీలవేణి ఒక అందమైన కావ్యం రేపో మాపో మీరే చూస్తారుగా" అని నవ్వుతూ లక్ష్మీకాంత్‌గారు లోపలికి నడిచారు.

హాల్లోకి వచ్చేటప్పటికి కుర్చీలో ఎవరో కూర్చుని ఉన్నారు. ఆయన్ని గవర్నమెంటు హాస్పిటల్లోని డాక్టరు సత్యమూర్తిగా చంద్రానికి పరిచయం చేశాడు లక్ష్మీకాంత్ గారు డాక్టరు సత్యమూర్తికి పాతికేళ్ళు దాటాయో లేదో అన్నట్లుగా ఉంటాడు. మనిషి చామనఛాయగా ఉన్నా ఆకర్షణీయమైన ముహం నొక్కుల జుట్టూ అతనికి ఎనలేని అందాన్ని తెచ్చిపెడుతున్నాయి. చాలా సరదా ఆయిన వ్యక్తి అనిగూడా చెప్పారు లక్ష్మీకాంత్‌గారు.

"నా సరదా సమయాన్నింటినీ లక్ష్మీకాంత్‌గారు వచ్చి చెడగొడుతూ వుంటారు" అని బదులు చెప్పారు సత్యమూర్తిగారు.

"రేపటినుంచి మీ కా బెంగలేదు నేను వెళ్ళిపోతున్నాను" అన్నాడు లక్ష్మీకాంత్‌గారు

"ఆయన చార్జి నేను తీసుకున్నాను కనుక నేను మిమ్మల్ని డిస్టర్బ్ చేస్తుంటాను," అని నవ్వాడు చంద్రం

"ఊరికే మీరలా అంటున్నారుగాని, మీ రాకవల్ల నాకు నష్టమేమీ ఉండదు నేను ఇంకా బ్రహ్మచారినే గాబట్టి ఎవరేవేళ వచ్చినా అభ్యంతరంలేదు. నేను మాత్రం నా మిత్రులందరి ఇళ్లకూ భోజనంవేళకో, ఫలహారం వేళకో వెళుతూ ఉంటాను. ఈ ఊళ్లో కలవారందరి భార్యలూ నా పేషెంట్సే కాబట్టి వాళ్ల జబ్బులు నాకు తెలుసు నాజబ్బేమిటో వాళ్ళకూ తెల్సు..." అన్నాడు సత్యమూర్తిగారు చిరునవ్వుతో

ఇంతలో టిఫిన్ తీసుకొచ్చి ముందు పెట్టాడు జాన్. లక్ష్మీకాంత్‌గారు టిఫిన్ తీసుకొంటూ జాన్ గురించి గూడా చంద్రానికి చెప్పాడు.

"వీడు జాన్ అని వంటపని బాగా చేస్తాడు. మీరూ ఇతన్నే ఉంచేసుకోండి..."

"జాన్ చాలా నమ్మకమైనవాడు. గురుభక్తి చూపటంలో హనుమంతుడంతటి వాడు," అని చెప్పాడు సత్యమూర్తిగారు.

"ఏ ఊరు నీది?" అని చంద్రం జాన్‌ను అడిగాడు.

"మనదా అండీ?"

"మనది కాదు నీది..."

"అయ్యా నాది కర్నూలండీ" అన్నాడు జాన్ వినయంతో వంగిపోతూ.

"చూశారు గదా. కాస్త తోక ఝాడిస్తూ ఉంటాడు. మీరు కట్ చేస్తుండాలి" అన్నాడు సత్యమూర్తిగారు.

"ఎడిషనల్ డ్యూటీస్ చాలా ఉన్నాయే," అని నవ్వాడు చంద్రం.

మరో అయిదు నిమిషాల తర్వాత డాక్టరుగారు లేవబోతుండగా, పతంజలి గారు వచ్చారు.

"ఈయన పతంజలిగారని బాలాజీ టింబర్ డిపో ప్రొప్రయిటర్. మన ఇంటి యజమాని. ఈ ఊళ్ళోని ఉన్నవాళ్ళందరిలోకీ ఉన్నవాడు," అని పరిచయం చేశాడు లక్ష్మీకాంత్‌గారు.

చంద్రంతో కరచాలనంచేసి కాసేపు లక్ష్మీకాంత్‌గార్ని గురించి పొగిడాడు పతంజలిగారు. డాక్టరు సత్యమూర్తిగారితో కూడా చనువుగా మాట్లాడాడు. చంద్రంగారికి ఏ సాయం కావల్సివచ్చినా కబురు చెయ్యమనిచెప్పాడు.

మరి కాసేపు లక్ష్మీకాంత్‌గారు, సత్యమూర్తిగారు, పతంజలిగారు ఇదివరలో జరిగిన విషయాలన్నీ నెమరువేసుకుంటూ ఉండిపొయ్యారు

రాత్రి ఎనిమిది గంటలవేళ డాక్టరు సత్యమూర్తిగారు, పతంజలిగారు శలవు తీసుకుని వెళ్ళిపొయారు.

మర్నాడు మధ్యాహ్నం లక్ష్మీకాంత్‌గారు గూడా వెళ్ళిపొయ్యారు. ఆయన కుటుంబాన్ని వారంరోజుల క్రితమే పంపించేశారు. కేవలం చంద్రంకోసం ఎదురుచూస్తూ ఉన్నారు గాబట్టి, ఇతను రాగానే అందరిదగ్గరా శలవు తీసుకొని వెళ్ళిపొయ్యారు. మొత్తంమీద లక్ష్మీకాంత్‌గారు ఆ ఊళ్ళొ అందరి అభిమానాన్ని చూరగొన్నట్లే కనిపించాడు. సాధారణంగా పోలీసు ఆఫీసర్ల మీద

ఎక్కువ జన సంచారం ఉండదేమో అనుకున్నాడు. కొంతదూరం రాగానే ముక్కు పుటాల్ని బద్దలు చేస్తున్న వాసన తగిలింది. అది ఏ బాపతుదో అతనికి ఇట్టే తెలిసిపోయింది. నవ్వుకుంటూ ముందుకు సాగాడు.

ఇంకొన్ని గజాలు నడవగానే ఎవరో పెద్దగా ఏడ్చిన శబ్దం వినిపించింది. అది నిజమా, తను భ్రమపడ్డాడా అని రెండు నిమిషాలు అక్కడే ఆగి విన్నాడు. చుట్టూ ముళ్ళకంచ పాతిన తోటలో నుంచి ఎవరో స్త్రీ పెద్దగా ఏడుస్తున్నట్లు స్పష్టంగా వినిపించింది. దారి వెతుక్కుంటూ తోటలోకి నడిచాడు. పెద్దపెద్ద చెట్లన్నీ చీకట్లో చింపిరినెత్తి దయ్యాల్లా వున్నాయి

ఏడుపు ఆగి ఆగి వినిపించింది. నిజమేనా? దయ్యాలూ, భూతాలూ కావుగదా? దేవుడే లేడంటుంటే, దయ్యాలు ఎక్కడనుంచి వస్తాయి.

మళ్ళీ ఏడుపు వినిపించింది. వడివడిగా అటువైపు నడిచాడు. ఒక చిన్న పెంకుటిల్లు. లోపల ఒక గుడ్డి దీపం గుమ్మంలో ఒక స్త్రీ శోకాలు పెడుతోంది. ఎదురుగా వెళ్ళి నుంచిని అడిగాడు.

"ఎవరమ్మా నువ్వ ?"

"మళ్ళీ వచ్చావా, రా...నీకేం కావాలో తీసుకో...కానీ నా మొగుణ్ణి ఐతి కియ్...." అంటూ వడివడిగా చంద్రం దగ్గరకు వచ్చిందామె.

ఆ అవతారాన్నిబట్టి ఆమె ఎవరో పిచ్చిదై వుంటుందని ఊహించాడు చంద్రం.

"నీకు కావల్సిందేందో తీసుకో. నా పెనిమిటిని నాకియ్—రా..." అంటూ చంద్రం చెయ్యిపట్టుకుని లాగటం మొదలుపెట్టింది.

చంద్రం పరిస్థితిని అర్థంచేసుకుని, ఆమె చెయ్యి విడిపించుకుని వెనక్కి నడిచాడు. ఆమె వేగంగా వచ్చి అతని చెయ్యి పట్టుకుని అడిగింది.

"నన్నేంచేసి పోతావు చెప్పు...నా గతేమిటి ? చెప్పురా, చెప్పు" అనిగొంతు చించుకుని అరుస్తున్నది.

చంద్రం అక్కడనుంచి బయటపడటం తప్ప చేయగలిగిం దేమీలేదని తెల్సు కుని, వెంటపడుతున్న ఆమెను వీలైనంత సౌమ్యంగా విడిపించుకుంటూ వచ్చేశాడు.

వెనుకనుంచి ఆమె ఉమ్మేస్తూ, తిడుతూ, అరుస్తూ, ఏడుస్తూ గోలచేస్తూనే ఉంది.

ఎవరీమె ?

ఈమె వెనుకాల ఏదో పెద్ద కథే ఉండి ఉంటుంది తెలుసుకోవాలి అను కుంటూ ఇంటికి చేరాడు చంద్రం

*　　　*　　　*

## 2

చంద్రదేఖర్‌కు పెందరాళే మెలుకువ వచ్చింది వొళ్ళు విరుచుకుంటూ లేచి టైం చూచాడు ఆరుగంటలుదాటి పది నిమిషాలు అయింది జాన్ వచ్చేవేళ అయింది వాడొచ్చి ఎలాగు తలుపులు పగలగొడతాడు కనుక ఇంకా సేపు పడుకునే వీలులేదు అనుకుంటూనే టూత్‌బ్రష్ నోట్లో పెట్టుకుని వరండాలోకి వచ్చి నిలబడ్డాడు

రోడ్డుమీద జనం మసలటం ఇంకా ప్రారంభం కాలేదు మంచుతెరలు దట్టంగా దిగి ఉన్నాయి పదిగజాల దూరంలో ఉన్న మనిషి స్పష్టంగా కనిపించటంలేదు చుట్టూ చూస్తున్న చంద్రం దృష్టి రోడ్డుమీద కలాపినీళ్ళు చల్లుతున్న ఆమెమీద పడింది అనుకోకుండానే చంద్రం వరండా మెట్లు దిగి గులాబి మొక్కలదగ్గరకు వచ్చి తచ్చాడుతూ నిలబడ్డాడు ఆమె మాత్రం ఇతన్ని గమనించినట్లులేదు తలొంచుకుని పనిచేసుకుంటున్నది ఇంతలో మాటలుగూడా వినిపించటంతో చంద్రం ఒక చెవి అటు పడేశాడు

"ఇదిగో జాన్ మాట మీ కొత్తఅయ్యగారు మంచాయనేనా ?"

"చాలా మంచారండీ వెరీ బ్యూటిఫుల్ "

"అద్సరేలే ఆయనకు పెళ్ళయిందా ?"

"కాలేదండి "

"నిజమేనా ?"

"నిజంగానేనండి "

"ఇంతదాకా ఎందుకని చేసుకోలేదుట ?"

"బ్యూటిఫుల్ గాళ్ కనపటలేదంట "

"వాయబ్బో దేశమే గొడ్డుపోయిందా ? కళ్ళకేమన్నా చత్వార మొచ్చిందా?"

"అది కనుక్కుని చెప్తానండి"

"అవునుగాని, ఆయనతో మాట్లాడాలి ఎప్పుడు రాను ?"

"ఆనక రండి ఇవాళ శలవేగదా ఇంట్లోనే ఉంటారు," అని ఆమె ప్రశ్న లకి జవాబులు చెప్పి గేటుతీసుని లోపలికి వస్తున్న జాన్‌ను పూలమొక్కల దగ్గర నిలబడి వీళ్ళ సంభాషణ అంతా విన్న చంద్రం పిల్చాడు

ఎవరామె ?

నీలవేణి అండి

అందే ఎవరు ?

మన ఆపోజిట్ హౌస్ అండి"

ఆమెకు పనేంలేదా ఆపోజిట్ హౌస్ గురించి కూపీలు లాగటం తప్ప

"పనిచేస్తూనే ఉందండి కలాపనీళ్ళు చల్లుతోంది

"షటప్

"యస్సర్

"వెళ్ళి ఆమెతో చెప్పరా మా అయ్యగారికి పెళ్ళయింది అమ్మగారు చాలో అందంగా ఉంటుంది అప్సరసలా ఉంటుంది అని చెప్పరా ఫో

"యస్సర్ అనేస ఆయన ఆజ్ఞను పాటించటానికి వెనక్కి వెళ్ళాడు జాన్ చంద్రం పెరట్లోకి వెళ్ళిపొయ్యాడు

రెండురోజుల క్రిందట సామాను మొత్తం వచ్చేసింది చిన్న చిన్నవన్నీ ఎక్కడివక్కడ సర్దేశాడు జాన్ రెండు పెద్ద చెక్కపెట్టెలు మాత్రం ఉండి పొయ్యాయి వాటిని ఇవ్వాళ తెరిచి వాటిల్లో ఉన్న పెయింటింగ్స్ అన్నీ హాల్లోనూ పడకగదిలోనూ అందంగా వేలాడదీయించాడు ఏది ఎక్కడ ఉండాలో ఎంత ఎత్తులో ఉండాలో సరిచేసుకుంటూ మేకులు కొట్టించి, గట్టిగా తాళ్ళు కట్టించి చూసుకుంటూ పని పూర్తిచేసుకునేటప్పటికి పదకొండు గంటలు దాటింది ఆ బొమ్మలన్నీ చాలా అందంగా ఉన్నాయనీ ఒక్కొక్కటీ ఎంతెంత ఉంటుందనీ అడిగాడు జాన్ నోటికొచ్చిన అంకె చెప్పాడు చంద్రం చాలా చవకగా కొన్నారని మెచ్చుకున్నాడు వాడు

వాడు వంట పూర్తిచేసి వెళ్ళిపొయ్యాక స్నానం భోజనం పూర్తిచేసుకొని తాపీగా హాలు మధ్యలో కూర్చుని చుట్టూ ఉన్న చిత్రాలను చూసుకుంటూ ఏవో ఊహల్లో తేలిపోతూ ఉండగా గుమ్మంలో ఏదో అలికిడి అయితే తిరిగి చూశాడు

చూడగానే చూపుల్ని ఆకట్టుకోగలిగిన అందమైన అమ్మాయి ఆమె వెనకనే మరో అబ్బాయి నిలబడి ఉన్నారు

నమస్కారమండీ నా పేరు నీలవేణి వీడు నాతమ్ముడు మురళి

రండి కూర్చోండి" అని వాళ్ళకు కుర్చీలు చూపించాడు చంద్రం

కూర్చున్నాక కొద్దిక్షణాలు మౌనంగా అతని చూలుల్లో చూపులు కలుపుతూ ఉండిపోయింది. తర్వాత నెమ్మదిగా మొదలుపెట్టింది.

"మేము ఎదురింట్లో రోడ్డుమీదకున్న ఆ ముందుగదిలో ఉంటున్నాము. మీతో పరిచయం ఇప్పుడే అవుతున్నదిగాని, ఈ ఇంటితో మా పరిచయం మాత్రం ఈనాటిదికాదు.నాలుగేళ్ళక్రిందటివరకూ మేము ఈఇంట్లోనేఉండేవాళ్ళం కొన్ని పరిస్థితుల కారణంగా, మా అమ్మగారు పోగానే, ఈ ఇల్లు ఖాళీచేయవల్సి వచ్చింది. ఇన్నాళ్ళనుంచీ ఎంత ఇబ్బందిగా ఉన్నా, వేరేఇల్లు చూసుకోకుండా ఆ ఎదురుగదిలోనే ఉండటానికి కారణం లక్ష్మీకాంత్‌గారి కుటుంబంతో మాకున్న పరిచయం తప్ప మరేంలేదు..."

చెప్పటం ఆపింది. ముందుకు వంగింది. తలొంచుకుని ఎడంచేతి బొటన వ్రేలితో మిగిలినవేళ్ళను మీటుతూ ఉండిపోయింది. చంద్రం ఆమెనే నిశితంగా పరిశీలిస్తున్నాడు. నీలవేణి బొద్దుగాను, లావుకు తగినంత ఎత్తుగాను ఉంది తెల్ల కలువల్లా తళతళలాడుతున్న విశాలమైన నేత్రాలమీదకు జారిపడుతున్న ముంగురులు లేని అందాన్ని తెచ్చిపెడుతున్నాయి. రూపలావణ్యాలు ఆకర్షణీయంగా ఉన్నా, వేషధారణమాత్రం అందుకు తగినట్లుగా లేదు మళ్ళీ అన్నది.

"లక్ష్మీకాంత్‌గారి భార్యకు నేనంటే ఎంతో అభిమానం. ఆయనదగ్గరకూడా నాకు బాగా చనువు. కానీ ఎందువల్లో నన్ను మీకు పరిచయం చెయ్యకుండానే వెళ్ళారు..."

"నేను ఉద్యోగరీత్యా ఇక్కడికి వచ్చాను ఇంకా ఎవరిగురించీ ఎక్కువగా తెలుసుకునే అవకాశాలుగూడా లభించలేదు. కానీ ఒక్కటిమాత్రం నేను చెప్ప గలను. నా పరిచయంవల్ల మీకు ఏమంత ఎక్కువ ఉపయోగం ఉండక పోవచ్చు..."

"మీ ఉద్దేశ్యం నాకు అర్థంకాలేదు. బహుశా నన్ను అంచనా వెయ్యటంలో మీరు పొరపడ్డారనుకుంటాను. పొద్దునగూడా మీరు కోపంతో జాన్‌తో అన్న మాటలు నేను విన్నాను. తర్వాత నవ్వుకున్నానుగూడా..."

చంద్రానికి ఈమె మాటలు చాలా విచిత్రంగా ఉన్నయి. కొత్తగా వచ్చిన వ్యక్తిని ఆమె పరిచయం చేసుకుంటున్న తీరులోనే ఏదో ప్రత్యేకత అతనికి కనిపించీ, కనిపించకుండా ఉన్నది. పైగా తను కబురుచేసిన మాటలకు ఆమెకు నవ్వుకున్నదట. దేనికని అడిగాడు.

"మరేం, మీ జాన్‌వచ్చి ఏమని చెప్పాడో తెల్సాండి . మా అయ్యగారి అయ్యగారికి పెళ్ళయిందిట. అమ్మగారు అప్సరసలా ఉంటారుట అని చెప్పాడు..."

వింటున్న మురళికి, చంద్రానికిగూడా నవ్వొచ్చింది. చంద్రం మాత్రం వాణ్ణి 'ఇడియట్' అని తిట్టాడు.

నీలవేణి చెప్పుకుపోయింది. "...మీ స్వంత విషయాల్లోకి ముక్కూముహం తెలియనివాళ్ళు ఆసక్తిచూపటం మీకు నచ్చకపోవచ్చు. మీ సంగతేమోగాని నామటుకు నాకు, ఎవరైనా మరొకరి ఇంటివిషయాల గురించి చెప్పుకుంటున్నారని వినటానికే బాధగా ఉంటుంది. అది సహజంకూడా..."

చంద్రం అందుకున్నాడు. "మీ మాటలు నాకు చాలా వింతగా ఉన్నాయి. లక్ష్మీకాంత్‌గారు నన్ను మీకు పరిచయం చెయ్యకుండా వెళ్ళలేదని విచారపడ్డారు. కానీ నా విషయాలు మీరు తెల్సుకోగూడదు, మీ విషయాలు నేను తెల్సుకోగూడదనీ అంటున్నారు. ఈ రెండింటికీ పొంతన కుదరటంలేదు."

"నా అభిప్రాయం ఏమిటంటే,నా గతంలోకి మీరు,మీ గతంలోకి నేను తొంగి చూడగూడదని. ఐమీన్, ఇవాల్టినుంచి నేను నీలవేణిగా, మీరు పోలీసుఉద్యోగి చంద్రశేఖర్‌గా పరిచయం అవుతున్నాం. మీ పరిధిలో మీరూ, నా పరిధిలో నేనూ అంటూ మనం స్నేహం చెయ్యటానికి వీలుంటుందేమో కనుక్కుందామని వచ్చాను. మీ శ్రీమతిగారు వచ్చిఉంటే వారిని ఇదే ప్రశ్న అడుగుదామనుకున్నాను. సరే, పొద్దున మా సంభాషణ ఎలానూ మీ చెవిన పడనేపడింది. కనుక మిమ్మల్నే అడుగుదామనివచ్చాను..."

"బాగానే ఉందిగాని, నా స్నేహంవల్ల మీకేమిటి లాభం?" అంటూ సూటిగా అడిగాడు చంద్రం. "నా కిదివరకే పెళ్ళయిందిగూడా..." అన్నాడు వెంటనే.

"మీకు పెళ్ళయితే నాకొచ్చిన నష్టమూ లేదు పెళ్ళికాకపోతే వచ్చిన లాభమూ లేదు. నాకై నేను మీ గుమ్మంలోకి వచ్చానుగదాని, నన్ను అందరి ఆడవాళ్ళలాగా భావించకండి. మంచీ, మర్యాదల విషయాల్లో ఒకరిచేత చెప్పించుకోవల్సిన అవసరం నాకు లేదు...ఇంతకీ విషయం ఏమిటంటే, ఆ ఎదురుగదిలో నేనూ, మా తమ్ముడు—వీడూ ఉంటున్నాము. వీడికి వాళ్ళక్కమీద ఎంతో ప్రేమఉంది. అభిమానం ఉంది. కానీ వాడింకా పసివాడిక్రిందే జమ. చదువుగూడా పూర్తికాలేదు. వాడి కాళ్ళమీద వాడే నిలబడలేని స్థితిలో ఉన్న వీడు, నన్ను ఏంచూడగలడు? ఈ ఎదిగీ ఎదగని కుర్రాడి పక్కన, వయసులోఉన్న ఒక అమ్మాయి నిరాధారంగా ఉన్నదిగదా అని ఇంతలేసి కళ్ళతో అనుక్షణం

మావంకే వింతగా చూస్తున్నవాళ్ళు ఈ ఊరినిండా చాలామంది ఉన్నారు వీళ్ళ చూపులకే బెదిరి పారిపొయ్యే తేడిపిల్లను కాదుగానండి, వెంటబడి అల్లరిచేస్తూ రౌడీయిజానికి దిగేందుకుగూడా తయారయిన కోతివెధవలతో పోరాడటంఒంటరి దాన్నయిన నాకు కొంత కష్టంగానేఉంది. మీరు నాకుకొంచెం అండగాఉన్నారని తెలిస్తే, వాళ్ళు కొంచెం తగ్గుతారు లక్ష్మీకాంత్‌గారు ఉన్నంతకాలం ఆయననాకా రక్షణనిచ్చారు. ఆయన నన్ను ఒక చెల్లెలులాగా చూసుకున్నారన్నా అతిశ యోక్తిలేదు...సరె, వచ్చిన పోలీసు ఆఫీసర్లంతా నన్ను లక్ష్మీకాంత్‌గారిలాగే చూడాలనుకోవటం అడియాసే అవుతుంది. నేను మిమ్మల్ని ప్రార్థించేది ఒక్కటే...నేను ఎప్పుడన్నా ఇలాగే మీ ఇంటికి వచ్చి కాసేపు కూర్చుని వెళ్లేందుకు నాకు అనుమతి నివ్వండి. అది చాలు మిగిలినవాళ్ళు నావంక కన్నెత్తి చూడకుండా ఉండటానికి...ఏమంటారు?" అని అడిగింది.

"అలాగే. అందుకేం అభ్యంతరం లేదు." ముభావంగా అనేసి ఊరుకున్నాడు చంద్రం.

నీలవేణి కోరిన కోరికలో అసహజమైనదేదీ లేకపోయినా, ఇందులో ఎక్కడో ఏదో విడ్డూరంగా కనిపిస్తున్నది చంద్రానికి. నిజమే. నీలవేణి అందమైన వాళ్ళందరిలోకి అందమైన ఆడపిల్లే కావచ్చు. అంతమాత్రాన ఊళ్లోవాళ్ళంతా ఈమెపట్ల చులకన భావంతో చూడాల్సిన అవసరం ఏముంది? తల్లీదండ్రీ లేనంత మాత్రాన మంచి మనిషి ఆదరణే కరువు అవుతుందా? పైగా ఆమె గతం గురించి తెల్సుకోగూడదట. అంత అభ్యంతరకరమైన చరిత్రా అది? ఏది ఏమైనా, ఆడపిల్లను చూసి హృదయం స్పందించే స్థితి తనకు ఏనాడో దాటి పోయింది. సుమధురమైన ప్రేమగీతాలను పలికించిన ఆ రాగవిపంచి మూగ వోయింది. ఇంక ఏ స్త్రీ పరిచయమూ తనని కదిలించలేదు. తానిప్పుడు కద లాడే శిలావిగ్రహం మాత్రమే. ఎందరు నీలవేణులు ఎంత దగ్గరగా వచ్చినా... ప్చ్...

"ఇంతకీ మీ శ్రీమతిగారు ఎప్పుడొస్తారు సార్?" అని అడిగాడు, ఇందా కటినుంచి ప్రేక్షకుడిలా వీళ్ళిద్దరివంకా చూస్తున్న మురళి.

"అరె. నీకు మాటలొచ్చునా? ఇందాకటినుంచీ నువ్వు మూగవాడి వను కున్నాను నేను" అన్నాడు చంద్రం నవ్వుతూ.

"మావాడికి సిగ్గు" అని నవ్వుతూ తమ్ముడివంక చూసింది నీలవేణి.



"బహుశా మీ కుండాల్సిన సిగ్గు మీవాడికి వచ్చిఉంటదనుకుంటాను..." అన్నాడు చంద్రం.

"అంటే, నాకు సిగ్గులేదంటారు...సర్లెండి, పద్దవాళ్ళెప్పుడూ చెడ్డవాళ్లుకాదు" అన్నది నీలవేణి.

ఏం చదువుతున్నావు బాబూ నువ్వు?" అని అడిగాడు చంద్రం.

"వాడి పేరు మురళి" అని చెప్పింది వేణి.

"టెంతండీ" అన్నాడు మురళి.

"వాళ్ళ స్కూల్లో వీడే చదువుల్లో ఫస్ట్..." —నీలవేణి.

అంటే మిగిలినవాళ్ళంతా ఇంతకన్నా..." —చంద్రం.

అదేంకాదు. నేను బాగా చదువుతాను. అసలెప్పుడూ నాకు సెవెంటీ పర్సెంట్ పైనే వస్తాయి"

"మీరెంత పోలీసువారైనా అలా ప్రతిదానికీ మమ్మల్ని అనుమానించాల్సిన పనిలేదండి. వాడి చదువు వాడు చదువుకోవటమేగాక, చిన్నతరగతుల పిల్లలకు కొందరికి ట్యూషన్సుగూడా చెబుతున్నాడు. వాళ్ళు బాగానే చెబుతాడని ఒప్పుకున్నారు..." అన్నది నీలవేణి.

మళ్ళీ కాసేపు మౌనం. ఈసారి ఆమె దృష్టి ఆ హాలుగోడలకు నాలుగు వైపులా సున్న అందమైన పెయింటింగ్స్ మీదకు మళ్ళింది.

"మీకు ఆర్ట్‌అంటే ఎక్కువ ఇష్టం అనుకుంటాను..." అన్నదామె.

"కొంత ఇంటరెస్ట్ ఉంది..." అన్నాడు చంద్రం.

"మేం చూడొచ్చునా?" అంటూ లేచి ఒక్కొక్క బొమ్మనే చూస్తూవచ్చింది. వాటిమీద ఒకమూల వ్రాయబడి ఉన్న పేరునుచూసి ఆశ్చర్యంగా అడిగింది.

"చంద్రం అని ఉంది. మీరా ఏమిటి ఇవి వేసింది?"

"నేనే. ఏం అంత ఆశ్చర్యంగా అడుగుతున్నారు?" అని చిరునవ్వు నవ్వాడు చంద్రం.

"మొరటుగా లారీ ఝుళిపించే చేతితో, కుంచెను కదిపి.ఇంతటి అందాన్ని ఎలా సృష్టించారా అని..."

"సాధనమున పనులు సమకూరు ధరలోన..."

"సాధన ఒక్కటే సరిపోతుందంటారా? కాకీ అరుస్తుంది, కోయిలా కూస్తుంది. రెండింటికీ సాధన ఉన్నది. కానీ ఎంత తేడా ఉంది!"

"నిజమే అన్ని పనులూ అందరూ అందంగా చెయ్యలేరు. కొందరికా నేర్పు అబ్బుతుంది. అందుకు ఎవరి కారణాలు వాళ్ళవి."

అతను వేసినవి ఎక్కువ లాండ్‌స్కేప్స్. అవలా అంత అందంగా గీయటానికి ఆధారభూతమైనవాటి గురించిగూడా చెప్పాడు. హాల్లో ఆర్ట్ గేలరీని సొంతంగా ఏర్పరుచుకున్న చంద్రాన్ని, ఆ చిత్రాల్ని మార్చి మార్చి చూస్తూ నీలవేణి అన్నది.

"ఆర్టిస్టులు ఒక రకంగా ఎంతో అదృష్టవంతులు. ఆ కళా జగత్తులో తమదైన ఒక ఊహాలోకాన్ని సృష్టించుకుని, అందులోని అందాలను చూసుకుంటూ తమని తామే మర్చిపోగలరు..."

"ఊహాలోకాల మాటకొస్తే ఆడపిల్లలతర్వాతే ఎవరైనా. అద్దంలోకి చూసుకుంటూ సమస్తలోకాలను మర్చిపోగలదు స్త్రీ. ."

"అందరు స్త్రీలనూ అలా అనకండి. పాపం, తలదువ్వుకునేటప్పుడైనా తీరిగ్గా అద్దంలోకి చూసుకుని పాపటి తీసుకోవటానికిగూడా నోచుకోని స్త్రీలు ఎందరో ఉన్నారు. ఆడవాళ్ళు అలా అద్దాలు పట్టుకూర్చుంటే,మీరు వేళకి ఎలా ఆఫీసులకు వెళ్ళగలుగుతారు... అదలా ఉండండి. వీటిని చూసుకుంటూ కూర్చున్నప్పుడు మీ కేమనిపిస్తుంది?"

"తృప్తి, సంతోషం..."

"ప్రకృతిని మీకు నచ్చిన రీతిలో పట్టుకొచ్చి, మీ ఇంటి గోడలకు తగిలించు కున్నారుగదా వీటిని చూస్తునప్పుడు మీకు గర్వంగా ఉండదా?"

"ఎందుకు గర్వం? కొందరు చరిత్రను సృష్టిస్తారు. కొందరు చరిత్రను రాస్తారు. మరికొందరు చదువుతారు చదివేవాళ్ళు రాసేవాడు గొప్పవాడను కుంటారు. రాసేవాడు. దాన్ని సృష్టిస్తున్నవాడు గొప్పవాడనుకుంటాడు. కానీ ఆ చరిత్ర సృష్టిస్తున్నవాడు మాత్రం తన ఆరాటం, పోరాటం గురించీ పట్టించు కుంటాడుగానీ, ఈ కీర్తి కాంక్షాస్పృహ వాడికంతగా ఉండదు"

"అయితే ఏమిటంటారు?"

"గర్వపడవల్సింది మీలాంటివాళ్ళుగాని నాలాంటివాళ్ళు కాదంటాను."

"బావుంది. మీరంటే ఆర్టిస్ట్, నాదేం ఉంది?"

"అదే చెప్పాను ఇందాక. చూసేవాళ్ళకు ఆర్టిస్ట్ గొప్పవాడుగా కనబడతాడు. ఆర్టిస్ట్‌కు మాత్రం తన చుట్టూఉన్న భగవంతుడి సృష్టి గొప్పదిగా కనిపిస్తుంది."

"కావచ్చు. మధ్యలో నే నెందుకు గర్వపడాలట .."

"ఆ అందమైన సృష్టిలో ఒక భాగమైనందుకు..."

"మీ కళ్ళు దొంగలకోసమే వెతుకుతుంటాయనుకున్నాను. అందమైన భాగాల కోసంగూడా వెతుకుతుంటా యన్నమాట.."

"కళ్లున్నందువల్ల అన్నీ చూడొచ్చు. మీరన్నట్లు దొంగల్నీ చూస్తాను. దొంగతనంగా చూడాల్సినవాటినీ చూస్తాను. డ్యూటీని బ్యూటీగానూ, బ్యూటీని డ్యూటీగానూ చూస్తాను," అన్నాడు చంద్రం నవ్వుతూనే.

"మొదటిది మంచి అలవాటేగాని, రెండోది అంతమంచి అలవాటుకాదు."

"అదీ మంచి అలవాటేఅని, దాన్ని తల్చుకుని నేను గర్వపడవచ్చునని ఈ చిత్రాల్ని చూస్తూ ఇందాక మీరే అన్నారు."

"అఫ్‌కోర్స్. యు ఆర్ యాన్ ఆరిస్ట్..." అన్నది నీలవేణి తనూ నవ్వుతూ.

మరి కాసేపటికి వెళ్తామని లేచారు అక్కా, తమ్ముడూ ఇద్దరూను. చంద్రం గూడా లేచి నిలబడ్డాడు. సందేహిస్తూనే అడిగింది.

"ఇంకో చిన్నకోరిక ఒకటి మిగిలిపోయింది. అడగొచ్చునా?"

"మీ కోర్కెల్ని తీర్చటానికి నేనేమన్నా భగవంతుణ్ణా?"

"అవసరం ఉన్నప్పుడు భగవంతుడే ఏదోరూపంలో కనపడుతుంటాడు. పని పూర్తయ్యాక ఆ అవతారం చాలించేస్తుంటాడు. మీకు తెల్సుగదా..."

"ఎదటివాళ్ళను పొగుడుతూనేకాదు, వాళ్ళను దూషిస్తూగూడా తమ పనులు చేయించుకోవటం ఒక గొప్ప ఆర్ట్. ఆ ఆర్ట్‌లో మీరు గొప్ప ఆర్టిస్ట్ ఇంతకీ పనేమిటో చెప్పండి..."

"మీ ఇంట్లోనుంచి రోజూ రెండుబిందెలు మంచినీళ్ళు పట్టుకెళ్ళటానికి పర్మి షన్ కావాలి..."

"మంచినీళ్ళేగదా, మహరాజుగా పట్టుకెళ్ళండి .."

"థ్యాంక్స్...మరి మాకింక శలవా?" అని అడిగింది నీలవేణి.

"మంచిది, వెళ్ళిరండి..." అన్నాడు చంద్రం వాళ్ళను సాగనంపుతూ.

వాళ్లు వెళ్ళిపోయిన తర్వాతగూడా చంద్రం చాలాసేపు ఆమెగురించే ఆలో చిస్తూ ఉండిపొయ్యాడు చిత్రమైన వ్యక్తిలా కనిపించింది చంద్రానికి ఆమె.

'కాబట్టి, కొన్నాళ్ళు ఈవిడగారితో కాలక్షేపం అన్నమాట. ఈ నీలవేణి నలుగురిగురించీ చెప్పిందేకాకుండా, నలుగురూ ఈమెగురించి ఏమనుకుంటు న్నారోగూడా కొంచెం తెల్సుకోవాలి' అనుకున్నాడు చంద్రశేఖర్.

* * *

## 3

పాలెంనుంచి ఒకమైలుదూరంవెళ్తే ఒకవైపునుంచి చిన్న చెట్టడివి ప్రారంభం అవుతుంది. ఆ అడవికి ముందే ఒక చిన్న కొండగూడా ఉంది. ఈ కొండదగ్గరే కొంతమంది చెంచువాళ్ళు గుడిసెలు వేసుకుని ఉన్నారు. ఈ గుడిసెల దగ్గర్లోనే ఫారెస్ట్ డిపార్ట్‌మెంటు వాళ్ళ చెక్‌పోస్టుగూడా ఉంది. అయినా వాళ్ళ కళ్ళుగప్పి ఈ చెంచువాళ్లు అడవిలోకిపోయి, అక్కడ దొరికే వస్తువులు కొన్ని దొంగ తనంగా తెచ్చి చుట్టుపక్కలనున్న పల్లెల్లో అమ్మి డబ్బు చేసుకుంటూ ఉంటారు పట్టుబడితే తిట్లూ, చీవాట్లూ తింటూ ఉంటారు. కాళ్ళు పట్టుకుంటూ ఉంటారు. ఆ తర్వాత మళ్ళీ మామూలే.

పాలెంలో చెప్పుకోదగ్గ వ్యాపారం కలప అడితీలది. ఆ ఊళ్లో ఉన్న కలప అడితీలన్నిటిలోకి పెద్దది బాలాజి టింబర్ డిపో. ఈ డిపో ప్రొప్రయిటరే పతంజలిగారు

పతంజలిగారు ఆ చుట్టుపక్కల బాగా పరపతిగల పెద్దమనిషి. పై చదువు అంతగా ఒంటబట్టక తండ్రి వదిలేసిన వ్యాపారాన్ని తాను అందిపుచ్చుకున్నాడు

అతని తండ్రి కలపవ్యాపారం సాగిస్తూనే సరదాకి, హాబీక్రింద డబ్బు వడ్డీలకు ఇవ్వటం మొదలుపెట్టాడు. కన్నబిడ్డల్ని మొదట్లో కొన్నాళ్ళు కష్టపడి పెంచి పైకి తీసుకొస్తే, ఇంక మన ప్రమేయంలేకుండా వాళ్ళూ ఊడలు దించుకుని, సంసారాలు పెంచుకుని, మనవళ్ళనూ మునిమనవళ్ళనూ అందించినట్లుగానే, డబ్బులనుగూడా కొన్నాళ్ళు కష్టపడి సంపాదించి, దాన్ని జాగ్రత్తగా మదుపు చేస్తూ వస్తే, ఒక స్థాయికి వచ్చాక ఇంక డబ్బు డబ్బును సంపాదిస్తుంది. దాని కదే పిల్లల్ని పెట్టుకుంటూ పోతుంది. ఈ రహస్యాన్ని శివరామయ్యగారు తన కొడుకు పతంజలికి బ్రహ్మోపదేశం చేశాడు. పతంజలిగారు తు-చ-తప్పకుండా నడుస్తూ తండ్రిని మించిన తనయుడు అనిపించుకున్నాడు.

వ్యాపారం చెయ్యటం దేనికి అంటే లాభాలు ఆర్జించటానికి. ఒకడు లాభం పొందాలంటే మరొకడు నష్టపోవాలన్నది సర్వసాధారణ విషయం. కాబట్టి వ్యాపారం చేసేవాడి దృష్టి ఎప్పుడూ లాభాలమీదే లగ్నమై ఉండాలిగాని, మరో పక్కకు తొణకగూడదు. అందునా కనకమహాలక్ష్మికి మనో చాపల్యం ఎక్కువ. ఎంతో గట్టిగా ఉడుంపట్టు పడితేగాని, లేకపోతే ఎవడి బాహుబంధా ల్లోనూ పట్టుమని పదిరోజులైనా ఉండదు. అందుచేత ఎవరెంత ఏడ్చి గీపెట్టినా, ఎవరెన్ని కడవల కన్నీరుకార్చి కాళ్ళముందు కాలవలు కట్టించినా, డబ్బు విషయంలో జాలి తలచగూడదు. ఈ కిటుకులన్నీ నరనరానా జీర్ణించుకున్న పతంజలిగారు వడ్డీ వ్యాపారంలో కనపడకుండా చాలా సంపాదించాడు.

కొన్నాళ్ళకు ఇంకో మెట్టు పైకెక్కి ఇళ్లూ, వాకిళ్లూ తాకట్టు పెట్టుకోవటం మొదలుపెట్టాడు. 'మనిషన్న తర్వాత మాటకు కట్టుబడి ఉండాలి'—అని పతంజలిగారు తనదగ్గర తాకట్టుపెట్టుకున్నవాళ్ళందరికీ చెబుతూ ఉంటాడు. అంటే గడువులోపల బాకీ తీర్చేసి తమ వస్తువు తాము రాబట్టుకోవాలి. లేకపోతే ఇంక తాకట్టు వాకట్టు అయిపోతుంది. ఇందులోనూ కొన్ని మెళుకువలున్నాయి. ఫలానా తారీఖునాడు ఫలానావాడు వచ్చి డబ్బుమొత్తం చెల్లించేస్తాడని పతంజలి గారు వాసనపడితే, ఆ గడువుకు నాలుగురోజులు ముందరా తర్వాత ఆయన ఎక్కడా ఎవరికీ కనపడడు. కలడో, లేడో అన్నవిషయం కట్టుకున్న ఇల్లాలి కైనా తెలియదు. ఆ తర్వాత సరేమరి, వ్యాపారం వ్యాపారమే. మేడ ఆయనదై పోతుంది దాని తాలూకు గోడు వాడిదైపోతుంది. ఇలా మనిషి మనిషికీ ఎత్తులు మారుస్తూ, ఎత్తునుంచి కొత్త ఎత్తుకు ఎదిగిపోయాడు పతంజలిగారు. దాదాపు డజను ఇళ్ళు అలా సొంతం చేసుకున్నాడు పతంజలిగారు అందులో సగం పెద్ద

బజారులోనే ఉన్నాయి. అవి తెచ్చే అద్దెలు ఏంచెయ్యాలి? మళ్ళీ వడ్డీలకు ఇవ్వాలి. ఇదే మరి, డబ్బు డబ్బును సంపాదించటమంటే దేనికైనా దీక్షా, పట్టుదలా ఉండాలి

పతంజలిగారి కలపదుకాణంలో పాతికమందిదాకా పనిచేస్తున్నారు. అందులో సగంమంది పదిహేనేళ్ళలోపు కుర్రాళ్ళు. వీళ్ళకు సగంకూలీ ఇస్తే సరిపోతుంది. ఇంక పనిమాటకొస్తే కూలివాళ్ళు వాళ్ళంతట వాళ్ళు పనిచెయ్యరు. యజమాని చేయించుకోవాలి.

ఉదయం పదిగంటలవేళ పతంజలిగారు తన డిపో ఆఫీసు గదిలో కూర్చుని బోసుతో మాట్లాడుతున్నాడు. పతంజలిగారు పదిలక్షల ఆస్తిపరుడైతే, బోసు దమ్మిడీకి పనికిరానివాడు. అయితేనేం, వాళ్ళిద్దరూ చిన్నప్పటినుంచీ శరీరాలు వేరయినా ఆత్మ ఒక్కటే అన్నట్లుగా మసులుకున్నారు: బోసుకు కండబలం ఉంది ఎంతటివాడినైనా తొడకొట్టి, పడగొట్టగల గుండెధైర్యం ఉంది. అనుకున్న పని సాధించటంలో అపక్రపరాక్రమాలు చూపిస్తాడు. ఇలాంటివాడు తనకు అవసరం అనుకున్న పతంజలిగారు కర్ణుడిని అంగరాజ్యాధిపతిని చేసి తనవాడిగా చేసుకున్న దుర్యోధనుడిలా, తన టింబర్ డిపోలో నాలుగోవంతు వాటా బోసుకు ఇచ్చి స్లీపింగ్ పార్టనర్‌గా చేసుకున్నాడు కలప తెప్పించి అక్కడ దింపటంవరకూ బోసు చూసుకుంటాడు. ఇక మిగిలినవన్నీ పతంజలి గారు చేసుకుంటారు.

సిగరెట్టు పొగ రింగులురింగులుగా వదలుతూ బోసు అడిగాడు. "మీ కొత్త పోలీసాయన ఏమంటున్నాడు?"

"ఇవ్వాళ భోజనానికి పిల్చాను ఆయన్నీ, డాక్టరు సత్యమూర్తినీ..." అన్నాడు పతంజలిగారు.

"నీ తంటాలు నువ్వు పడు..." అని నవ్వాడు బోసు.

"తప్పుతుందా, మరి..."

ఇంతలో ఒక కుర్రాడు వచ్చి ఎదురుగా నిలబడ్డాడు. "ఏంట్రా; ఆ గేటు దగ్గర మొద్దులన్నీ షెడ్డుదగ్గర ఏశార్రా?" అని అడిగాడు పతంజలిగారు.

"అయ్యా, శానా బరువు ఉన్నయండి. మొయ్యలేకపోతున్నాం."

"ఓరి నీ సుకుమారం తగలెయ్య. ఏదేశపు రాకుమారుడివిరా నువ్వు?"

"ఆకలేస్తుంది, అన్నం దినొస్తానండి..."

"దొంగనాయల. పోయి పనిచెయ్యమని చెప్పట్లా?" అని కసురుకున్నాడు బోసు.

"తిడతారేంటండీ?" అన్నాడు వాడు పౌరుషంగా.

"తిట్టక ముద్దెట్టుకుంటారేరా? పోనీ మీ అక్కను రమ్మనురా. అలాగే ముద్దెట్టుకుంటాను," అని నవ్వాడు బోసు.

"నీ యమ్మను..." వాడామాట పూర్తిచెయ్యకముందే, వాడి చెంప పగిలింది వాడు ఏడుస్తూ వెళ్ళిపోయాడు.

మిగిలిన వాళ్ళంతా చూస్తూ నిలబడ్డారు బోసు కసురుకునేదాకా తర్వాత మళ్ళీ నడుం వంచారు వెట్టిచాకిరీకి.

పతంజలిగారు, బోసూ మరికాసేపు కబుర్లు చెప్పుకుని, లేచి బజారుకువచ్చి హోటల్లో దూరి నాలుగురూపాయల బిల్లుచేసి వెళ్ళిపొయ్యారు.

చంద్రం పోలీసుస్టేషనులో కూర్చుని తన పని చూసుకుంటున్నాడు. ఇక్కడ ఛార్జితీసుకున్నప్పటినుంచి చేతినిండా పని తగులుతూనే ఉంది. ఆ రోజు సాయంత్రం తాను షికారు వెళ్ళి వస్తుండగా తన నాసికాగ్రాలకు తగిలిన వాసనను మర్చిపోలేదు. రెండురోజులు తర్వాత వెళ్ళి సోదాచెయ్యటం, దొంగసారా తయారుచేస్తున్న వాళ్ళను పట్టుకోవటం, సెంటర్లో జెండాచెట్టు వెనుక, పెద్ద మొత్తాలతో పేకాట ఆడుతున్నవాళ్ళను పట్టుకోవటం లాంటివి చేసి ఊళ్ళో కాస్త సంచలనం కలిగించాడు. ఇతను అందరిలాంటివాడు కాదని అందరికీ అర్థమైంది. చంద్రానికి కావల్సిందిగూడా అదే

తోటలో తాను చూసిన పిచ్చిదాన్నిగురించి కానిస్టేబులు వెంకటేశాన్ని అడిగాడు చంద్రం. ఆ తోటగూడా పతంజలిగారిదే. ఆతోటకాపలా కాయటానికి కోటిలింగం అనేవాడ్ని అక్కడే ఉంచారు. పతంజలిగారి తండ్రి శివరామయ్యగారే వాడికి పెళ్ళిగూడా చేశారు. అప్పటికింకా పతంజలిగారికి పెళ్ళికాలేదు పతంజలిగారు, బోసు కలిసి కోటిలింగం పెళ్ళాంమీద కన్నువేసి, వాడు లేని సమయంలో దాన్ని లొంగదీసుకోవాలని ప్రయత్నంచేశారు. ఇది తెల్సి కోటిలింగం తిరగబడ్డాడు. ధనవంతులు, బలవంతులు మీద తిరగబడ్డ బలహీనులందరిలాగానే కోటిలింగంగూడా కనుమరుగైనాడు. ఆ తర్వాత వాడి పెళ్ళాం బజారున పడింది. కోటిలింగం కేసు చిత్రంగా సమసిపోయింది. పోలీసులదాకా రానేలేదు.

ఇకపోతే, నీలవేణి సంగతిగూడా విచారించాడు. పతంజలిగారి తండ్రి శివరామయ్యగారుగూడా దక్షిణ నాయకుడే ననిపించుకున్నాడు. ఆయన భార్యాపిల్లలు ఉండగానే పట్నంలో ఎవరో స్త్రీతో సంబంధం పెట్టుకున్నాడు

కొన్నాళ్ళతర్వాత ఆమెను తీసుకొచ్చి ఊళ్ళో వేరేఇంట్లో ఉంచాడు. ఆమెకు కలిగిన సంతానమే నీలవేణి, మురళి. శివరామయ్యగారు ఉన్నంతకాలం వీళ్ళకు తిండికీ, బట్టకీ కొదవలేకపోయింది. ఉన్నట్లుండి, చెప్పాపెట్టాకుండా గుండె పోటుతో ఆయన పోగానే పతంజలిగారు జాగ్రత్తపడ్డాడు. ఏడాది తిరగకుండానే నీలవేణి తల్లికూడా వీళ్ళని నిరాదారంగా వదిలేసిపోయింది. నీలవేణిని, మురళిని దిక్కులేనివాళ్ళనిచేసి ఇంట్లోనుంచి బయటకు గెంటేశాడు నీలవేణి పతంజలిగారింటిముందు కూర్చుని పెద్ద యాగీచేస్తే, ఇప్పుడు ఉంటున్న ఆ గది ఇచ్చి, జరుగుబాటుకు నెలకో వందరూపాయలు ఇచ్చేందుకు అంగీకరించాడు. ఇది తెలిసాక నీలవేణిగురించి కొంతవరకూ అర్థమైంది చంద్రానికి.

స్టేషన్నుంచి తిన్నగా ఇంటికి వచ్చాడు చంద్రం. పెరట్లోకి వచ్చేటప్పటికి నీలవేణి నీళ్ళు పట్టుకుంటున్నది. ఇతన్నిచూసి చిన్నగా నవ్వింది.

"ఏమిటీవాళ అప్పుడే వచ్చారు?" అని అడిగింది నీలవేణి.

"అదేమిటి, మాఇంటికి నేను రావటానికిగూడా వీల్లేదా?" అని ప్రశ్నించాడు.

"మీ ఇల్లు అంటే మీరు కట్టించారా?" అని ఎదురు ప్రశ్నించిందామె.

"కట్టించినవాళ్లేనా మా ఇల్లని చెప్పుకునేది? మిగిలినవాళ్ళకు సంసారం, ఇల్లు ఉండదా?"

"సంసారం ఉన్నవాళ్ళు మా ఇల్లని చెప్పుకోవచ్చు. ఆ ఇంటికి వెళ్ళటానికి తొందరపడనూవచ్చు. ఎందుకంటే వాళ్ళకోసం ఎదురుచూసే వాళ్ళంటూ కొందరుంటారు గనుక. అక్కడ ఆప్యాయతలూ, అనురాగాలూ పంచిపెట్టే వాళ్ళంటూ ఉంటారుగనుక. ఆవేవి లేనివాళ్ళ ఇల్లు ఇళ్లేగాదు. సన్యాసులమఠం" అన్నది బిందె చంకకు ఎత్తుకుని.

"పూర్తిగా సన్యాసులమఠం అయినా బాగుండును. మీలాంటివాళ్ళెవరో పిల్చి భోజనం పెడతారు తినివచ్చి నిశ్చింతగా నిద్రపోవచ్చు..."

"మాలాంటివాళ్ళు పిలిస్తేమాత్రం, తమలాంటివారు వస్తారా ఏమిటి?" అన్నది వెళ్ళబోతూ ఆగి వెనక్కితిరిగి చంద్రంవంక చూస్తూ.

"పిలిస్తేగదా,రావటానికీ రాకపోవటానికీ అన్నట్లు ఇవాళ పతంజలిగారింట్లో ఉభయం."

"ఏమిటివాళ మా జానకి ఇంటికి వెళుతున్నారా మీరు?" అని అడిగింది నీలవేణి, ఇంతలేసి కళ్ళతో వింతగా చూస్తూ. బిందెలో నీళ్ళు వొలికిపడి కొంత చీరె తడిసి, ఒంటికి అతుక్కుపోయింది.

"మీ జానకి ఎవరో నాకు తెలియదు. నేను పతంజలిగారింటి కె ళ్తున్నాను."

"ఆయన భార్య పేరేలెండి జానకి. ." నీలవేణి చంకన నిండుబిందె పెట్టుకుని ఒక పక్కకు కొంచెంగా వంగి నిలబడితే, ఆమెను ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డాడు చంద్రం.

నీలవేణి.ఒకటి రెండు అడుగులు అతనికి దగ్గరగా వచ్చి నెమ్మదిగా అడిగింది, "జానకిని నన్నొకసారి కల్సుకోమని చెప్తారా, ప్లీజ్..."

"ఏం, మీరే ఎందుకు చెప్పగూడదు?" అని అడిగాడు చంద్రం.

"అదంతా పెద్ద కథలెండి ఆయనకు తెలియకుండా దానితో చెప్పాలి మీరు..."

"ఇలాంటి చాటుమాటు వ్యవహారాలన్నీ నేర్పుతున్నారేమిటి నాకు .." అని నవ్వాడు చంద్రం.

"ఓయబ్బ, ఏమీ తెలియని పసిపాపకదూ.. ఇంతకీ చెప్తారా, లేదా?" అని అడిగిందామె.

"వీలుంటే చూస్తాను. ఆయనకు తెలియకుండా నేను చెప్తే మాత్రం, ఆయనకు తెలియకుండా మీరు ఎలా కల్సుకుంటారు? అయినా అంత అవసరం ఏముంది?"

"అవన్నీ మీరు అడగకూడదు, నేను చెప్పగూడదు. ఇంతకీ చెప్తారు గదూ—"

"మీరడిగితే కాదంటానా? బిందె నెత్తుకుని అలా ఎంత సేపు నిలబడతారు, నడుం నొప్పెడుతుంది,.."

నీలవేణి మూడు వంకర్లుతిప్పుతూ మూతివిరిసి వెళ్ళిపోయింది, వయ్యారంగా నడుచుకుంటూ. ఈ నీలవేణి మామూలు అమ్మాయి కాదు. ఈ పల్లెటూరు మనుష్యులమధ్య మొండిగా బ్రతకానికి అలవాటుపడి రాటుతేలిపోయింది.అంచేత ఈమెకు ఈ వయసులోని ఆడపిల్లలకుండే ముగ్ధత్వం, బేలతనం లేవు. వాటికి బదులుగా చొరవ, ధైర్యం బాగా అబ్బినయి. కొంతమందికి ఎదురయ్యే పరిస్థితులే, వాళ్ళకు ఎన్నో పాఠాలు నేర్పుతాయి. ఒకరు చెబితే వచ్చేవికావు ఈ గుణగణాలు.

రాత్రి ఎనిమిదిగంటలు కావస్తుండగా చంద్రం, పతంజలిగారింటికి వచ్చాడు. అప్పటికే డాక్టరు సత్యమూర్తిగారు జోక్ మీద జోక్ విసురుతూ, సిగరెట్టు మీద సిగరెట్టు కాలుస్తూ కూర్చున్నాడు. చంద్రం రాగానే ఆయన అన్నాడు.

"ఏమండీ. విందుకుపిలిస్తే ముందుగా రావాలిగాని, ఖూనీకేసు తనిఖీకివచ్చి నట్లు అంతా అయిపోయ్యాక వస్తే ఎట్లాగండీ?"

చంద్రం ఆయనకు ఎదురుగా కూర్చుంటూ, "ఖూనీకేసు తనిఖీకి అయితే ఒక్కణ్ణే ఏలా వస్తానండీ? నిజానికి అలాంటి సందర్భాల్లోగూడా మేం వచ్చేదాకా, మీరేం మొదలుపెట్టటానికి వీల్లేదు మరి .." అన్నాడు.

"అంచేతనే మీకోసం ఎదురు చూస్తూ కూర్చున్నాం." అన్నాడు డాక్టరుగారు

"లోపలినుండి పిలుపు వచ్చేలోగా ఒక రౌండ్ వేసుకుందామా?" అని విస్కీ బాటిల్‌తీసి మధ్యలో పెట్టాడు పతంజలిగారు

"మీరు తీసుకోండి. నన్ను మాత్రం వదిలెయ్యండి..." అన్నాడు చంద్రం.

"అదేమిటి? మీరు ముట్టుకోకపోతే, నేనూ ముట్టుకోను." అన్నాడు సత్యమూర్తిగారు,

"నాకోసం మీరెందుకు మానుకోవటం?" అని అడిగాడు చంద్రం.

"ఈ ఒక్కరోజుకీ కొంచెంగా. .కంపెనీకోసం..." అని చంద్రాన్ని బ్రతిమి లాడాడు పతంజలిగారు.

"ఈ ఒక్కవిషయంలోనూ నన్ను మన్నించండి. ఇంకెప్పుడూ తాగనని ఒకరికి మాటిచ్చాను. అందుకోసం..."

"ఇక్కడి విషయం, మన ముగ్గురికీతప్ప నాలుగోవాడికి తెలియదు" అన్నాడు పతంజలిగారు

"మన ముగ్గురం మరెవరికీ చెప్పం. కనుక ఇబ్బందిలేదు ఓ.కే?" అని అడిగాడు సత్యమూర్తిగారు.

"ఒకరికికోసం భయపడికాదు నేను మానేసింది. ఆ వ్యక్తిమాటమీద గౌరవం ఉంచి మానేశాను. ఇప్పుడా వ్యక్తి లేదుగూడా. అయినా మనం పెట్టుకున్న నియమాలు మనకోసమేగాని, మరొకరికోసం కాదుగదా. మన నియమాలను మనమే ఉల్లంఘిస్తున్నామంటే, మనల్ని మనమే వంచించుకుంటున్నామన్న మాట..."

"మీకు అభ్యంతరం లేకపోతే ఒక్కమాట. మీమీద అంతటి ప్రభావాన్ని చూపించిన ఆ వ్యక్తి ఎవరో మేం తెలుసుకోవచ్చునా?" అని అడిగాడు సత్యమూర్తిగారు.

జ్యోత్స్న చంద్రం తను జ్యోత్స్న కిచ్చిన వాగ్దానం అది ఇప్పుడామె లేకపోవచ్చు ఇక్కడ నేనేం చేస్తునాదనో ఆమె చూడలేకపోవచ్చు అంత మాత్రాన చంద్రం ఆగిపోయాడు ఏదోబాధ అతని గుండెల్లో పెల్లుబికింది గొంతులోనిమాట అక్కడే ఆగిపోయింది

సత్యమూర్తిగారు వెంటనే అన్నాడు "సారీ సర్ అవన్నీ గుర్తుచేసినట్లున్నాను

"ఇట్సాల్‌రైట్ అని చంద్రం కుర్చీలో వెనక్కివాలాడు

వాతావరణం కొంచెం తేలిక పరచటంకోసం సత్యమూర్తిగారు పతంజలి గారితో అన్నాడు మీ బిజినెస్ ఎలా ఉందండీ ? అని మాట మార్చాడు

"ఫర్వాలేదు ఎంతయినా వ్యాపారంలో రిస్క్ ఉందండి మీలా గవర్నమెంటు ఉద్యోగాలయితేనే సుఖం

"అందునా డాక్టరయితే మరీ సుఖం వచ్చిన ఆడదాని చెయ్యల్లా పట్టుకోవచ్చు, అని నవ్వాడు చంద్రం

"రోగిష్టి వాళ్ళ చేతులు పట్టుకుని ఏంలాభం? ఏ జన్మలో చేసిన పాపం, ఏమాత్రం మిగిలి ఉన్నా మూలుగుతూ వస్తారు కొంతమంది మరీ యమధర్మ రాజును వెంటబెట్టుకునే వస్తారు," అన్నాడు సత్యమూర్తిగారు

మీకన్న యముధర్మరాజే నయం ఆయన ప్రాణాలను మాత్రమే తీసుకుంటాడు రోగి ధనాన్నీ ప్రాణాన్నీ గూడా లాక్కుంటారు అన్నాడు చంద్రం

ఆ మాటకొస్తే మీరు మరీ అన్యాయం మేం చచ్చినవాడితో వదిలించుకుని చేతులు కడిగేసుకుంటాం మీరలాకాదే చచ్చినవాణ్ణి వొదిలేసి బ్రతికిన వాళ్ళందర్నీ చంపుకుతింటారు ,

వీళ్ళిలా ఊసుపోక కబుర్లు చెప్పుకుంటూ ఉండగానే, లోపలనుంచి పిలుపు వచ్చింది ముగ్గురూ లోపలికి వెళ్ళారు టేబులుచుట్టూ కూర్చున్నారు పతంజలిగారు తన భార్య జానకిని చంద్రానికి పరిచయం చేశాడు ఆమె చిరునవ్వుతో నమస్కారం చేసింది

ఆమె నెయ్యి వడ్డిస్తుండగా డాక్టరుగారు అడిగాడు నీ ఒంట్లో ఎలా ఉందమ్మా ?

మా జానకికి వీక్‌నెస్ ఎక్కువగా ఉంటోందండి ఏదన్నా మందివ్వండి' అన్నాడు పతంజలిగారు కూర కలుపుకుంటూ

సగంమంది ఆడవాళ్ళ వీక్‌నెస్‌కి మగవాళ్లే కారణం ఏదో వాళ్లు చేసి పెడు తుంటే, రోజులు గడిచిపోతుంటే చాలనుకుంటారు చాలామంది కానీ వాళ్లకు రోజూ పొద్దున్నా, సాయంత్రం ఒక చెంచాడు ప్రేమ, ఒక చెంచాడు ఆదరణ, మరో చెంచాడు ఉల్లాసం, ఒక గ్లాసుడు కబుర్లతో కలిపి తాగించడం కూడా అవ సరం అని తెల్సుకోవాలి "

'డాక్టరుగారేదో కొత్త మందు కనిపెట్టినట్లున్నారు" అన్నాడు చంద్రం నవ్వుతూ

"అన్యోన్యమైన ఆలుమగల కీ మందు పాతదేలెండి'' అన్నాడు సత్యమూర్తి కూడ పూర్తిచేస్తూ

జానకి మరికొంచెం కూరవేసింది డాక్టరుగారు ఎక్కువైందని గోలపెట్టాడు

"మా జానకి చేతికి ఎముకలేదండీ అన్నాడు పతంజలిగారు

"అరెరె ఏ చేతికమ్మా నీకు ఎముకలేనిది ? ఏదీ ఇలా చూపించు అని అడిగాడు డాక్టరుగారు ఆదుర్దాగా జానకి గలగలా నవ్వేసింది

ఇల్లాలు ఎప్పుడూ అలా నవ్వుతూ కళకళలాడుతూ ఉండాలి అని సత్యమూర్తిగారు అంటే చంద్రం వెంటనే బదులు చెప్పాడు

"ఇల్లాలు అలా నవ్వుతూ ఉండాలంటే, ఇంటాయన ఇలా ఎప్పుడూ ఫ్రెండ్సును లాక్కురాగూడదు "

"మీ దయవల్ల మాకు భుక్తికి లోటులేదు లెండి" అన్నాడు పతంజలిగారు వెంటనే

సత్యమూర్తిగారువెంటనే కల్పించుకుని అన్నాడు "ఏమండీ, డబ్బున్న వాళ్లకు నిద్రపట్టదంటారు నిజమేనా ?"

"నిద్రపట్టక పోతే మీ దగ్గరకు రాకపోయినామా ?" అని ఎదురు ప్రశ్నిం చారు పతంజలిగారు

భోజనాలు పూర్తిచేసి లేచారు చేతులు కడుక్కొని వస్తుండగా, కాసిని నీళ్ళు కావాలని అడిగాడు చంద్రం సత్యమూర్తిగారు, పతంజలిగారు ముందుగదిలోకి వచ్చారు

నీళ్ళు అందిస్తూ వుండగా చంద్రం జానకితో అన్నాడు "నీలవేణి మిమ్మల్ని ఒకసారి తనతో కలుసుకోమంది

ఈయనతో కబురుచేయటం ఊహించని విషయం కనుక జానకి ముందు విస్తుపోయింది తలదించుకుని నెమ్మదిగా "అలాగే కల్సుకుంటాను అన్నది

ఎక్కడ ?

"ఎల్లుండి సినిమాకు మొదటి ఆటకు రమ్మనమనండి, అని చెప్పి గబగబా అక్కడినుంచి లోపలికి వెళ్ళిపోయింది జానకి

జానకి నీలవేణీల పరిచయమే చాలా వింతగా తోచింది చంద్రానికి పైగా వీళ్ళు కలుసుకునే తీరుగూడా చాలా చిత్రంగా తోచింది చంద్రానికి

ముందు గదిలోకి వచ్చాక తాంబూలాలు వేసుకుంటూ సత్యమూర్తిగారు అన్నాడు, పతంజలిగారి లాంటివారు పదికాలాలపాటు ఇలాగే పార్టీలు అవీ తరచుగా ఇస్తూ సుఖంగా వర్ధిల్లాలి అని కోరుకున్నాడు, తినమరిగిన సత్యమూర్తి గారు

మరి కాసేపు పిచ్చాపాటి మాట్లాడుకున్నాక, పతంజలిగారి దగ్గరా, జానకి దగ్గరా శలవుతీసుకుని బయల్దేరారు చంద్రం, సత్యమూర్తిగారు

సెంటరుదాకా వచ్చారు అప్పటికింకా కొంతమంది అరుగుమీద కూర్చుని లోకాభిరామాయణం చెప్పుకుంటూనే ఉన్నారు వీళ్ళద్దర్నీ చూస్తూ చేష్టలుడిగి నట్లు చూస్తూ కూర్చున్నారు

మళ్ళీ కల్సుకుందామని, చెరొక దోవన విడిపోయారు

* * *

## 4

సాయంత్రం ఆరుగంటలు కావస్తున్నది చంద్రం డాబా పిట్టగోడమీద కూర్చుని చుట్టూ చూస్తున్నాడు

వెలిసిపోయిన వస్త్రంలాంటి నీలాకాశానికి కాషాయరంగు అద్దకం వేసినట్లుగా ఉన్నది పశ్చిమదిశ నడినెత్తిమీద నున్న చిన్న చిన్న మబ్బుతునకలు పగిలిన అద్దపు ముక్కల్లా మెరుస్తున్నాయి ఒకవైపు నుంచి సూర్యుడు అనేక తప్పులు చేసి దండింపబడుతున్న వాడిలా తలవంచుకుని వెళ్ళిపోతుంటే మరోవైపు నుంచి చీకటి ముసుగు మీదకు లాక్కుంటోంది భూమి

చిత్రంగా గోచరిస్తున్న ఈ ప్రకృతి చిత్రాన్ని ఆసక్తిగా తిలకిస్తున్నాడు చంద్రం అతనికి ఎదురుగా కూర్చుని ఉన్నాడు మురళి చంద్రం తీరిగ్గా ఉన్నప్పుడల్లా వచ్చి అతనిదగ్గర కూర్చుని, కాలక్షేపం చేయటం అలవాటు చేసుకున్నాడు మురళి అందుకు కారణం చంద్రం అంటే మురళికి ఎందుకో తెలియని ఆప్యాయత కలగటమే క్రమంగా ఆ ఆప్యాయత ఆరాధనగా మారింది చంద్రం చేసే ప్రతిపనీ ఆశ్చర్యంగా చూస్తూ, అతన్నే ప్రతినిమిషం గమనిస్తూ ఉంటాడు మురళి

"నేనుకూడా మీఅంత కావాలి. మీ పోలీసు డిపార్టుమెంటులోనే మీరు నాకు ఉద్యోగం ఇప్పించాలి" అన్నాడు మురళి చంద్రంతో.

"నువ్వు అనుకుంటున్నంత హాయిగా ఉండదీ ఉద్యోగం. మాకు అంతా శత్రువులే. ఈ శత్రువులు వాళ్లు తిన్నగా బతకరు. మమ్మల్ని తిన్నగా బతకనివ్వరు. ఒక్కోసారి ప్రాణంతో చెలగాటం ఆడాల్సి వస్తుంటూంది," అని చెప్పాడు చంద్రం.

"అప్పుడే గదండీ లైఫ్‌లో థ్రిల్. అయినా మీ అంత కావాలంటే, ముందు నేను మీఅంత చదువుకోవాలిగదా..." అని నిరుత్సాహపడిపోయాడు మురళి.

"నిజమే ముందు చదువు ముఖ్యం, చేతిలో సర్టిఫికెట్ ఉంటేనే, దేనికి ఏ ప్రయత్నం చెయ్యాలన్నా వీలుపడేది..."

"కానీ ఈ రోజుల్లో చదువుకోవటమంటే, చదువు కొనుక్కోవడమేగదండీ. అందరికి అంత డబ్బు ఉండొద్దూ."

"డబ్బున్న వాళ్ళకు చదువు అబ్బదు. చదువుకోవాలనుకునేవాళ్ళకు డబ్బు ఉండదు. నీ చదువు డబ్బులేక ఆగిపోగూడదు. నీకు నేను కావలసినవన్నీ ఇస్తాను. నువ్వు బాగా చదువుకో," అన్నాడు చంద్రం.

"మీరు నాకు సాయం చేస్తారా? నేను మీకు ఏమవుతానని?" అని ఆశ్చర్యంగా అడిగాడు మురళి.

"అయినవాళ్ళకు సాయంచెయ్యగూడదని నా అభిమతం. సహాయం పొందటానికి ఎవరు అర్హులో వాళ్ళకే చెయ్యాలి. అప్పుడే అది సద్వినియోగం అవుతుంది. అసలు సాయం అనేమాట అనటానికి చాలా తేలిగ్గాను, వినటానికి చాలా బరువుగాను ఉంటుంది. మనం అవసరాలను ఇచ్చిపుచ్చుకునే చేబదుళ్లూ అప్పులూ ఇవేకావు మనం చేయగలిగే సహాయాలు. ఒకరికొకరం కొండంత అండగా ఉన్నాం అన్న భావన పరస్పరం కలగాలి. ."

"అవునండీ, మీనుంచి మేం కోరుకుంటున్నది మీ స్నేహమేకాని, మీ సహాయం కాదు..."

"అవసరం వచ్చినప్పుడు ఆమాత్రం ఆదుకోలేని స్నేహం, స్నేహమేకాదు. ఏమంటావు?"

"నిజమేననుకోండి..." అని సందిగ్ధంగా ఉండిపొయ్యాడు మురళి.

"అంచేత నీకేం కావాలన్నా నన్ను అడుగు. నాకు చేతనయినది నీకు చేస్తాను. ఓ.కే?"

అలాగేనని తలూపాడు మురళి.ఎదురుగావున్న తమఇంటిగుమ్మంలో నిలబడి నీలవేణి రమ్మనమని చెయ్యిఊపి పిల్చింది. 'నన్నా?' అన్నట్టుగా సంజ్ఞ చేశాడు చంద్రం. 'కాదు, మీ పక్కనున్నవాడ్ని' అని మళ్ళీ సంజ్ఞ చేసింది నీలవేణి.

"మీ అక్క పిలుస్తోందోయ్..." అన్నాడు చంద్రం.

"మర్చిపోయ్యాను. ఆవిణ్ణి సినిమాహాలుదగ్గర దించేసి, నేను ప్రైవేటు కెళ్ళాలి..."

"సిన్మాప్రోగ్రాం పెట్టుకుని ఇక్కడ కూర్చున్నావేం?" అని అడిగాడు చంద్రం.

"ఆవిడ మేకప్ కావాలి గదా..."

"ఐసీ...మీ అక్కతో చెప్పు. ఎలుకతోలుతెచ్చి ఎన్నాళ్లు ఉతికినా నలుపు నలుపేగాని తెలుపుగాదు. లక్స్ సబ్బులు ఎన్ని లక్షలు అరగదీసినా ఆ కంపెనీ వాళ్ళకేగాని, మనకేం లాభంలేదని చెప్పు. చెప్తావా?"

"చెబుతానండి. కానీ, పాయింట్ నెంబర్ వన్. మా అక్క నల్లగా లేదు. తెల్లగానే ఉంది నెంబర్ టు. ఆపాదమస్తకం తోముడు మీకేగాని మా అక్కకు అక్కర్లేదు. బూట్లనుంచి, భుజకీర్తులవరకూ తోముడు కావల్సింది మీకే... వస్తా..." అనేసి పరుగెత్తుకుంటూ వెళ్ళిపొయ్యాడు మురళి.

చంద్రం నవ్వుకుంటూ వాళ్ళింటివంకే చూస్తూ కూర్చున్నాడు. మురళి, నీలవేణితో ఏదో చెప్పినట్లున్నాడు. మురళి తాళంవేస్తుంటే, నీలవేణి చంద్రం వంక చూస్తూ నాలిక కొరుకుతూ వెక్కిరించింది. గాలిలో చెయ్యూపి, చెంగున గెంతేస్తూ తమ్ముడి పక్కన నడుస్తూ వెళ్ళిపోయింది.

ఈ నీలవేణిలో విలక్షణమైన ఆకర్షణ ఉంది. అరవిరిసిన కుసుమంలో ద్యోతకమయ్యే సుకుమారం ఆమె వదనారవిందంలో ఉంది. గలగలలాడుతూ పారే సెలయేరులాంటిదీ అమ్మాయి. చివరకు ఎటుసాగిపోతుందో మరి! దీనికి సమాధానం చెప్పవల్సింది కాలమే. కాలం ఎంత ఆర్ద్రమైనదో, అంత రుద్రమైనది గూడా. సంతోషంతో పకపకలాడుతున్నవాళ్ళనే, దుఃఖంతో కుళ్ళికుళ్ళి ఏడ్చేలా చేస్తుంది. కాళ్ళముందు మెత్తగా వెన్నెలపరిచిన కాలమే, కాళ్ళక్రింద పల్లేరు కాయల్ని చల్లుతుంది. ఒక్కోసారి తృప్తిగా పక్కన పడుకున్న ప్రేయసిలా కనిపించిన కాలమే, పక్కలో దూరిన త్రాచుపాములా భయపెడుతుంది. ఎలా

ఈ కాలాన్ని నమ్మటం? అందుకే ఎవరూ ఈ కాలాన్ని నమ్మరు అందుబాటులో ఉన్నప్పుడే అన్నిటినీ సొంతం చేసుకోవాలని తాపత్రయపడతారు

చాలాసేపు ఊహావిహంగాలపైన విహరించిన చంద్రం క్రిందికి దిగివచ్చాడు జాన్ వంటచేసి వెళ్ళిపోతానంటే పంపించేసి, ఏదో పుస్తకం చేతిలోకి తీసుకున్నాడు ఒక పేజీఅయినా చదవకముందే సత్యమూర్తిగారు వచ్చి కూర్చున్నారు

"ఏదో గ్రంథపఠనంలో ఉన్నట్లున్నారు "

'ఏమీ తోచక, ఏదో కాలక్షేపంకోసం చూస్తున్నాను సమయానికి వచ్చారు ' అన్నాడు చంద్రం పుస్తకం మూసేసి

"నేనూ ఒంటరితనం భరించలేకనే ఇలా వచ్చాను, ' అన్నాడు సత్యమూర్తి నవ్వుతూ।

"మీ ఒంటరితనం నేను పోగొట్టగలిగేది కాసేపే జంటను చూసుకుని,వెంట తెచ్చుకున్నప్పుడే మీ ఒంటరితనం మిమ్మల్ని శాశ్వతంగా వదిలి పారిపోతుంది "

"నాకు చెబుతున్నారు సరే, మరి మీ మాట ఏమిటి?

"నా సంగతి ఎందుకులెండి నాకు ఆ దశలన్నీ దాటిపోయినయి నేనొక శాపగ్రస్తుణ్ణి '

"బ్రతుకు శాపమో, వరమో చేజేతులా చేసుకునేది మనమే "

"చూస్తూ చూస్తూ ఎవడూ దుఃఖాన్ని వరించడు జీవితం పొడుగునా సుఖశాంతులు పండువెన్నెల్లా వెల్లివిరియాలనే ఆశిస్తాడు కానీ అనుకున్నవన్నీ జరగవు కొన్ని అనుకోనివిధంగా జరిగి చావుదెబ్బ కొడుతూంటాయి తన ప్రయత్నం పూర్తిగా విఫలమైనప్పుడు మనిషి కృంగిపోతాడు సఫలమైనప్పుడు పొంగిపోతాడు ఇది సహజం

"ఇది మరీ చిన్నపిల్లల మనస్తత్వం జయాపజయాలను రెండింటినీ సమానంగా తీసుకోగలగటం ధీరగుణం గెలిస్తే మన గొప్పతనం, ఓడిపోతే మరొకడి చెడ్డతనం అనుకోగూడదు "

ఒకే వస్తువుకోసం ఇద్దరు పోట్లాడుకుంటారనుకోండి ఒకరు గెలుస్తారు మరొకరు ఓడిపోతారు మొదటివాడు లేకపోతే, రెండోవాడు దాన్ని పొంది ఉండేవాడుగదా "




"మనుష్యులంతా ఒకటై, ఒక కుటుంబంగా, ఒక గ్రామంగా, ఒక నగరంగా తిరింది ఒకరికొకరు తోడునీడగా ఉంటూ సహాయసహకారాలు అంది పుచ్చుకోవాలనే కానీ నలుగురం ఒకచోట చేరినప్పుడు, పోటీ అనివార్యం. ఈ పోటీని క్రమబద్ధం చేయటంకోసమే సమాజం, కట్టుబాట్లు ఏర్పడ్డాయి..."

"మన శ్రేయస్సుకోసం ఏర్పడ్డ సమాజమే, మనకు ఒక్కోసారి ముళ్ళపాన్పు అవుతున్నది..."

"కొందరి విషయంలో మీరు చెప్పింది సమంజసమే. పదిమందికోసం ఏర్పడ్డ సమాజం కొన్ని కట్టుబాట్లనూ, సాంప్రదాయాల్ని శాసించింది. వాటిని కాదని కాలదన్నినవాళ్ళను వాళ్ళ ఖర్మకు వదిలెయ్యటంవరకూగూడా కొంతవరకూ సమర్థనీయమే కావచ్చు. కానీ ఒకరి తప్పుకు మరొకరిని శిక్షించబూనటం..." అని ఆగాడు చంద్రం.

"అలా ఎప్పుడూ జరగదు..." అన్నాడు సత్యమూర్తి.

"ఉదాహరణకు, ఒక కుటుంబంలో ఎవరైనా నీతిదూరంగా సంచరిస్తే, మిగిలినవాళ్ళనుగూడా చిన్నచూపు చూడటంలేదా?"

"అదా? అందులోనూ కొంత అర్థం లేకపోలేదు. ఒక వ్యక్తి సన్మార్గాన్ని వీడి, దుర్మార్గాన్ని అనుసరించేటప్పుడు, తనే గాకుండా తన కుటుంబమంతా గూడా ఆ పాపానికి బలి అవుతుందని అతన్ని భయపెట్టడం ద్వారా అతన్ని ఆ ప్రయత్నంనుంచి మరికొంత వెనక్కిలాగే ప్రయత్నం జరుగుతుందిగదా .."

"అది ఫలించలేదనుకోండి. ఒకడు ఆవేశంలో తప్పుచెయ్యవచ్చు. వాడి ప్రవర్తనకు మిగిలినవాళ్ళెలా బాధ్యులు ?"

డాక్టరుగారు వెంటనే ఏమీసమాధానం చెప్పలేదు. ఏదో ఆలోచిస్తూ మౌనంగా ఉండిపోయినాడు. తర్వాత చంద్రం అన్నాడు. "మా ఇంటికి ఎదురుగా ఒక అమ్మాయి, పేరు నీలవేణిట. ఆమెకు అందచందాలకు లోటులేదు. మీరు చూశారా ?"

"అదేమిటి అలా అడిగారు ? ఈ ఊళ్ళో నీలవేణి పేరు తెలియనివారెవరైనా ఉంటారా ?" అని అడిగాడు సత్యమూర్తిగారు.

"నీలవేణి గురించి తెలియనివాళ్ళు ఎవరూ ఉండరు ఈ ఊళ్లో ఇంతమంది ఆడవాళ్లు ఉండగా వాళ్లెవరికీ లేని ప్రాముఖ్యం ఒక్క నీలవేణికే ఎందుకు రావాలి ?" అన్నాడు చంద్రం.

"ఆమె తల్లి ప్రవర్తన..."

"ఏంచేసిందామె ?"

"ఆమె శివరామయ్యకు ఉంపుడుగత్తెగా ఉండిపోయింది," అన్నాడు సత్యమూర్తిగారు.

"ఏ ఆడదీ తనకు తానై ఆ స్థితిని కోరుకోదు. ఏ విపరీత పరిస్థితులు ఆమెను అందుకు అంగీకరింపజేసి ఉంటయి."

"కావచ్చు. ఆమె తల్లిలాగే నీలవేణిగూడా పెళ్ళీ పెడాకులు లేకుండా ఎవడితోనో ఉంటుందని అనుకుంటున్నారు. కానీ నీలవేణి మాత్రం ఎవర్నీ దగ్గరకు చేరనివ్వటంలేదు. అందర్నీ తరిమి తరిమి కొడుతోంది. ఈవిడ చరిత్ర తెలియనివాడెవడూ లేడు. గనుక ఈమెను పెళ్ళిచేసుకోవటానికి ఎవరూ ముందుకు రారు. కాబట్టి ఏదో ఒక రోజున, ఎవరో ఒకరికి లొంగిపోక తప్పదని అంతా ఎదురుచూస్తున్నారు..."

"అందులో మీరూ ఉన్నారా ?" అని అడిగాడు చంద్రం,

''లేను" అన్నాడు డాక్టరుగారు నవ్వుతూ.

"ఏం, ఎందుచేత ?" అని ప్రశ్నించాడు చంద్రం.

"నీలవేణి తనకో వ్యక్తిత్వాన్ని ఏర్పరచుకున్నట్లు కనిపిస్తుంది. అందరూ ఆశిస్తున్నట్లుగా గాక ఆమె తన జీవితానికో అర్థాన్ని వెతుక్కునే ప్రయత్నమూ చేస్తూంది. తల్లి చనిపోయి రెండు మూడేళ్ళు కావస్తోంది. ఇన్నాళ్ళనుంచి ఎన్ని ఆర్థికమైన ఇబ్బందులు వచ్చినా, ఎవరెన్ని విధాల ఆమెను ప్రలోభపెట్టాలని

చూసినా ఇంతవరకూ తనని తాను కాపాడుకుంటూ వస్తోంది. ఆమె గౌరవంగా బ్రతకాలనుకుంటున్నప్పుడు ఈ లోకుల మాటలను అంతగా పట్టించుకోవాల్సిన పనిలేదు..."

"అసలు ఇన్నాళ్లనుంచీ ఆమెకు ఎలా జరుగుతోంది?" అని అడిగాడు చంద్రం.

"ఏమో? తల్లి పోయినప్పటినుంచీ వాళ్ళు చాలా బీదరికాన్నే అనుభవిస్తున్నారు. మగదిక్కులేక వయసులోనున్న ఆడది, దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నదంటే, అది చాలదా ఆమె ఆలోచనలు ఎలా ఉన్నయో తెలియజెప్పటానికి..."

"నిజమే" అన్నాడు చంద్రం

కొద్దిసేపు మౌనం రాజ్యంచేసింది. డాక్టరుగారు టైం చూసుకుంటూ "భోంచేశారా?" అని అడిగాడు.

"లేదు. మీరూ ఈ పూట ఇక్కడే ఉండండి..." అన్నాడు చంద్రం.

"వద్దులెండి..."

"మీకోసం ప్రత్యేకం ఏం చేయించలేదుగా. నాతోపాటే..."

"మీతోపాటే సర్దుకోమంటారు. అలావద్దు. ఇంకోసారి ప్రత్యేకంగా చెప్పి చేయించుకునే వస్తాను..." అని లేచాడు డాక్టరుగారు.

వెళ్ళిపోతూ హాలంతా చుట్టూ చూస్తూ అన్నాడు, "ఏమిటి మీ ఇంట్లో ఆర్ట్ గేలరీ పెట్టించినట్లున్నారు."

"చూసి ఎలా ఉన్నాయో చెప్పండి..."

ఒక్కొక్కదాన్నే పరిశీలగా చూసి "కొంపదీసి వీటిని మీరుగాని వెయ్యలేదు గదా..."

"వేసింది నేనేగాని, ఎవరి కొంపా తీయలేదు..."

"మీకు టైం ఎప్పుడు దొరుకుతుందండీ వీటన్నిటికీ..."

"దొరికినప్పుడే వేస్తాను..."

"మోడరన్ ఆర్ట్ ఎక్కడా కనిపించదు. అది మీకు నచ్చదా?"

"నచ్చకపోవటం ఏంలేదు. ఎవరి అభిరుచి వాళ్ళది."

"అభిరుచిమాట అలా ఉంచండి. దానిమీద మీ అభిప్రాయం?"

"ఇదివరలో కళకు కొన్ని పరిమితులుండేవి. క్రమేణా చిత్రకారుడు కొత్త అందాలకోసం వెతకటం మొదలుపెట్టాడు. చూసింది చూసినట్టుగా చిత్రించినంతమాత్రాన అతనికి తృప్తిలేదు. తన మనోభావాల్ని ప్రత్యేకమైన పద్ధతిలో

ప్రకటించటానికి ప్రయత్నిస్తున్నాడు. ఎటొచ్చీ ఆ ఆర్టిస్టుయొక్క భాష, భావా వేశం చూసేవాడికి అర్థంకావాలి. మోడరన్ ఆర్ట్‌యొక్క విశిష్టతా, క్లిష్టతా గూడా ఇదే......"

సత్యమూర్తిగారు ఒక పెయింటింగు ముందు నిలబడి తదేకంగా చూశాడు. చెట్లు రాల్చిన ఆకులు, దూరంగా ఉదయిస్తున్న సూర్యకిరణాలు, చెంగు చెంగున దూకుతూ వస్తున్న పిల్లకాలవ...ఎంతో చక్కగా, చూడముచ్చటగా ఉన్నదా చిత్రం.

"ఏ రంగు ఎంత మోతాదులో వెయ్యాలో మీకెలా తెలుస్తుంది?" అని అడిగాడు సత్యమూర్తిగారు.

అదొక అభ్యాసం. ఈ కాస్త కాన్వాసుమీదా ఈ కాసిని రంగులతో ఎన్ని అందాలను ఎంత సహజంగా చూపించటమా అన్నది ఎప్పటికప్పుడు కొత్త విద్యే. అది పూర్తయ్యాక లభించే ఆనందం మాత్రం అనుభవించాల్సిందే గాని మాటల్లో చెప్పలేనిది..."

"అదృష్టవంతులు..."

"ఇంత దురదృష్టంలోనూ ఈ కొద్దిపాటి అదృష్టం దక్కినందుకు నేనూ సంతోషిస్తుంటాను."

మరి కాసేపుండి సత్యమూర్తిగారు వెళ్ళిపొయ్యాడు. చంద్రం మళ్ళీ మూసేసిన పుస్తకం తెరిచాడు.

సినిమా వదిలిపెట్టాక జానకి, నీలవేణి రిక్షా ఎక్కారు. సెంటర్లో నీలవేణి రిక్షా దిగింది. జానకి తన యింటికి వెళ్ళిపోయింది. అక్కడినుంచి తమ సందు లోకి అరఫర్లాంగు దూరంగూడా లేదు. నీలవేణి ఒంటరిగా నడిచి వస్తోంది. రాత్రి పదిగంటలు కావటాన రోడ్డు అంతా నిర్మానుష్యంగా ఉంది. అంచేత వడివడిగా అడుగులు వేస్తోంది. అయితేనేం ఆమె భయపడ్డంత పనీ జరిగింది. వెనకనుంచీ ఈలపాట పాడుతూ సైకిలుమీద వచ్చాడు బోసు. సైకిలు ఆమెకు ఆనిస్తూ వెనక వెనకనే స్లోగా వస్తూ చివరికి ఆమెమీద పడ్డాడు.

"ఛీ! కళ్ళు కనిపించటంలా?" అని కసురుకుంది నీలవేణి.

"కనిపించబట్టేగదా నీ మీద పడింది...నీలూ, మనం రెండో ఆటకు వెళ్దాం వస్తావా?"

"నీ శార్దానికి వస్తాను. వదులూ..." అని బోసు పట్టునుంచి విడిపించుకోవ టానికి గింజుకుంది నీలవేణి.

"నాది ఉడుంపట్టు. నా పట్టు విడిపించుకోవటం నీ తరంకాదు...

"వదులుతావా, కేకలేసి నలుగురినీ పిలవనా ?" అని బెదరించింది.

"పెళ్ళికి పిలుద్దువుగానిలే, నలుగురినీ కేకేసి. నన్ను చేసుకుంటావా మరి ?" అని అడిగాడు బోసు.

నోటితో కొరికి, రెక్క పట్టు విడిపించుకున్న నీలవేణి, కోపంతో ఊగిపోతూ కాలి చెప్పు తీసింది. ఈ హఠాత్‌పరిణామానికి నిశ్చేష్టుడై నిలబడ్డాడు బోసు. ఇంక వాటి ముందునుంచి పరిగెత్తుకుని రావటం మొదలుపెట్టింది. బోసుగూడా తేరుకుని సైకిలుమీద వెంబడించడం మొదలుపెట్టాడు. తన గదిలోకి గూడా దూరతాడని భయపడింది నీలవేణి.

అంచేత గేటుతీసుకుని గబగబా చంద్రం ఇంటికి వెళ్ళి దబదబా తలుపులు బాదింది తలుపు తీసిన చంద్రం రొప్పుతూ రోజుతూ వచ్చిన నీలవేణిని చూసి ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏమిటి, ఏమైంది ?"

"ఏంలేదు, లోపలికి పదండి. కాసేపు నేను మీ ఇంట్లో కూర్చుంటాను," అని అతని కన్నా ముందే ఆమే లోపలికి వెళ్ళి కుర్చీలో కూలబడి, కళ్ళు మూసుకుంది.

"బోసు నా వెంటపడ్డాడు..." అన్నది రెండునిముషాల తర్వాత.

"ఎవడా బోసు..."

"ఎవడో ఒక బోడివెధవ. నా వెనకాలపడటం, నాచేత తిట్లుతినటం వాడికో పెద్ద హాబీ."

"ఇక్కడా ఉన్నారన్నమాట రోమియోలు..."

"వొళ్ళు కొవ్వెక్కిన వెధవలు ఎక్కడైనా ఉంటారు..."

"ఏమంటాడు ?"

"సైకిలుతో నన్ను తరుముకుంటూ వచ్చి మీదపడ్డాడు. చెయ్యిపట్టుకుని లాగాడు."

"రాస్కెల్. రేపు వాణ్ణి లాక్కొచ్చి నీ కాళ్ళమీద పడెయ్యనా ?" అని ఆవేశంగా అడిగాడు చంద్రం.

"ఇంక అక్కర్లేదు. నేనే చెప్పుతో కొట్టబోయాను. పారిపోయాడు."

"ఇంకేం మరి..."

"అంతమాత్రాన ఏమైంది? కుక్కతోక వంకర, దుష్టబుద్ధి వంకర ఒక పట్టాన చక్కబడతాయా ?"

"చక్కబడకపోతే పోలీసువాళ్ళం మేమంతా లేమూ ?" అన్నాడు చంద్రం నవ్వుతూ.

"ఎందుకు లేరూ ? అంతా అయిపోయ్యాక, కోతి పుండును బ్రహ్మరాక్షసిని చెయ్యటానికి మీరూ ఉన్నారు, ఊరి నిండా జనమూ ఉన్నారు..." అన్నది నీలవేణి కర్కశంగా.

"ఇది మరీ బావుంది. నేను వాణ్ణి పట్టుకుంటానంటే వద్దంటావు. పోనీ అని ఊరుకుంటానంటే ఇలా అంటున్నావు..."

"ఇప్పటికి ఇంకేం వద్దులెండి. మా కిది మామూలే..."

"మామూలా ?" అని ఆశ్చర్యపోయాడు చంద్రం.

"చిన్నప్పటినుంచీ వాడి సంగతి నాకు తెలుసు. నా సంగతి వాడికీ తెలుసు."

"అయినా అంత భయంగా ఉన్నప్పుడు ఒక్కదానివీ సినిమాకి వెళ్ళక పోతే ఏం ?"

"మా అవసరాలు మీ కెలా తెలుస్తాయి ?" అన్నది గబుక్కున.

"సినిమా గూడా అవసరమేనా ?" అని అడిగాడు ఆమె కళ్ళల్లోకి చూస్తూ.

"అక్కడ జానకిని కలుసుకోవటం అవసరం," అన్నది నీలవేణి ఒక నిముషం ఆగి.

"ఇంత దొంగతనంగా కలుసుకోవాల్సిన పనేముంది ? దర్జాగా వాళ్ళింటికి నువ్వో, మీ ఇంటికి ఆవిడో రావచ్చునుగదా..."

"వాళ్ళింటికి నేను చస్తే పోను"

"ఏం ?"

"మాకూ వాళ్ళకు బద్ధవైరం"

"జానకి నీ ఫ్రెండ్ అనుకుంటాను"

"మా వైరం పతంజలిగారితోనే. జానకి చిన్నప్పటినుంచీ నా ఆరో ప్రాణం. ఇప్పటికీ నన్ను మర్చిపోదు. ఎక్కడో ఒకచోట కల్సుకుంటూ ఉంటాం. అదిచ్చే ధైర్యంతోనే నేను బ్రతకగలుగుతున్నాను."

"మరి నీకు అంత ఆప్తురాలైన జానకి, పతంజలిగారిని చేసుకుంటానంటే నువ్వెలా ఒప్పుకున్నావు. ఆయన మంచివాడు కాదని వారించలేదా ?"

"నేనూ జానకీ ఒక క్లాసులోనూ, పతంజలి, బోసూ మాకన్నా ఒక క్లాసు పైనా ఉండేవాళ్ళు అది ఆయన విసిరిన వలలో పడిపోయింది."

"అంటే వాళ్ళది గాంధర్వ వివాహమన్నమాట."

"గంగలో వివాహం. వీళ్ళ తిరుగుళ్ల గురించీ ఊరూ, వాడా పొక్కిపొయ్యాక దాని తల్లి పతంజలి తండ్రి గొంతుమీద కూర్చుని, అల్లరిపెడతానని బెదిరించి, వాళ్ల నెత్తిన అక్షింతలు వేయించింది."

"మొత్తానికి మంచి సంబంధమే సంపాదించింది."

"మీ పతంజలి గారికి జానకి ప్రేమించటానికి పనికొచ్చిందిగాని, పెళ్ళిచేసుకోవటానికి పనికిరాలేదు. జానకి నల్లనివన్నీ నీళ్లు, తెల్లనివన్నీ పాలు అని నమ్మే అమాయకురాలు."

"నువ్వు ఆమెను మించిన అమాయకురాలివి పాపం. నీళ్లకోసం గంగిగోవు దగ్గరికీ, పాలకోసం దిగుడు బావి దగ్గరికీ వెళ్తావు." అన్నాడు చంద్రం నవ్వుతూ

"నన్ను పట్టుకుని 'నువ్వు' అంటున్నారేమిటి ?" అని అడిగింది నీలవేణి అతని కళ్లలోకి సూటిగా చూస్తూ.

"నేను అలాగే పిలుస్తాను. నీ కిష్టమైతే పలుకు. లేకపోతే మానెయ్" అన్నాడు చంద్రం మొండిగా.

"మానెయ్యటం ఎందుకూ? నేనూ మిమ్మల్ని పట్టుకుని 'వొరేయ్' అంటాను. మీ కిష్టమేనా ?"

"నీ కంత ధైర్యం వుంటే అలాగే పిలువు" అన్నాడు నవ్వుతూ.

"ఏం పట్టుకెళ్ళి జైల్లో పెడతారా ? పోన్లెండి, అక్కడైనా రెండుపూట్లా ఇంత భోజనం పెడతారు."

"అక్కడి మాటకేంగాని, ఇక్కడ భోంచేద్దాం, లే."

"నాకు వద్దు. మీరు తినేసి రండి."

"అతిధులను వదిలేసి, తినే అలవాటులేదు" అని బలవంతపెట్టాడు చంద్రం.

కాసేపు బెట్టుచేసి. ఆ పూటకు అతనితో కల్సి తిని, అక్కడే పడుకుంది ఆ రాత్రికి, చంద్రం గదికీ, తనకీ మధ్యనున్న గడియవేసుకుని.

*   *   *

## 5

మురళి రాత్రిపూట ప్రైవేటు మాష్టారు యింట్లోనే చాలా పొద్దుపోయేదాకా చదువుకుని, అక్కడే పడుకుని తెల్లవారాక ఇల్లుచేరుతూ వుంటాడు. ఇవాళ కూడా అలాగే వచ్చాడు. అతను వచ్చేటప్పటికి నీలవేణి కుంపటి ముందు కూర్చుని వంటచేస్తోంది. మురళి సంశయిస్తూనే అక్కతో అన్నాడు.

"అక్కా రెండురోజుల్లో నేను ఫీజు కట్టాలి..."

"ఊ..." అన్నదామె వంకాయ ముక్కలు తరిగి గిన్నెలోని నీళ్లలో పడేస్తూ.

"చంద్రంగారు ఇస్తామన్నారక్కా..." అన్నాడు మురళి.

నీలవేణి చేస్తున్నపని ఆపి తలెత్తి తమ్ముడివంక విస్మయంగా చూసింది. "నువ్వు అయన్ని డబ్బు అడిగావా !"

"నేను అడగలేదు. ఆయనే నిన్న ఏదో మాటల్లో అన్నారు."

"అహా, నువ్వేమన్నావు ?"

"మాక్కావల్సింది మీ స్నేహమేగాని, సహాయం కాదన్నాను..." అన్నాడు మురళి అక్కచూపుల్లో చూపులు కలిపి.

"ఇదుగో, ఇప్పుడే చెబుతున్నాను. నీకుగాని, నాకుగాని ఎవరెన్ని ఆశలు పెట్టినా మనం గుడ్డిగా వాళ్ల మాటల్ని నమ్మగూడదు. నమ్మినందుకు, అమ్మ జీవితాంతం అలా కుళ్లికుళ్లి ఏడ్చింది.మనం మళ్ళీ అదేతప్పు చెయ్యకూడదు..."

"చంద్రంగారు మంచివారక్కా..."అన్నాడు మురళి నచ్చచెప్పే ధోరణిలో.

"మంచివాళ్లకు మాత్రం స్వార్థం ఉండగూడదని ఎక్కడుంది ? ఆయనగాని మరొకరుగాని నిజంగా బీదవాళ్లకే సహాయం చెయ్యదల్చుకుంటే ఎంతమంది లేనివాళ్ళు లేమితో బాధపడుతున్నవాళ్ళులేరు. వాళ్ళెవరి సంగతీ పట్టించుకోని వాళ్ళు ఒక్క నీలవేణి తమ్ముడి సంగతే పట్టించుకోవటానికి కారణం ఏమిటో తెల్సా ?...నీలవేణి దిక్కులేని పిల్ల...వయసులో ఉంది...మంచి మాటలతో మత్తుజల్లితే మాయలోపడిపోతుందని...ఎందరో ఎదురుచూస్తున్నారు. వీళ్లందర్నీ పట్టించుకోగూడదు. ఇంకో ఏడాదో రెండేళ్లో ఆగితే నీ చదువు పూర్తయి, నీకో ఉద్యోగం దొరికేదాకా ఇక్కడే కళ్ళుమూసుకుని కాలక్షేపం చెయ్యాలి. కాదు, కాదు రాత్రింబగళ్ళు కళ్లల్లో వత్తులేసుకుని మనకు మనమే కాపలా కాసుకుంటూ రోజులు వెళ్లదియ్యాలి...నీకో ఆదరువు దొరికి, మనం ఇక్కడినుంచి బయటపడ్డాక అప్పుడు మనం అందర్లా గర్వంగా కొత్త జీవితం ఆరంభించవచ్చు...వింటున్నావా. నీమీద ఎన్ని ఆశలు పెట్టుకున్నానో నేను..."

"అవునక్కా, అప్పుడు మనం వీళ్లందరి మధ్య నుంచీ దూరంగా వెళ్లిపోదాం. కొత్తచోట సరికొత్త మనుష్యుల మధ్య మరోజీవితం మొదలుపెడదాం. అక్కడ మనల్ని ఇలా హీనంగా, చులకనగా చూసేవాళ్ళుండరు. గౌరవించి నిన్ను ప్రేమగా చూసుకునే వ్యక్తి తప్పకుండా దొరుకుతాడు. అయనతో నీపెళ్లి నేను జరిపిస్తాను..." అన్నాడు మురళి నవ్వుతూ అక్క ముహంలోకి చూస్తూ.

"పూటకు గతిలేదుగాని, పెళ్ళొకటి తక్కువైంది. వెళ్ళు, వెళ్ళు...స్నానం చేసిరా, పో...నీకు టైం అవుతోంది..."

"మరి నా ఫీజుసంగతి చంద్రంగారిని అడిగి తీసుకోనా, అప్పుగా.. అన్నాడు బ్రతిమిలాడుకుంటూ.

"చెప్పేదంతా ఏమిటి? నువ్వెవర్నీ ఏమీ అడగక్కర్లేదు. నిన్న జానకి సినిమాహాల్లో కల్సుకుందిగా. ఒక వందరూపాయలు దానిదగ్గర తీసుకున్నానులే. వెళ్లేటప్పుడు ఇస్తాను..."

"ఆమె మాత్రం ఇలా మొగుడికి తెలియకుండా మనకు ఎంతకాలం ఇస్తుందక్కా?"

"ఇచ్చినన్నాళ్ళు ఇస్తుంది. తర్వాత సంగతి అప్పుడు చూద్దాం...నువ్వె వెళ్ళిరా..." అని తొందరపెట్టింది నీలవేణి.

మురళి స్నానాల గదివైపు వెళ్ళబోతూ, ఎదిరింటిముందు రిక్షా దిగుతున్న వాళ్ళను అక్కకు చూపించాడు.

పిల్లాణ్ణి తీసుకుని లోపలికొస్తున్న కామేశ్వరిని చూస్తూ కుర్చీలోనుంచి లేచాడు చంద్రం. చేతిలో పేపరు పక్కన పడేస్తూ పలకరించాడు.

"నువ్వు వస్తున్నట్లుగా ఉత్తరం రాస్తే బస్సుదగ్గరకు ఎవరినన్నా పంపే వాణ్ణి గదా..." అన్నాడు చంద్రం.

"ఈమాత్రం కనుక్కోలేనా ఈ పల్లెటూళ్ళో...వీడు నిన్ను చూస్తానని పదే పదే అడుగుతున్నాడు. అందుకని, తీసుకొచ్చేశాను..." అన్నది కామేశ్వరి పిల్లవాడితో లోపలికి నడుస్తూ.

ముక్తసరిగా కాసేపు కుశలప్రశ్నలు అడిగి తనకు పనిఉన్నదంటూ రోజుటి కంటే ముందే వెళ్ళిపోయాడు చంద్రం. అతను వెళ్ళిన అరగంట తర్వాత నీలవేణి చంద్రం ఇంటికి వెళ్ళింది బిందె చంకనబెట్టుకుని. ఈమె వెళ్లేటప్పటికి కామేశ్వరి పిల్లవాడికి నీళ్ళుపోసి ఒళ్లు తుడుస్తున్నది ఈమె ఎవరా అని నీలవేణి చారడేసి కళ్ళతో ఆశ్చర్యంగాచూస్తే, ఇంత అందమైన స్త్రీ ఈ మారుమూల పల్లెటూళ్లో ఎలా ఉన్నదా అని కామేశ్వరి ఆశ్చర్యపోయింది.

చూపులతర్వాత మాటలు కల్సినయి. నీలవేణి తాను ఎదురింట్లో ఉంటానని, మంచినీళ్ళకోసం వచ్చాననీ చెబితే, తాను చంద్రం అక్కననీ, చూసిపోవటానికి వచ్చాననీ చెప్పింది. మధ్యాహ్నం భోజనాలు అయ్యాక తీరిగ్గా కల్సుకుందాం అని అప్పటికి విడిపొయ్యారు.

మధ్యాహ్నం చంద్రం వచ్చి వెళ్ళాక, నీలవేణి మళ్ళీ వెళ్ళింది. కామేశ్వరి నవ్వుతూ ఆహ్వానించింది. ఇప్పుడు వెంటబెట్టుకువచ్చిన పిల్లాడు చంద్రం కొడుకుట.

"ఈ పిల్లాడికి తల్లిలేదా?" అని అడిగింది నీలవేణి.

"ఉంటే, ఇన్ని అగచాట్లు ఎందుకు? వీడి కాన్పులోనే తల్లిని పోగొట్టుకున్నాడు. అందుకే వీడంటే చంద్రానికి బొత్తిగా పడదు. వీడి మూలంగానే తన ముద్దుల పెళ్ళాం పోయిందని వాడికి లోపల కోపం..."

"ఆవిడ ఆయుషు అంతే ఉంది. పసిపిల్లాడు వీడేంచేశాడు?" అని అడిగింది నీలవేణి

"నేనూ అదే అంటాను. ఎంత తెలివిగలవాడికిగూడా కొన్నివిషయాల్లో మైండు పనిచెయ్యదు. పుట్టిన పసికందును ఎక్కడో, ఎవరిముహానో పారేస్తానంటే, నేనే అడ్డుపడ్డాను. ఈ మూడేళ్ళనుంచీ నాదగ్గరే పెరుగుతూ వచ్చాడు. కానీ ఇంక వీడ్ని ఇక్కడే దించిపోదామని వచ్చాను..."

"మరి ఈ పిల్లాణ్ణి ఆయన చూడగలరా?" అని అడిగింది నీలవేణి.

"చూడలేకపోతే, ఈ పిల్లాడికోసమన్నా మళ్ళీ పెళ్ళిచేసుకోవాలి...ఎన్నేళ్ళని వాడిలా, ఎండిన మానులా, ఊళ్ళుపట్టుకు తిరుగుతూ ఉంటాడు..."

"అదీ నిజమే...మీరే కలగజేసుకుని గట్టిగా పట్టుబట్టి ఏదో మళ్ళీ ఇంత తోడూనీడా ఏర్పాటుచెయ్యాలి మరి..." అని సలహాగూడా చెప్పింది నీలవేణి.

"వినేవాళ్ళకయితే ఎవరైనా ఏమైనా చెప్పొచ్చు, చెయ్యొచ్చు. మొండివాళ్ళనేం చెయ్యగలం? ఏప్పుడో మళ్ళీ ఎవరో ఎదురుపడి బెదురుచూపులతోటే పదును బాణాలువేస్తే, ఇంత పెద్దపులీ పిల్లిలా అయిపోయి వాడే ఆ పిల్లవెంట పడిపోతాడు...అంతదాకా ఇంతే..." అన్నది కామేశ్వరి భావగర్భితంగా నవ్వుతూ.

కామేశ్వరి భుజంమీదా, వొళ్ళోనూ పడుతూ లేస్తూ, ఆమెను పట్టుకునే వేళ్ళాడుతున్న బాబును దగ్గరకు లాక్కుంది నీలవేణి.

"నీ పేరేంటి?" అని అడిగింది.

"అచోకు" అన్నాడు వాడు ఆమెచేతుల్లో మెలికలుతిరుగుతూ.

"అబ్బో, అశోకచక్రవర్తివా నువ్వు? ఎవరు పెట్టార్రా నీకాపేరు?" అని ముద్దుపెట్టుకుంది.




"మావారే వాడికాపేరు పెట్టారు. పేరుకే వాడు అశోకుడుగాని, నిజానికి వాడికి మిగిలింది శోకమే," అన్నది కామేశ్వరి.

నీలవేణి మరికాసేపు బాబును ముద్దాడుతూ గడిపింది. కామేశ్వరి టిఫెను చేసింది. ఇంట్లోను, దొడ్లోను, ముందు వరండాలోనూ సాయంత్రందాకా కబుర్లు చెప్పుకుంటూ గడిపారు. నీలవేణి ఎంతో తెలివిగలదీ, మంచిదీ, అందమైనదీ అనిపించింది కామేశ్వరికి–ఈ అమ్మాయిని చంద్రానికి చేసుకుంటే బావుంటుంది. కానీ వయసుకు చిన్నవాడే అయినా, రెండో సంబంధం అనగానే అందరూ వెనకాడతారు. అంచేత ధైర్యంచేసి ఆ ప్రసక్తి కామేశ్వరి నీలవేణి ముందు తీసుకురాలేకపోయిందిగాని, చంద్రంతో అనకుండా ఉండలేకపోయింది

"నీలవేణి అని మన ఇంటికి నీళ్ళకొస్తోంది, చూశావురా? చాలా బావుంది. పాపం బీదరికంవల్ల అలా ఉందిగాని, అదే కాస్త ఉన్నవాళ్ళమ్మాయిఅయితే, కలెక్టర్లూ, గవర్నర్లూ వచ్చి ఆమెముందు వాలతారు..."

"కలక్టర్లు, గవర్నర్లను ఆమె చస్తే చేసుకోదు. ఎందుకంటే వాళ్ళంతా ముసలివాళ్లు అయిపోతారు అప్పటికి..." అని నవ్వాడు చంద్రం.

"మీ ఇద్దరికీ పెద్ద తేడా లేదుగదరా..." అని బయటపడి అడిగింది కామేశ్వరి.

"నాతో అంటే అన్నావుగాని, ఆ అమ్మాయితో ఇలాంటిమాటలు అనకు. ఆవిడసలే ఫైర్‌బ్రాండ్...ఎడాపెడా దులిపేస్తుంది..." అని అంతటితో

ఆమె నోరు మూయించాడు చంద్రం. మరో నాలుగురోజులు గడిచాక కామేశ్వరి ఊరికి బయల్దేరింది పిల్లలు గొడవచేస్తుంటారంటూ. వెళ్లేటప్పుడు కామేశ్వరి అశోక్ బాగోగులు చూస్తుండమని నీలవేణికి చెప్పింది. అలాగేనని చెప్పిందామె.

కామేశ్వరి వెళ్ళిపోయింది.

చంద్రం బాబుపట్ల చాలా నిర్లిప్తంగానే ఉంటున్నాడు. నీలవేణి ఎప్పుడొచ్చినా అశోక్ ఇంట్లో ఏదో ఒక మూల ఒంటరిగా కూర్చుని తనలో తనే ఏదో మాట్లాడుకుంటూ ఆడుకుంటూ ఉంటాడు. లేదంటే ఏడుస్తూ ఉంటాడు. వాడి ఆలనా, పాలనా అంతాగూడా జాన్‌కే వదిలేసి ఊరుకున్నాడు చంద్రం. పసి పిల్లల పెంపకం వాడికిమాత్రం ఏంతెలుసు? ఏదో మొక్కుబడికి చేసేవాడు. అశోక్‌కు వాడంటే గిట్టకుండాఉంది.బాబు చెప్పినమాట వినటంలేదని చంద్రంతో చెబితే, అతడు రెండు తగిలించేవాడు. వెక్కివెక్కి ఏడ్చి, అలానే పడి నిద్ర పొయ్యేవాడు. ఇదంతా గమనిస్తూనే ఉంది నీలవేణి.

ఒకరోజు సంధ్యవేళ చంద్రం డాబామీద కూర్చుని ఉన్నాడు. నీలవేణి క్రిందినుంచి బాబును ఎత్తుకుని వచ్చి అతనిపక్కన కూర్చుంటూ అన్నది:

"మీకు అభ్యంతరం లేకపోతే కాసేపు ఇక్కడ కూర్చుంటాను..."

"అభ్యంతరం ఏదన్నాఉంటే నీకు ఉండాలి. నాకేం అభ్యంతరం లేదు..."

"అలాంటి అభ్యంతరం ఉంటే నేను రాకనేపోదునుగదా..." అన్నది నీలవేణి నవ్వుతూ.

"ఏమో, క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్..."

"వీళ్ళిలా క్షణక్షణమూ మారటానికి కారణం ఎవరంటారు?"

"ఎవరి ప్రవర్తనకు కారణం వాళ్ళే. మరొకర్ని నిందించటం పలాయనత్వం, ఆత్మవంచనాను."

"ప్రతిమనిషీ స్వార్థచింతలోనే బ్రతుకుతున్నాడు. కానీ పైకిమాత్రం అందరికీ ఆదర్శాలు, ఆశయాలూ వల్లెవేస్తూ చెబుతుంటాడు. ఇదంతా ఏమిటి?"

"మితిమీరిన స్వార్థం ఉండగూడదు గాని, స్వార్థం అనేదే ఉండగూడదని ఎక్కడాలేదే? అసలు ఈ వ్యవస్థ మొత్తానికీ ఆ స్వార్థమే మూలకారణం..."

"ఏమోలెండి, అంత పెద్దపెద్ద ఐడియాస్ అన్నీ మాకు రావు..." అని ఒప్పుకున్నది నీలవేణి.

"నీకు కోపంరాదంటే ఒక సామెత చెబుతాను. ఐడియాలు గడ్డాలాంటివిట. మగవాళ్ళకు ఎదిగిన తర్వాత వస్తాయిట. ఆడవాళ్ళకు అసలు రావుట..."



"అదెవరో మీలాంటివాడే చెప్పిఉంటాడు..." అని నవ్వింది.

"అవును, నాలాంటివాడికే గాని అలాంటి ఐడియాలు రావు..." అని నవ్వాడు చంద్రం.

అశోక్ ఎప్పుడో ఆమెదగ్గరనుంచి వెళ్ళి తండ్రి పక్కకు చేరాడు. చంద్రం పక్కన పెట్టుకునిఉన్న సిగరెట్టుపెట్టె, అగ్గిపెట్టె, గాగుల్స్ తీసి చూడటం మొదలు పెట్టాడు.

"నాన్నాలూ, ఈ చళ్ళజోడు నేను పెత్తుకుంతా" అన్నాడు అశోక్ వచ్చీ రానీ మాటలతో.

"చీకట్లో ఎవరూ పెట్టుకోరు" అన్నాడు చంద్రం, వాడి చేతుల్లోనుంచి కళ్ళజోడు తీసుకుంటూ. ఒకటి రెండుసార్లు వాడిచేత ఆమాట అనిపించి పకపక నవ్వుతుంటే చంద్రం విసుక్కున్నాడు,

"దేనికంత నవ్వు?"

"మీ గారాలకుమారుడి ముద్దుమాటలకీ, కొత్తగా పెట్టిన ఆవకాయకీ రుచి ఎక్కువట..." అని నవ్వింది మళ్ళీ.

"వెధవకి ఎన్నేళ్ళువచ్చినా మాటలే రావు మొద్దుసన్నాసి...శనివెధవ...
అని విసుక్కున్నాడు చంద్రం.

"ఎందుకు అలా తిడతారు? పసివాడుగదా వాడు..." అని బిక్కమొహం వేసిన అశోక్‌ను దగ్గరకు తీసుకుంది నీలవేణి

"చూడటానికి పసివాడేగాని, వీడు రాక్షసుడు ప్రాణాలు తీసేస్తాడు." అని కోపంగా చూశాడు.

"ఎవరి ప్రాణాలు తీశాడు?" అని సూటిగా అడిగింది నీలవేణి నుదురు చిట్లించి చూస్తూ.

"నీకు తెలియదు వాడిసంగతి. అసలు పుట్టగానే...ఎందుకులెండి..." అని ఆగిపోయాడు.

"నాకూ తెల్సులెండి. అందుకే అడుగుతున్నాను. పుట్టగానే వాడు తల్లి ప్రాణాలు తీస్తుంటే మీరెందుకలా చూస్తూ ఊరుకున్నారు. క్రిమినల్‌కేసు పెట్టక పోయారా?...ఇంత చదువుకున్నవారు మీరుగూడా ఇలా మూర్ఖంగా ఆలోచిస్తారేం?" అని అడిగింది నీలవేణి.

చంద్రానికి కోపంవచ్చింది "ఏమిటి నీవనేది?"

నీలవేణిగూడా రెట్టించింది. "మీరనేది ఏమిటి? మీ భార్యపోయారు గాబట్టి దానికి బాధ్యుడు వీడేనంటారు. మీకు భార్యపోతే, వాడికి తల్లిమాత్రం పోలేదా? అయినా పసికందు వాడేంచేశాడని మీకు వాడిపై అంత కక్ష? ఇన్నేళ్ళువచ్చి, ఇంత ధైర్యాన్ని అలవరచుకున్న మీరే భార్యపోయిందని లోలోపల అంత బాధ పడుతున్నారుగదా, పొత్తిళ్ళలోని పసివాణ్ని తీసుకుని పాలిచ్చి, లాలించి, అనుక్షణం కంటికిరెప్పలా కాపాడవల్సిన తల్లిని పోగొట్టుకున్న వాడెంత నష్ట పొయ్యాడో, ఎంత కష్టపడుతున్నాడో అన్న ఆలోచన అయినా మీకు రాలేదేం? పోయిన తల్లి లేకపోగా, ఉన్నతండ్రిగూడా కాఠిన్యంవహిస్తే ఆ లేతహృదయం తట్టుకోగలదా?" అని నిలదీసి అడిగింది.

చంద్రం మౌనం వహించాడు.

మళ్ళీ ఆమే అన్నది, "పిల్లలకు తల్లిదండ్రు లిద్దరూ అవసరమే. దురదృష్ట వశాత్తూ ఆ ఇద్దరిలో ఎవరైనా కరువైతే, రెండోవాళ్లే వాళ్ళను ఆదుకోవాలి. తల్లిదండ్రుల ప్రేమకు నోచుకోని వాళ్ళకు మనసు ఏమంత ఆరోగ్యకరంగా పెరగదు. ఆ లోటు తీరటం కష్టం. అది అనుభవిస్తున్న నాలాంటిదానికి గాని తెలియదు" అన్నది నీలవేణి ఆగి ఆగి.

"అయితే ఏమిటంటావు?" అని అడిగాడు చంద్రం.

"ఇకనుంచి వాడిపట్ల మీ వైఖరి మారాలి. మీరు వాణ్ణి ప్రేమగా చూడటం అలవాటు చేసుకోవాలి" అని కోరింది నీలవేణి.

"అలా చూడకపోతే?"

"నేను ఊరుకోను తెల్సిందా?"

"నీ వ్యక్తిగత విషయాలగురించి నన్ను పట్టించుకోవద్దన్నావు. మరి, ఇప్పుడు నువ్వు చేస్తున్నదేమిటి?" అని అడిగాడు చంద్రం.

నీలవేణి వెంటనే ఏమీ మాట్లాడలేదు. కొంచెంగా జంకినట్లు కనిపించింది. తర్వాత నెమ్మదిగా అన్నది, "నా పరిస్థితులు వేరు. నేను కొందరికి కావాలని దూరంగా ఉండాలి. మరి కొందరికి కావాలని దగ్గరగా ఉండాలి. కనీసం అలా నలుగురికీ కనిపించాలి. అంచేత మీరు వద్దన్నా నేను మీ యింటికి రాకుండా ఉండేదిలేదు. మీ బాబునీ, మిమ్మల్నీ అంతకన్నా వదిలేదిలేదు."

"కానీ మనమధ్య ఉండవల్సింది కేవలం పరిచయమో, స్నేహమో, ఆత్మీయతో, మరొకటో—ఏదో చెబితే దానిదగ్గరే ఆగిపోతాను నేను" అన్నాడు చంద్రం.

"అంతేగాని, మీకేమీ ఒక అభిప్రాయం లేదన్నమాట" అని నీలవేణి కళ్ళనిండా ఆశనింపుకుని చూసింది.

"నీకు ఇష్టంలేనప్పుడు నాకు ఎన్ని అభిప్రాయాలుంటే మాత్రం ఏంలాభం?" అన్నాడు చంద్రం.

"నాగురించి మీకు పూర్తిగా తెలియదు. తెలియగూడదు. తెలిస్తే మీరూ నన్ను చులకనగా చూస్తారు."

"నా దగ్గరనా ఇలాంటి దాపరికాలు? నీ గురించి పూర్తిగా తెల్సుకున్నాక జాలివేసింది ఇంత చిన్న వయసులోనే నీకు జీవితం ఒక పోరాటం అయింది. ఆ పోరాటంలో నువ్వు చూపిస్తున్న ధైర్యసాహసాలకు ఆశ్చర్యపోతున్నాను గూడా..."

నీలవేణి మనసు ఈ కాస్త ఆప్యాయతకే వెన్నలా కరిగిపోయింది. "ఏం చెయ్యను చెప్పండి. మా అమ్మ పొందిన అవమానాలూ, పడిన కష్టాలు మా కెన్నో పాఠాలు నేర్పినయి. ముప్ఫయి సంవత్సరాలపాటు రెండోమనిషి ముహం చూడకుండా, ఈ నాలుగుగోడలమధ్యా జీవితఖైదును అనుభవించింది చివరకు మమ్మల్ని దిక్కులేనివాళ్ళను చేసి వెళ్ళిపోయింది. దయతలిచేవాళ్లు లేక

పోవటం ఒక ఎత్తు,ఎప్పటికప్పుడు, ఎవరికివాళ్లు నామీద వల విసరాలనిచూడటం ఒకఎత్తు. అంచేత ఈ జీవనపోరాటానికి అవసరమైన గుండె నిబ్బరాన్ని నాకు జీవితమే అందిస్తోంది..."

"నేను చాలావరకు అర్థంచేసుకున్నాను. అంచేత నేను ఏదైనా చెయ్యగలిగితే సంతోషంగా చేస్తాను నిస్సంకోచంగా అడగొచ్చు" అన్నాడు చంద్రం.

"సరె, అడగమన్నారు కాబట్టి, అడుగుతున్నాను. ఇకనించి, మీ బాబు విషయం నేను చూసుకోనా?" అని అడిగింది నీలవేణి. అప్పుడు అశోక్ ఆమె బాహుబంధాల్లోనే ఉన్నాడు

"అందుకు నాకేం అభ్యంతరంలేదు. ఒకరకంగా నాకు కొంత తెరిపిగాగూడా ఉంటుంది. కానీ నీవెందుకి బాధ్యత తీసుకుంటున్నావు!" అని అడిగాడు చంద్రం.

"అలా సూటిగా అడిగితే, చెప్పటానికి కొంచెం ఇబ్బందిగానే ఉంది. ఈ కొద్దిరోజుల్లోనే వీడి ముద్దులుమూటగట్టే ముహారవిందమూ, నవ్వులు చిలికించే మాటలూ నాకు ఎంతో ఊరటనీ, ఉల్లాసాన్ని కలిగిస్తున్నాయి. కాసేపు వీణ్ణి దగ్గరకు తీసుకుంటే, ఏడిలా నా భుజంమీదకు ఒరిగిపోతే, గుండెలకు హత్తుకుపోతే, ఈ చిన్నారి చేతులతో నా మెడను చుట్టేస్తే, ఇదమిద్ధంగా చెప్పలేని హాయి, తృప్తీ...నాలాగే వీడూ శాపగ్రస్తుడు. మేమిద్దరం ఇలా ఒకరితో ఒకరం కబుర్లు చెప్పుకుంటూ, మా బాధల్ని మేము మర్చిపొయ్యేందుకు ప్రయత్నిస్తాం...మీకు అభ్యంతరం లేకపోతే..."

చంద్రం దీర్ఘంగా నిట్టూర్చాడు. "నీ వొడిలోని వెచ్చదనానికి నోచుకున్న వాడి అదృష్టాన్ని చూసి ఇప్పుడు వాడిమీద నాకు అసూయగాగూడా ఉంది" అన్నాడు నవ్వుతూ కాసేపటికి.

"అదిగో, అలాంటి చిలిపి మాటలు మాట్లాడితే నీలవేణి ఊరుకోదు ఎవరి దగ్గరా నేను హద్దులు మీరను. నాదగ్గర ఎవరూ హద్దులు మీరగూడదు."

"నీతో మాట్లాడటం అంటే కత్తిమీదసాములాంటిదే."

"నేనింత కత్తిమీద సాముచేస్తున్నా, నామీద ఎవరికీ గౌరవభావంలేదు. అందరికీ చిన్నచూపే. అదే చిత్రం" అన్నది దిగులుగా. దూరానికి చూస్తూ, బాబు తలనిమురుతూ ఉండిపోయింది.

"మరి ఈ అసిధారావ్రతం ఎవరికోసం?"

"నాకోసమేనని నాకు తెల్సు. చెప్పొచ్చిందేమిటంటే, పెళ్ళికిముందు అన్ని

వేషాలువేసిన జానకి అప్పుడూ, ఇప్పుడూగూడా అందలంమీదే ఎక్కి కూర్చుని ఉంది ఎవరి ముహంవంక కన్నెత్తిచూస్తే ఏంపాపమో అన్నట్లు, తలొంచుకు నడుస్తున్న నేనే, అందరి అవహేళనలకూ గురికావల్సివస్తోంది అదే నన్ను అమితంగా బాధించే విషయంగూడా

ఆమెతోపాటూ, చంద్రంగూడా కాసేపు ఏదో ఆలోచనలో పడిపొయ్యాడు

పున్నమివెన్నెల ఎంతో ఆహ్లాదాన్ని కలిగిస్తోంది చుక్కలమధ్యనున్న చంద్రుడు, నీలినీటి సరస్సులోని తెల్లకలువలమధ్య తిరుగాడుతున్న రాజహంసలా ఉన్నాడు చుట్టూఉన్న వెన్నెలకాంతి మహర్షి ఆశ్రమంలో ఆవరించిన శాంతిలాగా, మనసుకు ఎంతో ప్రశాంతిని అందించే ప్రయత్నం చేస్తోంది

ఇంక మురళి భోజనానికి వచ్చేవేళయిందని లేచింది నీలవేణి చంద్రం గూడా లేచి నిలబడ్డాడు అశోక్‌గూడా లేచి ఇద్దరిమధ్యా నిలబడి క్రిందకు చూస్తున్నాడు రోడ్డుమీద గుమ్మంముందు ఒక బిచ్చగత్తె 'మాదాకవళం' అని అరుస్తోంది ఆమె మనిషేగాదు, గొంతుగూడా చాలా వికృతంగానే ఉంది అశోక్ భయపడి నీలవేణికాళ్ళను చుట్టేస్తే ఆమె వాణ్ణి ఎత్తుకుంది

ఇదెవతో పిచ్చిలా ఉంది రోజూ వస్తుంది పెట్టకపోతే, తిట్టుకుంటూ పోతుంది అన్నాడు చంద్రం

కడుపుమండితే తిట్టదామరి? మొగుడితో గుట్టుగా సంసారంచేసుకుంటున్న దాని గుండెల్లో మంటరగిల్చేదాకా, మీ పతంజలిగారికి బోసుగాడికీ నిద్రపట్ట లేదు

'వాళ్ళకేమిటి సంబంధం? ఈమెను వాళ్ళు ఏంచేశారు?" అని ఆసక్తిగా అడిగాడు చంద్రం

"పోలీసువారు తెల్సుకున్నది ఇదేనన్నమాట అవున్లెండి గొప్పవారి చేష్టలెప్పుడూ గోప్యంగానే ఉంటాయి ఫలితంగా బీదవాళ్ళ బ్రతుకులే ఇలా బజారున పడుతుంటాయి, అన్నది నీలవేణి భుజంమీదకు వాలిపోయిన అశోక్‌ను మృదువుగా చిచ్చుకొడుతూ

డాబా దిగి క్రిందికి వచ్చాక నీలవేణి అన్నది 'వీణ్ణి నాతోతీసుకువెళ్తాను నాదగ్గరే పడుకుంటాడు

"ఎందుకు మీకాశ్రమ? పైగా వాడు రాత్రిళ్ళు గుడ్డలు పాడుచేస్తాడు "

"పోన్లెండి, అలాఅన్నా కొత్తవి కొందురుగాని "

"వాడికా, నీకా?

"మీ కొడుకుగాబట్టి వాడికి మీరు కొంటారు. నేను మీకు ఏమవుతాననని?"

"గుమ్మంలో ఎదురవుతావని..." నవ్వాడు చంద్రం.

"ఎదురైనవాళ్ళందరికీ మీరిలా కొనిస్తే, దివాళా అవుతారు" అని తనూ నవ్వింది నీలవేణి.

బాబును తీసుకొని వెళ్ళిపోతున్న నీలవేణివంకే చూస్తూ నిలబడిపోయినాడు చంద్రం. ఆనాటి వెన్నెలంతా ఆమెతోనే వెళ్ళిపోయినట్లు అయింది. మబ్బు చంద్రుణ్ణి కప్పేస్తే.

* * *

## 6

ఉదయం పదిగంటలు దాటింది. మురళి ఫోంచేసి, పుస్తకాలు తీసుకుని వెళ్ళిపొయ్యాడు. నీలవేణి తలుపేసుకుని ఇంట్లో పనిచేసుకుంటోంది. ఎవరో తలుపుకొడితే, చేస్తున్నపని ఆపి, వచ్చి తలుపు తీయగానే తోసుకుంటూ లోపలికి వచ్చాడు బోసు.

"ఏయ్, ఏమిటిది. ఆగు" అని అరుస్తున్న నీలవేణిని వెనక్కి తరుము కుంటూ లోపలికి, మీదమీదకి వచ్చాడు.

"ఆగటానికి రాలేదే...అటో ఇటో తేల్చుకోవటానికే వచ్చాను" అన్నాడు బోసు.

"ఏమిటి తేల్చుకునేది?" అన్నది నీలవేణి, చెదిరిపోతున్న ధైర్యాన్ని కూడ దీసుకుంటూ.

"నీ సంగతి. ఈ గదికి నెలకు పాతికరూపాయల చొప్పున, మీ అమ్మ పోయి నప్పటినుంచి, మీరిక్కడ చేరిన ఈ నాలుగేళ్ళనుంచి అద్దె వసూలు చేసుకు రమ్మని పతంజలిగారు నన్ను ఇక్కడికి పంపించాడు" అన్నాడు బోసు నీల వేణి కళ్ళల్లోకి చూస్తూ.

"మా అమ్మపోయినప్పుడు, ఆ ఎదురింట్లోనుంచి మమ్మల్ని తరిమేశాడు. మా మాట ఏమిటని నిలదీస్తే, నలుగురికీ భయపడి, ఈ గదిలో ఆయన ఉండ నిచ్చాడు. ఎందుకు అద్దె ఇచ్చేదేమిటి? గట్టిగా మాట్లాడితే, ఆయన మొత్తం ఆస్తిలో మాకే వాటారావాలి. తెల్సా!" అని దబాయించింది. భయాన్ని కప్పి పుచ్చుకుంటూ.

"ఓహో, రూల్సు మాట్లాడుతున్నావా? వాడినాన్న ఆస్తి వాడికొచ్చింది. నీకు ఊరినిండా నాన్నలే గాబట్టి, ఊళ్లో అందరి ఆస్తుల్లోనూ వాటా రావాలి. కదుటే?" అని నవ్వాడు బోసు.




"నోర్మూయ్" అని అరిచింది నీలవేణి.

"నువ్వెంత అరిచినా, ఈ ఊరి జనాలనోళ్ళు మూతపడవుగాని, సుబ్బరంగా నామాట విను. నిన్ను గుళ్ళో అమ్మవారి బొమ్మనిచేసి పూజిస్తాను" అని చటుక్కున నీలవేణి చెయ్యి అందిపుచ్చుకోబోయాడు.

నీలవేణి గబగబా పరుగెత్తుకుని బయటకు వచ్చింది, బోసును తిట్టిపోస్తూ. ఆమె వెనకనే అతనూ వచ్చాడు, అంతకన్నా పెద్దగొంతుకతో అరుస్తూ.

"ఇదేమన్నా ధర్మసత్ర మనుకున్నారా నెలలకొద్దీ, సంవత్సరాలకొద్దీ బేవార్సుగా ఉండటానికి. అద్దె ఇవ్వమని అడిగితే, రోడ్డెక్కి అల్లరిపెడతావా? మంచీ, మర్యాదా ఉండక్కర్లా? నాలుగురోజుల్లో మొత్తంఅద్దెకడితేసరే, లేకపోతే సామాను బయటపడెయ్యాల్సింటుంది. జాగ్రత్త..." అంటూ అప్పుడే అక్కడ పోగయినవాళ్ళు వినేటట్లుగా అరచి, సైకిలుఎక్కి వెళ్ళిపొయ్యాడు.

చంద్రం వచ్చాక జరిగిన విషయం చెప్పింది నీలవేణి. ఇంక తాను కలగ జేసుకోవటం అవసరం అనుకున్నాడు. బోసును స్టేషనుకు తీసుకురమ్మని కానిస్టేబుల్స్‌ను పంపించాడు. ఇంటిదగ్గర లేడని, ఎక్కడున్నాడో తెలియదనీ తిరిగొచ్చారు వాళ్ళు.

బోసుతో వ్యవహరించాల్సిన తీరు వేరు, పతంజలిగారితో వ్యవహరించాల్సిన పద్ధతి వేరుఅని చంద్రం గ్రహించాడు పతంజలిగారు ఊళ్ళో పేరుప్రఖ్యాతులున్న వ్యక్తేగాక, తనురాగానే, తనతో స్నేహంచెయ్యాలి అని కాంక్షించిన

వాడు. అందుకోసం తనని విందుకు పిల్చాడుగూడా. ఇప్పుడు తనూ ఆ బాకీ తీర్చుకోటం అవసరమనుకున్నాడు. ఆవేళ సాయంత్రం పతంజలిగారి దంపతులనీ, డాక్టరుగారినీ భోజనానికి పిల్చాడు. నీలవేణినీ, మురళినీగూడా పిల్చాడు చంద్రం. కానీ పతంజలిగారికీ, నీలవేణి, మురళీలకీ ఆగర్భశత్రుత్వంగాబట్టి వీళ్ళు ఆవేళ రామన్నారు.

డాక్టరుగారు అడిగారు. "ఈనాటి ఈ విందుకు సందర్భం ఏమైనా ఉందా? అసందర్భంగానే నేను తినటానికి వచ్చానా?"

చంద్రం అందుకు సమాధానం చెప్పాడు. "ఆరోజు పతంజలిగారింట్లో అంత చక్కని భోజనంచేశాం. వారికి చాలా ఋణపడి పొయ్యాం. ఆ ఋణం తీర్చుకోవాలిగా."

అవున్లెండి. ఎప్పటిదప్పుడు తీర్చేసుకుంటే నయం. లేకపోతే ఈ ఋణం తీర్చుకోవటంకోసం మరొజన్మఎత్తటం, వాళ్ళు ఎక్కడున్నారో వెతుక్కుంటూ వెళ్ళటం..."

మరి మీరుగూడా త్వరగా ఒక ఇంటివారై, మాకు ఇలాగే మాంచేపార్టీ ఇవ్వాలి" అన్నది జానకి.

అప్పుడుగాని మీ ఋణం తీరదు," అన్నాడు పతంజలిగారు భార్య మాటను పూర్తిచేస్తూ.

'మీరు కావాలంటే తలారెండు ఇంజక్షన్సు ఫ్రీగా ఇస్తానుగాని, డిన్నరు మాత్రం ఇవ్వలేను."

మరి మా ఋణం తీరేదెలా?" అని అడిగింది జానకి.

"అలా ఎందుకు అనుకుంటారమ్మా? క్రిందటి జన్మలో నాకు మీరే ఋణపడి ఉండి, ఈ జన్మలో ఇలా తీర్చుకుంటున్నారనుకుంటే పోలా?"అని సత్యమూర్తిగారు అంటే మిగిలినవాళ్ళంతా నవ్వేశారు.

జానకమ్మగారంత అద్భుతంగా కాకపోయినా, జాన్‌గూడా బాగానే వంట చేశాడని మగవాళ్ళు ముగ్గురూ ఒప్పుకున్నారు.

తాంబూలాలు సేవిస్తూ ఉండగా జానకి బాబుగురించి అడిగింది. నీలవేణి దగ్గర ఉన్నాడని చెప్పాడు. చూసివస్తాననే మిషమీద జానకి, నీలవేణి ఇంటికి వచ్చింది. ఇందుకోసమే ఎదురుచూస్తున్న నీలవేణి, జానకి లోపలకు రాగానే సుడిగాలిలా చుట్టేసింది.

'అసలు మీ ఆయనకేమన్నా బుద్ధిఉందిటే?" అని అడిగింది జానకిరాగానే.

"అదిఉంటే, మనకిన్ని అవస్తలు ఎందుకే?" అని నవ్వింది జానకి.

"ఆ కొంపలోనుంచి, ఆరోజు బయటకు గెంటాడు. సరె, మా ఖర్మమిలా ఉండదని, ఈ జానాబెత్తెడు గదిలోపడి కొట్టుకుంటూఉంటే, ఇక్కడా ఉండ నివ్వడా! ఇంక చెట్టుక్రింద చేరితేగాని తృప్తిగా ఉండదా? నాలుగేళ్ళనుంచి నెలకు పాతిక రూపాయల చొప్పున అద్దె కట్టమంటాడా? ఏముందే మా దగ్గర కట్టడానికి,బండెడు ఎముకలు తప్ప.మీరిస్తున్నడబ్బుతో, మీరు వేస్తున్న ముష్టితో బ్రతుకుతున్న దిక్కులేని జీవాలు కదుటే ఇవి. ఇంకా లేనిపోని బాకీలన్నీ లేవ నెత్తి ఎందుకే మమ్మల్నిలా ఏడిపిస్తారు? ఈ పాతిక రూపాయలు లేకపోతే మీకు నెలగడవదా? మీ ఆయన ధనదాహం తీరటానికి ఇంక ఒక్కటే మార్గం. మాలాంటి కూటికిలేనివాళ్ళ నెత్తురు పిండి, బక్కెట్లనిండా నింపి, సున్నంతో కలిపి, మీ భవనాలకు వెల్లవేయించుకొండే, ఎర్రగా జిగిజిగేలుమని మెరుస్తుం టాయి..." అని ఆవేశంతో ఊగిపోయింది నీలవేణి

జానకి నింపాదిగా అన్నది. "నేను మాత్రం ఏంచెయ్యనే? చెయ్యగలిగిన సాయం ఏదో చాటుమాటుగా చేస్తూనే ఉన్నాను. నేను వద్దు, మానమనిచెబితే, నీ జోలికి రాకుండా ఉంటారు గనుకనా?"

"అదీగాక, ఆ బోసుగాడినెందుకు నామీదకు తోలటం? ఆ తోడేలుతప్ప మరెవరూ దొరకలేదా?" అని నిలదీసింది నీలవేణి.

"అదేమన్నమాటే, ఆ బోసుకు నువ్వంటే చచ్చేంత ఇష్టం."

"చచ్చేంత ఇష్టమయితే, చావమను. నువ్వొక్కణ్ణి కట్టుకుని సుఖపడు తున్నావు చాలు."

"నాకేమే? ఆయనకు నేనంటే చాలా ప్రేమ..." అని నవ్వింది జానకి.

"మీ ఆయనకు బాలాజీ టింబర్‌డిపోలోని టేకు చెక్కలన్నాగూడా చాలా ప్రేమే. ఎందుకూ మనశ్శాంతి లేకపొయ్యాక, ఎంతఉన్నా ఒకటే..."

"సరేలే, నాగొడవకేంగాని, నీ సంగతి చెప్పు? ఎలా ఉన్నారు, ఏమిటి? డబ్బు ఏమన్నకావాలా?" అని అడిగింది జానకి.

"నాకెందుకే డబ్బు? మా ఆయనకు కలపఅడితీ లున్నయి. ఊరినిండా స్వంత ఇళ్లు ఉన్నయి. సినిమాహాల్లో వాటాఉంది కాఫీహోటల్లో షేర్సుఉన్నయి వేలకువేలువచ్చి పడుతున్నయి. ఏంచేసుకోనే ఇంత డబ్బు?" అని నీలవేణి వ్యంగ్యంగా చెప్పింది

"ఉడకబెట్టి కూరొండుకోవే" అని హాస్యమాడింది జానకి.

"అలాగే, చితిపేర్చుకుని మంటగూడా పెట్టుకుంటా" అని బదులుచెప్పింది నీలవేణి.

"ఎందుకే నామీద అంత కోపం? ఆయనేమన్నా నామాట వింటారా, పెద తారా కాదంటే నాలుగు తంతారుగాని..."

అంత గట్టిగా తన్నేవా డెవడూలేడనేగదే, ప్రేమించి పెళ్ళిచేసుకున్నావు" అని గుర్తుచేసింది నీలవేణి.

"సరేలే...నీ దెప్పుళ్లు విండానికి మరోసారి వస్తాను. ఇప్పటికి వెళ్ళిరానా?" అని లేచింది జానకి.

"వెళ్లొచ్చులే, ఉండు. ఇంతలో నీ మొగుణ్ణేమీ కాకులెత్తుకునిపోవు. రాకరాక నా గుమ్మంలోకి వచ్చావు. కుచేలుడి దగ్గరకు శ్రీకృష్ణపరమాత్మ వచ్చినట్లుగా. పెద్దపెద్ద విందులు చేయలేనుగాని, నీకిష్టమని ఈ పాయసం చేశాను, తీసుకో." అని గ్లాసు అందించింది నీలవేణి.

ఇప్పుడివన్నీ ఏమిటే, భోంచేసి తాంబూలంగూడా వేసుకున్నానే," అన్నది జానకి నాలుక బయటపెట్టి చూపిస్తూ.

"అవునే, నువ్విప్పుడు చాలా గొప్పదానివి. నిన్ను పిల్చి. పంచభక్ష్యపర మాణ్ణాలతో విందులుచేయగల మహారాజు లెందరో ఉన్నారు. ఇంక నాలాంటి నిరుపేదరాలు పెట్టేది నీకెక్కడ సయిస్తుందే...నీ అంతస్తు మర్చిపోయి, నేనే నీకోసం ఇది వండి, ఎదురుచూస్తూ కూర్చున్నాను వెర్రిభమతో..." అన్నది నీలవేణి కంటితడి పెట్టుకుని.

జానకి మనసుగూడా ఆర్ద్రమైంది. స్నేహితురాలి ముహంతనవైపుతిప్పుకుంది "సారీ, నీలూ...నిన్ను కష్టపెట్టాలని నేను అలా అనలేదు. ఏదో అనాలోచి తంగా అన్నాను. నన్ను క్షమించు" అన్నది జానకిగూడా కన్నీరు పెట్టుకుంటూ

"సరేలేవే, ఊరుకో. ఇన్నాళ్ళకు ఇంటికివస్తే నీకు పెట్టిందేమీ లేకపోగా, నీచేత కన్నీళ్లు పెట్టిస్తున్నాను," అన్నది నీలవేణి అంతలోనే తేరుకుని.

"ఇవాళ నేను పతంజలిగారి భార్యనని, లక్షాధికారినని నువ్వు తిట్టిపోసినా భరించటంతప్ప నేను చేయగలిగిందేమీలేదు. ఎందుకంటే నువ్వు నీలవేణివై పొయ్యావు. నా చిన్ననాటి నేస్తానివి, నా ప్రాణానివి..."

"కానీ నీ ప్రాణానికిక్కడ ప్రాణాలు పోతున్నాయి..."

"నేను పోనిస్తానా?" నీకోసం నేను ఏమైనా చేస్తాను," అని లేచింది జానకి.

ఒకరికోసం, మరొకరు ఏదో చేద్దామనుకోవటం ఒట్టి భ్రమ. ఎవరి నుదుటి రాత ఎలాఉంటే అలా జరుగుతుంది. అంతే" అన్నది నీలవేణి స్నేహితురాలిని సాగనంపుతూ.

జానకి బాబును తనతో తీసుకుని వచ్చేటప్పటికి డాక్టరుగారు లేరు. ఎవడో టపా కట్టేస్తున్నాడని కబురొస్తే వెళ్ళిపొయ్యారు, తనతో మిగిలిపోయిన పతంజలిగారితో నీలవేణి ఉంటున్న ఇంటిఅద్దెగురించి అడిగాడు చంద్రం. ఆమె ఎంతఇవ్వాలో చెబితే ఆ డబ్బుకు తాను చెక్కు రాసిస్తానని అనగానే, పతంజలి గారు కంగారుపడ్డారు.

"బోసు ఏదో పొరపాటుగా విని ఉంటాడు. నేను నీలవేణి దగ్గరగూడా అద్దె వసూలు చెయ్యమనలేదు. మిగిలిన వాళ్ళందరితోపాటు ఆమెనూ అడిగిఉంటాడు. ఆమెను అద్దె అడగొద్దని నేను గట్టిగా చెబుతాను లెండి. ఇంక మీరావిషయం మర్చిపొండి," అని అభయమిచ్చాడు పతంజలిగారు.

జానకి రాగానే ఇద్దరూ ఆ ప్రసంగం మార్చేశారు. చాలా పొద్దుపోయింది వెళ్తామని లేచారు పతంజలి దంపతులు.

నీలవేణి విషయంలో తాను ప్రత్యక్షంగా కలగజేసుకున్నాడు గనుక, పతంజలి ఇదివరకటిలాగా ఆమెను ఇబ్బందిపెట్టకపోవచ్చు. ఇకపోతే బోసు ఉన్నాడు. వీడికి ఈ పెద్దమనిషి తరహాలేవీ అలవాటులేనట్లున్నాయి.ఏది ఏమైనా ఒకసారి వీడికిగూడా మనచేతిదెబ్బ రుచిచూపిస్తేగాని దారికిరాడు అనుకున్నాడు చంద్రం. రెండు రోజుల్లో ఆ అవకాశం రానేవచ్చింది.

పాలెంకు ఒకమైలు దూరంలోనుంచి చిన్న అడవి ప్రారంభం అవుతుంది. ఈ అడవి మధ్యనుంచి ఒకరోడ్డు వెళ్తుంది. ఈ అడవి ప్రారంభంలోనే చెక్ పోస్టు ఉంది. ఈచెక్ పోస్టు దగ్గరే చెంచువాళ్ళు కొందరు గుడిసెలు వేసుకుని ఉన్నారు.

ఒకరోజు తెల్లవారుఝామున అడవిలోనుంచి దొంగతనంగా కలపతీసు కొస్తున్న ఒకలారీని చెక్ పోస్టువగ్గర పట్టుకున్నారు. తనిఖీచేయటానికిగాను అప్పుడు అక్కడ డ్యూటీలోనున్నవాళ్ళు ఇద్దరు. లారీలోనుంచి దిగినవాళ్లు ఆరుగురు. వాళ్ళకు నాయకత్వం వహించినవాడు బోసు. సాధారణంగా బోసు వీళ్ళతో ఏదోవిధంగా వ్యవహారం పూర్తిచేసుకుంటూ ఉండేవాడు. ఈ మధ్యనే కొత్తగా ఆ పనిలో చేరినవాడెవడో వట్టి చాదస్తుడిలా కనిపించాడు బోసుకు. డబ్బు ఆశచూపినా లొంగలేదు. గంటసేపు బ్రతిమిలాడి, వేడుకున్నా వినలేదు.

ఇంక తెల్లవారటానికి అట్టే సమయంలేదు. అంచేత బోసుకు మరోమార్గం లేక పోయింది. ఆ అరడజనుమందినీ ఇద్దరిమీదికి ఉసిగొలిపాడు. వాళ్ళు ఆ ఇద్దర్నీ చితకతన్నేసి, తమదోవన తాము వెళ్ళిపొయ్యారు కొత్తగా వచ్చినవాడు అంతగా పోల్చలేకపోయినా, ఆ రెండోవాడికిమాత్రం బోసు బాగా తెల్సు.

మర్నాడు ఉదయమే వాళ్ళను తీసుకొచ్చి హాస్పటల్‌లో పడేశారు. పోలీసు కేసు రిజిస్టరుచేశారు. చంద్రం వెళ్ళి, ఆ చెంచుగూడెందగ్గరగూడా విచారించాడు. తెల్లవారుఝామున గొడవజరుగుతున్నప్పుడు ఒకరిద్దరు చెంచువాళ్ళు నిద్రలేచి గుడిసెల్లోనుంచి బయటికివచ్చి చూశారుట. వాళ్ల మనషుల్ని గుర్తుపట్టగలమని చెప్పారు.

అక్కడినుంచి చంద్రం తిన్నగా బాలాజీ టింబర్‌డిపోకి వచ్చాడు. ఆ కాంపౌండ్‌లో అప్పుడేదిగిన కలప కొంత అక్కడపడివుంది. చంద్రాన్నిచూస్తూనే పతంజలిగారు పరుగుపరుగున ఎదురొచ్చారు. నవ్వుతూనే పలకరించాడు.

"ఏమిటిసార్. పొద్దున్నే ఇలా వచ్చారు? కబురు చేస్తే నేనే వొద్దునుగదా?"

చంద్రం నవ్వాడు. "అబ్బే, పనేంలేదు. ఇటునుంచివెళ్తూ, మిమ్మల్నీ మీ డిపోని చూసిపోదామని వచ్చాను" అన్నాడు

"ఎంతమాట! దయచేయండి..." అన్నాడు పతంజలిగారు.

"లోపలికా, బయటికా?" అన్నాడు చంద్రం చిరునవ్వునవ్వుతూనే.

"అదేంటండీ, అలా అంటారు. మీవంటివారు నన్ను గుర్తుపెట్టుకుని వచ్చారంటేనే నాకెంతో సంతోషం-రండి, లోపలికి వెళ్దాం" అని చెక్కలతోకట్టిన చిన్నగదిలోకి తీసుకెళ్ళాడు. అక్కడే ఒక టేబులు, రెండుమూడు కుర్చీలు ఉన్నాయి. కాఫీ తెప్పించారు పతంజలిగారు, డిపోచుట్టూ తిప్పిచూపించాడు.

"ఈ కలప ఇప్పుడే తెప్పించారా?" అని అడిగాడు చంద్రం.

పతంజలిగారు నిమ్మకు నీరెత్తినట్లు ఉండే, నెమ్మదిగా అన్నాడు. "వచ్చి వారంరోజులు అయిందండి. వీటిని సైజుచేయించాలి. ఈ కూలివాళ్ళతో పెద్ద బాధండి. డబ్బుపోవటమే కనపడుతుందిగాని, పని జరగదు..."

"ఈ డిపో మీదేనా, ఇంకా ఎవరైనా భాగస్తులున్నారా?" అని అడిగాడు చంద్రం.

"నాదేనండి."

"బోసు అంటే ఎవరు?"

"నా క్లాస్‌మేట్. చిన్నప్పట్నించీ కలిసి చదువుకున్నాం. అతనికి ఉద్యోగం ఎక్కడా దొరకలేదు. కాలక్షేపానికి వచ్చి కూర్చుని పోతుంటాడు..."




"ఐసీ...ఇవాళ రాలేదా?"

"లేదండీ, నిన్న టౌనుకు వెళ్ళాడు ఏదో పనుందని. మధ్యాహ్నానికి రావచ్చు." అని చెప్పాడు పతంజలి.

అక్కడినుంచి స్టేషనుకు వచ్చాక, ఇద్దరు కానిస్టేబుల్సును బస్సుదగ్గరకు పంపించాడు బోసు రాగానే స్టేషనుకు తీసుకురమ్మని చెప్పాడు. బోసు పతంజలిగారి మనిషని హెడ్‌కానిస్టేబులు ధైర్యంచేసి చెప్పాడు. 'ఎవరెవరైనా మన పని మనం చెయ్యకపోతే ఎలా' అని బదులు చెప్పాడు చంద్రం.

మధ్యాహ్నం బస్సులో దిగాడు బోసు. కలప డిపోలో దించాక, అదే లారీలో టౌన్‌కు వెళ్ళాడు బోసు. అంచేత ఊళ్ళో ఆరోజు జరిగిన విషయాలేవీ అతనికి తెలియలేదు. బస్సు దిగగానే కానిస్టేబుల్సు అతన్ని స్టేషనుకు తీసుకొచ్చారు. ఇంతవరకూ అతను పోలీసుస్టేషను ఎలాఉందో చూసి ఎరగడు ఇవాళ ఆ అవసరం కలుగుతుందని అతను కలగనలేదుగూడా. తన్నులు తిన్నవాళ్లు నోరు మూసుకు పడిఉంటారనే అనుకున్నాడు.

బోసు లోపలికిరాగానే, చంద్రం లేచి ఎదురుగావెళ్ళి బోసు చెంపమీద చెళ్లున కొట్టాడు. బోసు కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి ముహం ఎర్రగా కందిపోయింది.

"ఏంటిది? నే నెవరనుకుంటున్నారు? నన్నెందుకు కొట్టారు?" అన్నాడు రోషంగా.

"ఏమిటిదా? మనచేతిదెబ్బ ఎలాంటిదో చిన్న శాంపిల్ చూపించాను. ఇం నువ్వెవరంటావా! నువ్వు అర్ధరాత్రిళ్ళు ఆడపిల్లలవెంటపడి ఏడిపించే అభినవ కీచకుడివని తెల్సింది. పోతే, నిన్ను కొట్టింది ఎందుకంటే, పొద్దున్న వాళ్ళను నువ్వు కొట్టింది ఇలాగేకమా—అని అడగటానికి..."

"మీరేం మాట్లాడుతున్నా రో నాకేం తెలియటంలేదు..

"అదే తెలుస్తుందిలే– నోరుమూసుకుని లాకప్‌లో పడుండు" అని తోశాడు చంద్రం.

"మేంగూడా చదువుకున్నాం. మాకూ రూల్సు తెల్సు. మర్యాదగా ప్రవర్తించండి" అన్నాడు బోసు, ముహంమీద పడుతున్నజుట్టు పైకి నెట్టుకుంటూ

"చదువుకుని, రూల్సు తెల్సుకునిగూడా ఇలాంటి పనులెందుకు చేస్తున్నావు మరి? వజ్రాన్ని వజ్రంతోనే కొయ్యాలని నాకు బాగా తెల్సు...."

"ఈ బోసు సంగతి మీకు తెలియదు. నిప్పుతో చెలగాటమాడుతున్నారు... అన్నాడు ఉద్రేకంగా.

"షటప్" అని కసురుకున్నాడు చంద్రం.

ఆ సాయంత్రం చంద్రం ఇంటికి వస్తుంటే పతంజలిగారి నౌకరు ఎమరుపతి జానకమ్మగారు పిలుస్తున్నారని చెప్పాడు. అటునుంచి అటే వాళ్ళింటికి వెళ్ళాడు చంద్రం జానకి సాదరంగా లోపలికి ఆహ్వానించింది.

"పతంజలిగారు లేరా?" అని అడిగాడు చంద్రం, కుర్చీలో కూర్చుంటూ

"లేరండీ. ఇప్పుడే ఎక్కడికో వెళ్ళారు..."

"దేనికో పిల్చారుట."

"వస్తానుండండీ" అంటూ లోపలికి వెళ్ళి కాఫీ, టిఫెను తెచ్చి ముందు పెట్టింది.

"ఇందుకేనా పిల్చింది" అన్నాడు చంద్రం నవ్వుతూ.

"పిల్చింది ఎందుకైనా, ఇంటికొచ్చిన వాళ్ళకి ఈ మాత్రం ఆతిధ్యమివ్వటం విశేషమేమీ కాదు...తీసుకోండి" అన్నదామె.

అతను కాఫీ త్రాగుతుండగా ఆమె అన్నది, "బోసును పట్టుకున్నారుట అతను అలాంటివాడుకాదు. ఆయన చెప్పమన్నారు..."

"ఆయనే ఎందుకు చెప్పలేదమ్మా?" అని అడిగాడు చంద్రం.

"ఏమోనండి. నాకు తెలీదు." అన్నది జానకి తలొంచుకుని.

"నీలవేణి చెప్పినదాన్నిబట్టి చూస్తే బోసు చాలా చెడ్డవాడనిపిస్తోంది" అని ఆమె ముహంలోకి చూశాడు చంద్రం.

"వాళ్ళిద్దరికీ చాలా కాలంనుంచీ పడదండీ" అన్నది జానకి నవ్వుతూ.

"ఎంచేత?"

"ఏదో ప్రేమగొడవ...వాళ్ళిద్దరూ ప్రేమించుకున్నారు."

"ఇద్దరూ ప్రేమించుకున్నారా?" అని అడిగాడు మొదటిమాట నొక్కి పలుకుతూ.

"అది ప్రేమించలేదండీ. ఇతనే ప్రేమించాడు."

"ఇతనుగూడా ప్రేమించలేదు. కేవలం వాంఛించాడు. తానేంచేసినా చెల్లుతుంది అనే ధైర్యంతో ఆమెను అల్లరిపెడుతున్నాడు. మొన్న సినిమానుంచి వస్తున్నరోజున వెంటబడి నానా గొడవచేశాడు."

"అలాగా. ఆదయినా నాకు చెప్పలేదే" అని ఆశ్చర్యపోయింది జానకి

"ఏమని చెప్పకుంటుంది? నలుగురికీ తెలిస్తే తనే చులకనయిపోతుందిగదా. ఆ మర్నాడే ఈ బోసును నొక్కేద్దామనుకున్నాను. కానీ నీలవేణే వద్దు అంది... ఇవాళ జరిగిన విషయం మరీ క్షమించరానిది. కేసుపెట్టాము. సాక్ష్యాలుగూడా దొరికాయి. ఇప్పుడు నేను చేయగలిగిందేమీలేదు — మీరు పెట్టింది తినటం, చెప్పింది వినటంతప్ప..." అని లేచాడు చంద్రం.

"ఆయనతో ఏంచెప్పమంటారు?" అని అడిగింది జానకి చంద్రాన్ని సాగ నంపుతూ.

"నాతో ఇలాంటి పనులు నెరవేరవని చెప్పండి." అని అక్కడినుంచి వచ్చేశాడు చంద్రం

## 7

దొంగతనంగా అడవినుంచి కలపతీసుకువచ్చినందుకు బోసుమీద కేసు నడిచింది. అతను అలా తీసుకురావటం కొత్తగాదు. చాలా సంవత్సరాలనుంచీ ఇది జరుగుతూనేఉంది. కానీ ఎప్పుడూ ఇలా కేసు రిజష్టరు కానూలేదు. అతను అందులో చిక్కుబడిపోనూలేదు. చంద్రం పట్టుబట్టి, తనమీద కక్షగట్టి ఈ కేసును నడుపుతున్నాడనని అతనికి అర్థమైంది. పతంజలిగారుగూడా బోసును ఇందులోనుంచి తప్పించడానికి చేయవల్సిన ప్రయత్నాలన్నీ చేశాడు గట్టి ప్లీడర్నిపెట్టి, బల్లగుద్ది వాదించే ఏర్పాటుచేశాడు. చూసినట్లు సాక్ష్యం చెప్ప కుండా ఉండేందుకు ఆ చెంచువాళ్ళతో బేరంపెట్టాడు వాళ్ళు మధ్యలో వెనక్కి తగ్గినా, చంద్రం వాళ్ళని నయానాభయానా లాక్కొచ్చి సాక్ష్యం చెప్పించాడు ఏమయితేనేం, పతంజలిగారి పరపతిగాని, జానకి చంద్రాన్ని కోరిన కోరికగాని బోసుకు ఎంతమాత్రం ఉపయోగపడలేదు.

బోసుకు మూడునెలలు జైలుశిక్ష పడింది.

వెళ్లేటప్పుడు ఊళ్లో సెంటర్లో నిలబడి, తాను తిరిగివచ్చిన తర్వాత చంద్రం అంతుచూస్తాననీ, ఈ ఊళ్ళో వాడో, తానో ఒక్కళ్లే ఉంటామని,అందరిముందూ ప్రతిజ్ఞచేసి వెళ్ళాడు బోసు. ఈ విషయం తెలిసి నవ్వేసి ఊరుకున్నాడు చంద్రం.

నీలవేణిమాత్రం ఇప్పుడు తేలిగ్గా గాలిపీల్చుకోగలుగుతోంది. ఇదివరకటిలా వాడు ఎప్పుడెక్కడ తనమీదపడి ఏంగొడవచేస్తాడోనని భయపడాల్సిన పని లేనందుకు సంతోషించినా, బోసు తిరిగి వచ్చాక ఏంరాద్ధాంతం జరుగుతుందో నని మరోపక్క దిగులుగానే ఉంది.

ఒకరోజు సాయంత్రం చంద్రం ఇంటికి తిరిగి వచ్చేటప్పటికి, గుమ్మం ముందు ఎవరో స్త్రీ కూర్చునిఉన్నది. ఇతన్ని చూడగానే గబగబాలేచి దగ్గరగా వచ్చి నమస్కారం చేసింది.

"ఎవరు నువ్వు?" అడిగాడు చంద్రం, ఆమెను వెంటనే పోల్చుకోలేక.

"నేను ఎవరయితే ఏంలెండి బాబు...బోసును జైలుకు పంపారంట. ఎన్నాళ్ళకా సల్లనికబురు ఇన్నాను. బాబూ, పాపిష్టోడు ఆణ్ణి మళ్ళీ ఊళ్లోకి రానీకండి బాబూ ... ఇదండి, ఈ రెండు అరటిపళ్లూ తీసుకోండి..." అన్నదామె.

"బోసును జైలుకు నేను పంపలేదు. తనే నేరంచేశాడు. శిక్ష అనుభ విస్తున్నాడు"

"నేరాలు చేసినోళ్లు అందరూ ఎక్కడ శిచ్చ అనుభవిస్తున్నారు, బాబూ? ఏనేరము సెయ్యని మాలాంటోళ్ళకే అన్ని శిచ్చలూ...ఇయ్యాల నా మనసు సల్లబడింది, బాబూ. ఈ పళ్ళు తీసుకోండి..." అని అతనిచేతిలో పెట్ట బోయింది.

ఆమె ఎంతో దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నట్లుగా ఆమె ముహమే చెబుతున్నది. అలాంటి స్థితిలో ఉండీ తనకోసం రెండు అరటిపళ్ళు కొనుక్కొని వచ్చిం దంటే, ఇవి తేవటానికి ఎంతకష్టపడి ఉంటుందో అతను తేలిగ్గానే ఊహించు కున్నాడు.

"చూడమ్మా, ఇందులో నేనేదన్నా చేశానూ అంటే, నా డ్యూటీ నేను చేశాను. అంతే, అందుకు నన్నెవరూ మెచ్చుకోనక్కర్లేదు. పండ్లూ ఫలాలూ ఎవరూ ఇవ్వనూగూడదు, నేను పుచ్చుకోనూగూడదు..." అన్నాడు చంద్రం.

"అయ్యో, ఇది లంచంకాదు బాబూ. మీరు దేవుడిలాంటోరు. దేవుడికాడికి ఎల్లేటప్పుడు ఉత్తసేతుంతో ఎల్లగూడదు. నేను ఇంతకన్నా ఏమీ ఇచ్చుకోలేను. ఉంచండి, బాబూ..." అంటూ ఆ రెండు అరటిపళ్ళూ అతని పాదాలదగ్గర పెట్టి, తిరిగి చూడకుండా గబగబా వెళ్ళిపోయింది.

చంద్రం లోపలికి వచ్చేటప్పటికి, వరండాలో నిలబడి ఇదంతా చూస్తున్న నీలవేణి కనిపించి నవ్వింది.

"ఎవరామె?" అని అడిగాడు చంద్రం

"రోజూ రాత్రిపూట బిక్షానికి వస్తుంటుంది, మాదాకవళం అనుకుంటూ— ఆమే" అని చెప్పింది నీలవేణి.

"అరె, ఆమెకీ, బోసుకీ ఏమిటి సంబంధం?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

"ఆ ప్రశ్న నన్నుకాదు అడగవల్సింది, ఆమె...సరేగాని, వెళ్ళి ఆ వేషం విప్పేయండిముందు. తర్వాత మాట్లాడుకుందాం" అన్నది నీలవేణి, చంద్రంతో పాటు హాల్లోకివచ్చి.

"ఏం, ఈ వేషంలో అంత భయంకరంగా ఉన్నానా?"అని అడిగాడు చంద్రం

"భయంకరంగా లేరండి, అందంగానే ఉంటారుగాని, ఆ డ్రెస్‌లో ఉన్నప్పుడు ఏంమాట్లాడాలన్నా నాకే కొంచెం భయంగా ఉంటుంది. మామూలు దుస్తుల్లో ఉంటే, మనం మామూలుగా మాట్లాడుకోవచ్చు," అన్నది నీలవేణి.

చంద్రం తన పడకగదిలోకి వెళ్ళాడు. అంతకుముందునుంచీ బాబుతో 'మీ నాన్న వచ్చాక షికారు వెళ్దామని' చెబుతూ వచ్చింది. తండ్రిరాగానే అశోక్ తండ్రిదగ్గరికి వెళ్ళి 'అచ్ పోదాం' అన్నాడు. చంద్రం లుంగీ చుట్టుకుంటూ 'ఆమెనుగూడా అడుగు' అన్నాడు.

బాబు పరుగెత్తుకుంటూ వచ్చి నీలవేణి భుజంమీద వాలిపోతూ "అమ్మా, అచ్ పోదాం" అని మారాముచెయ్యటం మొదలుపెట్టాడు.

నీలవేణిని జాన్ 'అమ్మగారూ' అని పిలవటం విన్న బాబు తను గూడా ఆమెను 'అమ్మ' అనే పిలవటం నేర్చుకున్నాడు. అశోక్ నోటివెంట ఆ మాట వినగానే మొదట్లో విస్తుపోయిన నీలవేణి, తీక్షగ్గా ఆలోచించుకున్నది. బహుశః చంద్రమే బాబుచేత అలా అనిపిస్తున్నాడని ఆమె ఊహించుకున్నది. బాబు ద్వారా తనను దగ్గరకు లాగాలని చూస్తే, అది అతని భ్రమేనని చంద్రానికి తెలియచెప్పాలని గూడా నిర్ణయించుకొంది. ఇప్పుడు చంద్రం ముందరే బాబు తనని 'అమ్మా' అని పిలిచాడు. తాను మారుమాట్లాడకుండా ఊరుకుంటే, ఈ

ప్రతిపాదనను తను మౌనంగా అంగీకరించినదే అవుతుంది గదా. అంచేత వెంటనే కోపంగా చంద్రంతో నీలవేణి చెప్పింది.

"వాడిచేత నన్ను 'అమ్మా' అని పిలిపించటంలో మీ ఉద్దేశ్యం ఏమిటో నాకు అర్థమవుతూనే ఉంది. కానీ నీలవేణిని మీరు సరిగా అర్థంచేసుకోనందు వలననే, ఇలాంటి ట్రిక్స్‌కు పూనుకున్నారు. ఇంతకన్నా మీ మనసులో నున్న మాట స్పష్టంగా బయటికి చెప్పి ఉంటే, మీ నిజాయితీని నేను మెచ్చుకునే దాన్ని..."

నిష్కారణంగా రెచ్చిపోయిన నీలవేణిపట్ల చంద్రానికి గూడా చిరాకు కలిగింది "నీ మీద ట్రిక్స్ వెయ్యాల్సిన అవసరం నాకు లేదు. నేను దిగిన మర్నాటినుంచీ నా కోసం వెతుక్కుంటూ వచ్చింది నువ్వు."

"మీ కోసం ఎవరూ రాలేదు. మర్యాదగా మాట్లాడండి."

"ఇన్నాళ్లకి ఇవాళ ఖర్మకాలి నీ దగ్గర నేను మర్యాదలు నేర్చుకోవలిసి వస్తోందన్నమాట."

"వాటికి నేను అమ్మనని ఎందుకు చెప్పారు?" అని మళ్లీ మొదటి కొచ్చింది నీలవేణి.

"ఎవరు చెప్పారు? తల్లిలేని పిల్లవాడని తెలిసీ, దగ్గరకు తీసింది నువ్వు. మానిపోతున్న గాయాన్ని రేపింది నువ్వు. కామేశ్వరి ఇక్కడ వదలి వెళ్లిన మర్నాటినుంచీ, వాణ్ణి ఒడిలోకి లాక్కుని పగలూ రాత్రీ చేరువ అవుతున్నది నువ్వు. ఇప్పుడు వాడు నిన్ను 'అమ్మా' అని పిలిచాడూ అంటే, అది నువ్వే వాడికి నూరిపోసి ఉంటావు..." అని తను అనుకుంటున్నది దాపరికం లేకుండా చెప్పాడు.

"ఎవరో కన్న పిల్లలకు తల్లిని కావాల్సిన ఖర్మ నాకేం పట్టింది? మీరు మంచివారని అనుకుని స్నేహం చేస్తే, చివరకు మీరూ అందరిలాగే చూశారు... చాలు..." అనేసి గబగబా అక్కడినుంచి వెళ్ళిపోయింది నీలవేణి.

'ఒట్టి క్రాక్‌లా ఉంది' అనుకున్నాడు చంద్రం విసుగ్గా.

"నాన్నా, ఆచ్" అని చెయి పట్టుకులాగాడు అశోక్. "పోరా, వెధవా" అని చాచిపెట్టికొట్టాడు చంద్రం. ఆ దెబ్బకు వెళ్ళి గోడవారన పడిపోయి, అలాగే ఏడ్చి, ఏడ్చి రెండు గంటల తర్వాత నిద్రపోయినాడు బాబు.

మర్నాడు నీలవేణి మంచినీళ్ల కోసం బిందె చంకనబెట్టుకొని రాలేదు.




ఆమెకు బదులుగా మురళి వచ్చాడు. చంద్రాన్ని నవ్వుతూ పలకరించాడు గాని, చంద్రమే ముభావంగా ఊరుకున్నాడు.

"ఇవాళ మా సిస్టర్‌కి తలనొప్పిగా ఉందిట. అంచేత నీళ్లు నేను పట్టుకెళ్తున్నాను. పరాయివాళ్లింట్లో పనిచేసుకుని బతకాల్సిన స్థితిలో ఉన్నప్పుడు, మనింట్లో పనులు మనం చేసుకుంటే తప్పేం ఉంది?" అని అడిగాడు మురళి.

చంద్రం మాట్లాడకుండా పేపరు చూస్తుంటే, "ఏం సార్, కోపంగా ఉన్నారు?" అన్నాడు నవ్వుతూ మళ్లీ తనే. "నాకు తలతిక్క ఎక్కువ. ఎప్పుడెలా ఉంటానో నాకే తెలియదు" అన్నాడు చంద్రం విసురుగా.

ఆ మాట పట్టుకెళ్ళి మురళి నీలవేణితో చెబితే, ఆమె కస్సుమంది. "తల తిక్క లేనిదెవడికి? తల లేనివాడి సంగతేమోగాని, తల ఉన్న ప్రతివాళ్లకీ ఉంటుంది తిక్క కొద్దోగొప్పో."

వీళ్ళిద్దరూ తనమీద పొద్దున్నే ఎందుకు విరుచుకుపడ్డారో అర్థంకాలేదు మురళికి.

తర్వాత మరో రెండురోజులుదాకా నీలవేణి చంద్రం ఇంటివైపు తిరిగి చూడలేదు. ఈమె రాలేదనిగాని, వచ్చిందనిగాని చంద్రం పట్టించుకోలేదు.

అశోక్ మారాం చేస్తున్నాడని తిండి తినటం లేదనీ, ఏడుపు మానటం లేదనీ జాన్ చెబితే, చంద్రం బాబును కోప్పడటం, కొట్టటం జరిగింది. పసివాళ్లను మచ్చిక చేసుకునే పద్ధతి ఆడవాళ్లకు తెల్సినట్లు, మగవాళ్లకు తెలియదు. ఈ విషయంలో వాళ్లకున్నంత ఓపిక, తీరిక వీళ్లకు ఉండవు.. అందులోనూ చంద్రానికి కొడుకుపట్ల మొదటినుంచీ నిరసనభావమే పేరుకుపోయి ఉంది. ఇప్పుడీ నీలవేణితో గూడా వీడి మూలంగానే మాటలు పెరగటంతో, అశోక్ సంగతి పట్టించుకోవటమే మానేశాడు.

పరిస్థితిని కొంతవరకు అర్థంచేసుకున్నాడు గనుక జాన్ ఒకటికి రెండు సార్లు వచ్చి నీలవేణితో చెప్పినా, ఆమె చలించలేదు.

ఈ కొద్దిరోజుల్లోనే నీలవేణి బాబుకు చాలా చేరువ అయింది. కామేశ్వరి తన పిల్లలతోపాటు, వీణ్ణి చూస్తూ ఉండేది. ఇక్కడికి వచ్చాక, నీలవేణి కౌగిట్లో చేరిపోయి, ఆ అత్తను మర్చిపొయ్యాడు. కొత్తగా దొరికిన ఈ అమ్మ తప్ప, వాడికింక వేరే లోకంతో పనిలేకపోయింది. ఉన్నట్లుండి ఎందుకో ఈ అమ్మ తన దగ్గరకు రాకపోవటం, నాన్న తనను ఆమె దగ్గరకు పోనివ్వక పోవటం, వాణ్ణి అమితంగా వేధించింది. ఆమెకు బదులుగా తన పనులు చేయ టానికి నియమించ బడ్డ జాన్ అంటే, వాడికి బొత్తిగా గిట్టకుండా ఉంది.

ఇవన్నీ కల్సొచ్చినందువల్లనే కాబోలు, అశోక్ కొద్దిగా వొళ్ళు వెచ్చ బడింది. మర్నాటికి మరి కొంచెం జ్వరతీవ్రత హెచ్చింది. డాక్టరుగారు రావటం మందులు ఇవ్వటం మొదలైంది. చంద్రం ఇంటినుంచి బయటకు వస్తూ, డాక్టరుగారు నీలవేణి ఇంటివైపు నడిచారు.

తలుపు తీసిన నీలవేణి డాక్టరు సత్యమూర్తిగారిని చూసి క్షణంసేపు ఆశ్చర్యపోయి, తర్వాత లోపలికి రమ్మని ఆహ్వానించింది.

"మరేం లేదు, చంద్రంగారింటినుంచి వెళ్తూ, మిమ్మల్ని చూసి చాలా రోజులైందని ఇలా వచ్చాను... కులాసానా?" అని అడిగాడు సత్యమూర్తి గారు.

"కులాసాగా లేకపోతే, మేమే మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తాంగదండీ" అన్నది నీలవేణి.

"మందుకోసమే తప్ప, నేను మరొకప్పుడు ఎప్పుడూ గుర్తుకురానన్న మాట... కొందరితో స్నేహం కలిస్తే, కొందరి అదృష్టమే మారిపోతుంది. స్నేహం మరికొంత ముందుకు సాగి, మనుష్యులూ మనసులూ సన్నిహితంగా

వచ్చాక, వాళ్లను మర్చిపోవటం అంత తేలికకాదు. శారీరకంగా దూరమైనా మానసికంగా వాళ్ళు మనతోనే ఉంటారు..."

"క్షమించండి. మీ సంగతి ఏమోకాని, నామటుకు నేను ఎవరికీ అంత సన్నిహితంగా రాలేదు. రాలేను." అన్నది నీలవేణి నిష్కర్షగా.

"నేను చెప్పదల్చుకున్నది మనిద్దరిగురించి కాదు. మీ ఇద్దరి గురించి. ముఖ్యంగా అశోక్ సంగతి. వాడు 'అమ్మా' అని కలవరిస్తున్నాడు. నిన్నటి నుంచి టెంపరేచర్ గూడా వస్తోంది. వాడు వచ్చినప్పటినుంచీ, మీరు ముద్దు చేశారు. ఆ ముద్దు మురిపాల గురించేగాని, మీకు తెల్సిన హద్దుల గురించి వాడు తెల్సుకోలేని వయసుగదా అది. పసివాళ్లకు మమతలు పెంచుకోవటమే తెలుస్తుందిగాని, మనలాగా మరు నిముషంలోనే మనస్తాపాలను తెచ్చిపెట్టుకుని పంతాలు పెంచుకుని తట్టుకుని నిలవగలిగిన మనోధైర్యం వాళ్ల కెక్కడిది?..."

"అసలు విషయం మీకు తెలియక అలా అంటున్నారు..." అన్నది నీలవేణి డాక్టరుగారి మాటలకు అడ్డువస్తూ.

"ఆ విషయాలు నేను తెల్సుకోవాలని గూడా అనుకోవటంలేదు. మీ ఇద్దరికీ సంబంధించిన విషయాల్లో, మూడో వ్యక్తిని జోక్యం చేసుకోవటం బావుండదు. ఏ కారణంచేతనైనా, బాబును మీరు దూరంగా ఉంచదల్చుకుంటే మీ ఇష్టంవచ్చినట్లు అలాగే చెయ్యండి. కానీ, ఇంత సడన్‌గా కాదు. నెమ్మది నెమ్మదిగా వాడి మనసు మళ్ళించండి. ఈ ఒక్కముక్క చెప్పిపోదామనే నేను వచ్చాను" అని లేచాడు డాక్టరుగారు.

సత్యమూర్తిగారు వెళ్ళిపొయ్యాక నీలవేణి కాసేపు ఆలోచించింది ఆయన చెప్పినదంతా నిజమే ననిపించింది. బాబుకు తానంత చనువు ఇవ్వబట్టే, వాడు తనలో అమ్మను చూసుకున్నాడని గూడా తెల్సుకుంది. తనకోసం బెంగపడి, జ్వరం తెచ్చుకున్నాడని తెల్సుకోగానే, ఆమెలోని స్త్రీ హృదయం అర్ధ్రమైంది. ఇంకొక్క నిముషం గూడ నిలవలేకపోయింది. చంద్రం ముందుకు వెళ్ళి నిలబడింది.

"బాబుకు ఎలా ఉంది?" అని అడిగింది.

"ఏంఫర్వాలేదు. అదే తగ్గిపోతుంది" అన్నాడు చంద్రం ముఖావంగా.

"వాడంత బాధలో ఉన్నాగూడా, మీ హృదయం కరగదా?" అని అడిగింది చంద్రం కళ్లల్లోకి సూటిగా చూస్తూ.

"పుట్టగానే తల్లినిపోగొట్టుకున్న దురదృష్టవంతుడు వాడు. ఇప్పుడు అమ్మ కావాలని ఏడిస్తే మాత్రం ఎక్కడ్నించి తీసుకురాను ? కనపడ్డ ప్రతి బొమ్మనీ చూసి అమ్మ అని వాడు భ్రమపడటం వాడి వెర్రితనం కన్నతల్లే వాణ్ణి కాల దన్ని తన దోవన తాను వెళ్ళిపోయింది. ఇంక ఎవరికి పట్టింది వాడి గోల ?" అని చెబుతున్నప్పుడు చంద్రం కళ్ళముందు తన భార్య కదిలింది కాబోలు నేత్రాలు కొద్దిగా చెమ్మగిల్లాయి. అంతలోనే తన బాధని దిగమింగుకున్నాడు.

నీలవేణి తిన్నగా బాబుదగ్గరకు వెళ్ళి పలకరించింది. దగ్గరకు లాక్కుంది. వాడు పోగొట్టుకున్న సామ్రాజ్యాలను తిరిగి పొందగలిగాడు ఆమె వెచ్చని ఒడిలో.

* * *

## 8

గిర్రున మూడునెలలూ తిరిగి పొయ్యాయి.

బోసు తిరిగి ఊళ్లో కాలు పెట్టాడు !

ఇప్పుడు అతను దెబ్బతిన్న పులిలా ఉన్నాడు. రోషంతోనూ, పౌరుషం తోనూ రెచ్చిపోతున్నాడు.

పతంజలిగారు అతని తోటివాడే పతంజలిగారు జానకితో ప్రణయం జరుపుతున్నప్పటినుంచీ, బోసు నీలవేణి మీదకు మన్మధబాణాలు వేస్తూనే వస్తున్నాడు. పతంజలిగారు ఇష్టంతోనో, అయిష్టంతోనో జానకిని వివాహం చేసుకోవాల్సి వచ్చింది. అప్పుడే ఆ వ్యవహారమంతా పాతబడిపోయింది గూడా. కానీ బోసూ, నీలవేణిల సంగతి ఎంతమాత్రమూ ముందుకు సాగలేదు. అతను విసిరిన వలలన్నిటి నుంచీ ఆమె ధైర్యంగా, నేర్పుగా తప్పించుకుంటూ వస్తోంది.

ఇది ఇలా ఉండగానే చంద్రం ఆ ఊరు వచ్చాడు. అతను వచ్చీ రాగానే నీలవేణి స్నేహం కలిపేసింది. ఆమె పట్టుబట్టినందువల్లనే చంద్రం తన కేసు విషయంలో జానకి కోరికను గూడా కాదని, తనని జైలుకు పంపించాడు అని బోసు తలచాడు. అంత మాత్రాన ఏమైంది ? జైలు అంటే భయం తీరి పోయింది. ఇప్పుడు మరింత ధైర్యం వచ్చింది. బోసుకు. నిండా మునిగిన వాడికి చలేమిటి ?

తనేమైనా ఫరవాలేదుగాని, నీలవేణి చంద్రానికి దక్కగూడదు. దాని తలబిరుసు ఏమిటో చూడాలి- అన్న పంతం ఎక్కువైంది బోసుకు.




"అక్కడికి ఈ ఊళ్లో ఉన్నవాళ్లంతా మగాళ్లు కాదన్నమాట. ఎక్కడి నుంచో వచ్చినవాడి వలలోపడి వాడి ఒళ్లోపడిపోవటానికి" అన్నాడు బోసు నిప్పుపుల్ల గీసి సిగరెట్టు ముట్టించుకుంటూ.

"అన్నమాటే మరి... మీరంతా మీసాలు తిప్పుకుంటూ రోడ్లమీద తిరగటం వరకే. అసలు కథానాయకుడు వాడే" అన్నాడు పతంజలిగారు నవ్వుతూ.

"నీవే గదా, వాణ్ణి నెత్తిన ఎక్కించుకుంటున్నావు" అన్నాడు బోసు.

"ఆ సీట్లో ఎవరున్నా మాలాంటి వాళ్లకా బాధలు తప్పవు. నీకేమిటి లెక్క."

"మరయితే నేను చూపించనా నా తడాఖా ?" అన్నాడు బోసు రింగులు రింగులుగా పొగవదులుతూ.

"ఇప్పటికే ఆలస్యమైంది. ఆలస్యం అమృతం విషం అన్నారు," అని నవ్వాడు పతంజలిగారు

"వోణీలు వేసుకోకముందునుంచీ నీలవేణి నాదని, నేను ఎప్పుడో రిజర్వు చేసుకున్నాను. దానికి తిరుగులేదు. చూస్తావుగా..." అని లేచాడు బోసు.

చంద్రం ఈ ఊరు వచ్చిన తర్వాత ఇంతవరకూ కుంచె పట్టుకోలేదు. పెయింటింగ్స్ జోలికి పోకుండా, మిగిలిన పనలన్నీ చురుగ్గా చేసుకుంటున్నాడు. పక్కపక్క ఊళ్లల్లో చిన్నచిన్న దొంగతనాలు దొమ్మీలు

జరిగాయి. వాటిని విచారించేందుకుగాను ఒకటికి రెండుసార్లు ఆ పల్లెలకు వెళ్ళిరావటం జరిగింది. ఎప్పుడు ఎక్కడకు వెళ్ళినా ఆర్టిస్ట్ కళ్ళు చిత్రంగా కనిపించే అందం కోసం వెతుకుతూనే ఉంటాయి. ఎంత వెతికినా దుమ్ము కొట్టుకుపోయిన ఇళ్లు, బజార్లు, పేదరికంతో చిక్కిపోయి, బిక్కుబిక్కుమంటున్న మనుష్యులూ తప్ప, అతన్ని ఆకర్షించిన కళాత్మకమైన దృశ్యమేదీ కనిపించలేదు. ఎలా కనిపిస్తుంది ? ఈ దేశం చుట్టూ ఎంత సముద్రం ఉందో, ఈ దేశంలో అంతటి దరిద్రం ఉంది. మరి, సముద్రాన్ని తోడిపోయ్యటమంటే మాటలా ?

ఎన్ని పనులు ఎంత చకచకా పూర్తిచేస్తున్నా, నెలకో బొమ్మ అయినా గీయకపోతే, తన విధినుంచి తాను దూరమైనట్లు, తన కర్తవ్యాన్ని తాను నెరవేర్చలేక పోతున్నట్లు అనిపిస్తుంది అందుకని కెమేరా తీసుకుని దగ్గర్లోనున్న అడివిలోకి వెళ్లాడు. రోజంతా తిరిగి తిరిగి అరడజను 'సీనరీ' లను అనేక కోణాల్లో ఫోటోలు తీశాడు. వాటిని దగ్గర పెట్టుకుని, ఇంకా ఎక్కడెక్కడ ఏమేమి చేరిస్తే ఆ దృశ్యాలకి పరిపూర్ణమైన అందాలు వస్తాయో ఊహించి, వాటిని గీయటానికి పూనుకున్నాడు. సరిగ్గా అతనీ పనిలో ఉండగానే, నీలవేణి బాబును తీసుకుని వచ్చింది.

"మళ్లీ ఏదైనా కొత్త బొమ్మ వేస్తున్నారా ?" అని అడిగింది అతనికి ఎదురుగా కూర్చుంటూ.

"మరే, దానికోసమే ఈ ప్రయత్నమంతా ?" అన్నాడు అతని చేతిలోని ఫోటోలు చూపిస్తూ.

"వీటిని కాపీ కొడతారా ఏమిటీ ?" అన్నది వెంటనే నవ్వేస్తూ.

"ఏం, అదంత తేలిక అనుకున్నావా ; కళ ఎప్పుడూ వాస్తవానికి ప్రతిబింబమేగా."

"అంతేనా, అయితే మీరింత శ్రమపడటం ఎందుకు ? ఆ ప్రతిబింబం ఈ ఫోటోలో కనిస్తుందిగా..."

"అదిగో, అక్కడే ఫోటోకీ, పెయింటింగ్‌కు తేడా ? ఫోటో ఉన్నదాన్ని ఉన్నట్లుగా చూపిస్తుంది. పెయింటింగ్ అందులో లేని అందాలను చూపిస్తుంది..."

"లేని అందాలను ఎలా చూపిస్తుంది ?"

"ఉదాహరణకి నీ ఫోటో ఒకటి తీసుకో. దానిలో నీ ముహం చూపే



అందాలకీ, నేర్పుగల కళాకారుడు వేసే నీ చిత్రానికీ ఎంతో తేడా ఉంటుంది. వస్తువు అదే కావచ్చు. కానీ ఇతను సృష్టించే తీరులో ఒక విలక్షణమైన రూప కల్పన జరుగుతుంది అంతేకాదు. అచ్చు నీ పోలికలతోనే ఉన్న ఆరేళ్ల పిల్లనీ, అరవై ఏళ్ల ముదుసలినీ గూడా ఆర్టిస్ట్ సృష్టించగలడు. కెమెరాకు వాస్తవానికి ఊహను జోడించే శక్తి లేదు..."

"ఇంత్సు చెప్పి ఊరించకపోతే, నా బొమ్మ ఒకటి గీయగూడదేమిటీ ?"

"గీయగూడదేమిటీ అని దీర్ఘాలు తీస్తే బొమ్మలు రావు ఆ బొమ్మ గీయా లంటే, ఈ బొమ్మ నాకెదురుగా కూర్చోవాలి..." అన్నాడామెవైపు వేలు చూపిస్తూ

కూర్చునే ఉన్నానుగా, గీయండి మరి "

ఇప్పుడు ఇప్పుడు మూడ్ లేదు "

మూడ్ అంటే ఏమిటిట ?

' మూడ్ అంటే ఏకాగ్రత కావాలి అంటే ఏకాంతం కావాలి

ఓయబ్బో చాలా ఉన్నాయే నిష్టలు

"మరే మనుకున్నావు? కాస్తంత పరధ్యానంగా ఉండి వంట చేస్తే, ఉప్పు ఎక్కువో, కారం ఎక్కువో వేస్తావు గదా. మరి అలాంటిది కళాఖండాన్ని తయారుచెయ్యాలంటే ఎంత లక్ష్యసాధన కావాలో ఊహించలేవా?"

"కబుర్లు చెప్పి కడుపు నింపటమేనా, నా బొమ్మ గీయటం ఏమన్నా ఉందా?" అని అడిగింది నీలవేణి.

"నీ బొమ్మ తప్పకుండా వేస్తాను. కానీ ఇప్పుడు కాదు. సమయం వచ్చి నప్పుడు నేనే పిల్చి కూర్చోబెట్టి గీస్తాను..."

"అంతే. ఆశపెట్టి ఊరిస్తూ ఉంటారు పోన్లెండి..." అనేసి లేచి నిలబడింది నీలవేణి.

ఆరోజు సాయంత్రం ఎంతసేపు ఎదురుచూసినా పాలవాడు రాలేదు. వాడికి వేరే ఎక్కడన్నా అమ్ముడుపోతే, అడపాదడపా వీళ్లకు ఎగగొట్టటానికి ప్రయత్నిస్తాడు. అలాంటప్పుడు నీలవేణి తనే వాడి పశువుల చావిడి దగ్గర వెళ్ళి వాడితో పోట్లాడి తెచ్చుకుంటూ ఉంటుంది. ఇవాళ గూడా ఆ ఉద్దేశ్యంతోనే నీలవేణి బయల్దేరింది.

ఆమె బయల్దేరేటప్పటికే మసకమసక చీకటి ముసురుకుంటోంది. ఆమె అక్కడికి వెళ్లాలంటే జెండా చెట్టు ముందునుంచే వెళ్లాలి ఆ అరుగుమీద గ్రంథసాంగులంతా చేరి అధిక ప్రసంగాలు చేస్తుంటారని ఆమెకు తెల్సు అందుకే అక్కడికి వెళ్లేటప్పటికి నడక వేగం హెచ్చించింది తానెంత వేగంగా నడుస్తున్నా, అక్కడివాళ్లందరి చూపులు తనని వెంటాడుతున్నాయని ఆమెకు తెల్సు. అక్కడున్న వాళ్లల్లో ఎవరో బోసుతో తన పేరు ఉదహరిస్తూ ఏదో చెప్పటంతో అతను గూడా అక్కడే ఉన్నాడని గ్రహించింది. దానితో ఆమె భయం మరింత ఎక్కువైంది.

గబగబా వెళ్లిన పని పూర్తిచేసుకుని తిరుగుముహం పట్టింది. నడిరోడ్డు మీద అంతమంది మనుష్యులు, చిన్నా పెద్దా అంతా తిరుగుతుండగా తనొక్కతే భయపడాల్సిన కారణం ఏమీలేదు నిజానికి. అక్కడున్న వాళ్లందరికీ భార్యలున్నారు, పిల్లలున్నారు. వాళ్లంతా నిర్భయంగా ఊరంతా తిరుగుతు నే ఉంటారు. కానీ ఈమె సంగతి వేరు. తను మిగిలినవాళ్లందరినుంచి ఎలా వేరయిపోయిందో గూడా నీలవేణికి తెల్సు. అందరిలా తనకు గౌరవ మర్యాదలు లేవు. వాటికోసం తనెంతగా ప్రాకులాడుతున్నా, నలుగురి దృష్టిలో మాత్రం తను విలాసిని. తనమీద ఈ ముద్ర ఎలా పడిందో ఆమెకు

తెలియదు. ఏమైతేనేం, తను చులకనై పోయింది పుట్టుకతోనే ఆ తర్వాత తనను మరింత బజారుపాలు చేశాడు ఈ బోసుగాడు...

జెండాచెట్టు దగ్గరకు రాగానే అందాకా గలగలా మాట్లాడుకుంటున్న వాళ్లందరి నోళ్లకూ పక్షవాతం వచ్చింది. అంతా నిశ్శబ్దంగా ఆమె వంకనే చూస్తూ కూర్చోవటం ఆమె భయాన్ని మరింత హెచ్చించింది. ఏదో తుఫాను రేగబోతోందని ఆమెకూ అర్థమైంది. తడబడే అడుగులతో వాళ్లను దాటి రాబోయింది. ఇంతలో వెనుకనుంచి రెండు హస్తాలు వచ్చి బలంగా ఆమె భుజాల్ని చుట్టేశాయి. ఆమె గింజుకుంది. అతను రెచ్చిపోయాడు.

బోసు చేతుల్లో నలికలపాములా మెలికలు తిరిగిపోయింది నీలవేణి అరిచింది. అందినచోటల్లా కొరికింది. తన్నింది. నానా భీభత్సం జరిగింది.

అయినా ఫర్వాలేదు. బోసు తన మాట నెగ్గించుకున్నాడు. నీలవేణిమీద తను ఒక హక్కు ఏర్పరచుకుంటున్నాడని అక్కడున్న నలుగురికీ ఋజువు చెయ్యదల్చుకున్నాడు. ఈ విషయం ఇన్నాళ్లూ నోటితో చెబుతూ వచ్చాడు. ఇంక చేతల్లో చూపిస్తేనేగాని, తన ప్రత్యేకత కనబడదు...అని తృప్తిపడ్డాడు బోసు

నిద్రలో నడిచి వచ్చినట్లు వచ్చి ఇంట్లో పడింది నీలవేణి. కాని ఆమె మనసు పనిచెయ్యటం మానేసింది చాలాసేపు. జరిగిన అవమానం ఆమెకు పెద్ద షాక్‌లా తగిలింది. ఎంతపని చేశాడు వీడు! దిమ్మతిరిగిన మనసు మళ్ళీ తేరుకున్నాక, ఎంతకీ ఆగని దుఃఖం తెరలుతెరలుగా పొంగి వచ్చింది.

అశ్రుధారలకు ఆనకట్ట కట్టుకున్న తర్వాత కాసేపటికి మురళి వచ్చాడు. రాగానే అక్క ముహం చూసి ఏదో జరిగిందని గ్రహించాడు.

"ఏంటక్కా అలా వున్నావు ?" అని అడిగాడు ఆత్రంగా.

"ఏంలేదు, ఏదో కంట్లో నలుసు పడింది," అని తప్పించుకో జూసింది నీలవేణి.

"ఒక కంట్లో నలుసు పడితే ఎంతోసేపు ఉండదులే అక్కా. తొందరగానే పోతుంది. అదే రెండు కళ్ళల్లో ఎవరైనా ఒకేసారి చూపునిలిపి నవ్వారనుకో, అప్పుడు కంట్లో నలుసు దగ్గర ఆరంభమైన కథ, కడుపులోని నలుసుదాకా వెళుతుంది..."అన్నాడు మురళి నవ్వుతూ.

నీలవేణి మారుమాట్లాడకుండా మురళికి అన్నం వడ్డించి, తినమని చెప్పింది.

మాటకు మాట బదులు చెప్పనిదే ఊరుకోని నీలవేణి, ఆవేళ మౌనంగా, గంభీరంగా ఎందుకుందో తెలియలేదు మురళికి. భోజనం పూర్తిచేసి పైప్రివేటుకు వెళ్ళిపొయ్యాడు మురళి.

ఆ రాత్రంతా అనేక రకమైన ఆలోచనలు, భయాలూ, పీడకలలూ ఆమెను వెంటాడాయి ఎంత ప్రయత్నించినా ఆ సాయంత్రం జరిగిన సంఘటనను ఆమె మర్చిపోలేకపోతున్నది. ఎంతో బలవంతంమీద కళ్లుమూసుకుని పడుకుంది.

అర్ధరాత్రి దాటాక ఎవరో తలుపు కొడితే మెలుకువ వచ్చింది చంద్రానికి. వెళ్ళి తలుపుతీయగానే గుమ్మంలో ఎదురైన నీలవేణిని చూసి ఆశ్చర్యపోయాడు.

"ఏమిటి, ఇప్పుడొచ్చావేమిటి ?" అని అడిగాడు

"రమ్మన్నారుగా" అన్నది నీలవేణి అతన్ని తోసుకుంటూ లోపలికి వస్తూ.

ఆ సమాధానం విన్న చంద్రంనోటివెంట మాట రాక నివ్వెరపోయినాడు ముందు. తర్వాత తడబడాడు. "ఏమిటి నేను...నేను...నిన్ను ఇలా అర్ధరాత్రి రమ్మన్నానా ?"

"నా బొమ్మ వేస్తానన్నారుగా...రమ్మని ఆశపెట్టి...పోన్లెండి..." అన్నది నీలవేణి కుర్చీలో చేరగిలబడి రెండుకాళ్లూ ఎత్తి ముందున్న టీపాయ్‌మీద పెట్టి విశ్రాంతి తీసుకుంటూ.

"నీ బొమ్మ వేస్తానన్నమాట నిజమేగాని, ఇప్పుడు నాకు నిద్ర ముంచు కొస్తోంది."

"నేను వచ్చి కూర్చుంటే, ఇంక మీకు నిద్ర ఎలా పడుతుందండీ బాబూ. అన్నట్లు బాబు నిద్రపోయాడా...ఇదే మంచి సమయం...మొదలెట్టరా మరి?" అని అంటున్న నీలవేణి చంద్రానికి చాలా కొత్తగా కనిపించింది.

ఆమె తను రోజూ చూసే మనిషేనా అన్న అనుమానంకూడా వచ్చింది. మాటా, పలుకూ, ప్రవర్తనా అంతా వింతగానే ఉంది.

పెయింటింగ్‌చేస్తూ రంగులలోకంలోకి వెళ్ళిపోయినప్పుడు వేరే ఏవిధమైన ఆటంకం రాకుండా ఉండడంకోసం ఇందుకు కావల్సిన సరుకు సరంజామా అంతా తన పడకగదిలోనే ఏర్పాటు చేసుకున్నాడు. నిద్రాదేవి వరించేదాకా కుంచెలతో కాలక్షేపం చేస్తూ, ఆ తర్వాత అలానే పక్కమీదికి వాలిపోవటం అలవాటు

ఆ గదిలోనే అతని మంచానికి దగ్గరలోనే మరో చిన్న మంచంమీద బాబు నిద్రపోతున్నాడు. చంద్రం నీలవేణిని ఆ పడకగదిలోకి తీసుకొచ్చి ఈజెల్‌కు కొద్దిదూరంలో కుర్చీవేసి కూర్చోబెట్టాడు. అంతా సిద్ధంచేసుకుని ఆమెవైపు తిరిగేటప్పటికి, ఆమె మూడు వంకర్లు తిరిగి కూర్చున్నది. ఆమె దగ్గరకు వెళ్ళి తనకు కావల్సిన భంగిమలోకి తిప్పుకుని తన వైపే చూస్తుండమని చెప్పి వచ్చి గీయటం మొదలు పెట్టేటప్పటికి, మరో రెండు నిముషాల్లో తల గోక్కుంటూనో చీర సర్దుకుంటూనో ఉండేది. చంద్రం మళ్ళీ ఆమె దగ్గరకు వచ్చి ఓపిగ్గా చెప్పి వెళ్ళేవాడు. చెప్పినప్పుడు సరేనన్నా, మరు నిమిషంలో మామూలే. చివరకు చంద్రం విసుక్కున్నాడు.

"నువ్వలా డాన్సు చేస్తే కుదరదు. కదలకుండా కూర్చోవాలి. మనదంతా సిస్టమాటిక్, తెల్సిందా ?"

"మనదంతా ఇష్టమాటిక్ తెల్సిందా ?" అన్నది నీలవేణి తేలిగ్గా నవ్వేస్తూ

"అయితే నీ బొమ్మవేయటం చాలా కష్టమాటిక్" అని కుంచెలు అక్కడే పడేసి ఇవతలికి వచ్చాడు చంద్రం.

"పోన్లెండి, మిగతావి నెమ్మదిగా వెయ్యవచ్చు, తొందరేంలేదు. ఒకేసారి గంటలకొద్ది శిలావిగ్రహంలా కూర్చోవాలంటే నా నడుములు పడిపోతున్నాయి" అంటూ నీలవేణి గూడా లేచివచ్చి అశోక్ నిద్రపోతున్న రెండో మంచంమీద కూర్చుంది.

"ఈ భాగ్యానికేనా నా నిద్ర చెడగొట్టావు ?" అని అడిగాడు చంద్రం.

"అస్తమానం ఏం నిద్రపోతారండి ? రోజుకు ఎనిమిది గంటలు అంటే జీవితంలో మూడోవంతు నిద్దరలోనే గడిపేస్తారన్నమాట..."

"బ్రతుకొక విషాద గీతంలా తయారైన నాలాంటివాళ్ళకు కాస్తంత ఊరట కలిగించేది, వేదనను మరిపించేది ఈ నిద్దరేగదా...అదీ కరువైతే ఎంత కష్టం ?" అన్నాడు చంద్రం. మంచంమీద ఇటువైపుకు వత్తిగిలి పడుకున్నాడు

"మీరే బ్రతుకొక విషాదగీతం అంటే నాలాంటివాళ్ళు ఏమనుకోవాలి ?" అని బారదేసి కళ్ళతో చూసింది

"నీకేం ? అందంగా మెరిసే ఆశామయ దుస్తులెన్నో ధరించావు. భవిష్యత్తుపై బోలెడు భరోసాను పెంచుకున్నావు. అదృష్టవంతురాలివి. రేపటి ఆనందాన్ని నేటి ఇబ్బందుల మీదనుంచి చూడగలవు. నా పరిస్థితి వేరుగదా. నా దృష్టి సూర్యోదయం మీదనుంచి, సూర్యాస్తమయం వైపు మళ్ళించవలసి వస్తోంది..."

"ఏం మీకేమంత వయసు మళ్ళిందని? ఏదో ఒక అపశృతి పలికినంత మాత్రాన కోయిల తిరిగి గొంతు సవరించగూడదా? కాలచక్రం తిరుగుతుంటే, గ్రీష్మం గడిచాక తిరిగి వసంతం రాదా, పోదా?" అని అడిగింది నీలవేణి.

చంద్రం కొంచెం టైం తీసుకుని నెమ్మదిగా అన్నాడు. "పేదరికంలోనో, పరిస్థితుల ప్రోద్బలంతోనో మరో స్త్రీ ఈ ఇంటికి ఇల్లాలిగా వస్తే రావచ్చు. కానీ మనసులోని తెరల మాటేమిటి?"

"ముందు మీ మనసులోనే ఉన్నాయి తెరలన్నీ. మీ మాట ఎలా ఉన్నా బాబుకోసమైనా మీరు ఈ విషయంలో ఒక నిర్ణయం వీలైనంత త్వరలో తీసుకోవాలి." అన్నది నీలవేణి భావగర్భితంగా చూస్తూ.

"బాబుకోసమే నేను మళ్ళీ పెళ్ళిచేసుకోగూడదని కూడా అనుకుంటున్నాను."

"మీ ఉద్దేశ్యం అర్థమైంది కాని సవతి తల్లి అయినంత మాత్రాన, ప్రేమగా చూడదనే ఎందుకు అనుకోవాలి."

"అది స్త్రీ సహజంగనుక. తెచ్చిపెట్టుకున్న అభిమానం ఎన్నాళ్ళు ఉంటుంది? కొన్నాళ్ళకు ఈ పై పై రంగుల ప్రేమాభిమానాలు వెలిసిపోతే, అప్పుడు మిగిలేది ఈర్ష్య. అసూయల మట్టి బొమ్మ. ఈ సంగతి మర్చిపోయి, ఆ రంగులు చూసి మురిసిపోవటం దూరాలోచన లేకపోవటమే అవుతుంది..." అని చెప్పాడు చంద్రం.

"కానీ ఎన్నాళ్ళిలా ఒంటరిగా ఉంటారు?"

అంతసూటిగా అడిగినందుకు కొంచెం విస్మయంగాచూసినా, వెంటనే అన్నాడు. "నా కిదొక శాపం. అన్నీ సలక్షణంగా ఉంటే నా జ్యోత్స్న నా పక్కనే ఉండిఉండేది. ఆమెతోటి నడిపిన జీవితం, అందుకు సాక్ష్యంగా మిగిలిన వీడు. నన్ను వెంటాడుతూ, వెన్నంటి వస్తూఉంటే, మరిచిపోవటం ఎలాసాధ్యం? ఇదిలా ఉండగానే మరోస్త్రీని నాజీవితంలోకి ఆహ్వానిస్తే ఏంజరుగుతుంది? పెనంమీదనుంచి గెంతి పోయిలోపడ్డట్లు అవుతుందేమోనని నాభయం..."

నీలవేణి మరేమీ మాట్లాడలేదు. కాసేపు బాబువంకచూస్తూ, ముందుకువంగి, నిశ్చింతగా నిద్రపోతున్న వాడి నుదుటిమీద చిన్నగా ముద్దుపెట్టుకుంది కొన్ని నిముషాలు అటేచూస్తూ ఏదో ఆలోచనలో పడిపోయి, తర్వాత ఏదో గుర్తొచ్చినట్లు లేచి పైటకొంగు నిండుగా కప్పుకుని, వస్తానని చెప్పి వెళ్ళిపోయింది.

తలుపు వేసివచ్చిన చంద్రం, నీలవేణిగురించే చాలాసేపు ఆలోచించాడు. ఈమె అంతర్యం ఏమిటి? అసలు ఇంత రాత్రివేళ వచ్చి నిద్రలేపింది కేవలం




బొమ్మకోసమేనా? లేక మరో కొత్త అధ్యాయాన్ని ప్రారంభించబోతుందా? ఆమె మాటల్ని బట్టిచూస్తే, దేనికి గురిచూస్తున్నదో తెలుస్తూనే ఉంది. కానీ తనకై తాను ఏదైనా చొరవ తీసుకుంటె బిగుసుకుపోతుంది. ఈ తత్వం ఏమిటో అర్థకావటం లేదు—అనుకున్నాడు చంద్రం.

మర్నాడు బద్ధకపు దుప్పటిచుంచి బయటపడి, స్నానపానాదులు పూర్తి చేసుకుని బయల్దేరబోతుండగా చంకన బిందెపెట్టుకుని ఎదురుగానే వచ్చింది నీలవేణి.

"రాత్రి నిద్దర చాలిందా?" అని అడిగాడు చంద్రం ఆమె దగ్గరగా వచ్చాక ఆమాట వినగానే, నవ్వుతూఉన్న ఆమె ముహం వివర్ణమైపోయింది. అతను అడిగినదేమిటో బొత్తిగా అర్థంకానట్లే చూసింది. కానీ చంద్రం అదేమీ గమనించకుండానే మళ్ళీ అడిగాడు.

"రాత్రికి వస్తావా? నీ పని పూర్తిచేస్తాను."

నీలవేణి కళ్ళల్లో కన్నీటి సుడిగుండాలు వెలిసాయి అంతలోనే, "ఎంత కూటికి లేనిదాన్నయినా, ఆ స్థితికి రాలేను. అంతకన్నా గుక్కెడు విషంమింగి, కళ్ళుమూసుకోవటం నయం." అనేసి గిర్రున వెనుదిరిగి వెళ్ళిపోయింది.

చంద్రం నిశ్చేష్టుడయ్యాడు. ఏమిటీ మనిషి! తనకై తానే వచ్చింది రాత్రి. చిత్రంగీయమని ప్రేరేపించింది. సరేనని మొదలుపెట్టాడు. అంతలోనే తొందరేం లేదు, తర్వాత వేయమంది. అది పూర్తిచేయటంకోసం, మళ్ళీ రాత్రికి

వస్తావా అని అడగటంలోగల అపరాధమేమిటో చంద్రానికి ఎంతకీ బోధపడ లేదు. పోనీ తను ఇలా అనగా ఎవరైనా విన్నందువల్ల, ఆమె అలా కోపం నటించిందా అంటే, అదీ లేదు ఆమెకు మాత్రమే వినిపించేంత రహస్యంగా అన్నాడు. అయినా ఆమెకు రోషం వచ్చింది. ఇంత విచిత్రమైన మనిషి మరెక్కడా ఉండదు.

నీలవేణి చంద్రంఇంటికి రావటం మళ్ళీ మానేసింది. ఈసారి బాబును తన ఇంటికి పిలిపించుకుని, వాణ్ణి చాలాసేపు అక్కడే ఉంచుకుంటోంది. వాడితో మామూలుగా ఉంటోందేగాని, చంద్రాన్నిమాత్రం కన్నెత్తిచూడటానికిగూడా ఇష్టపడటంలేదు. ఒకటి రెండుసార్లు దూరంనుంచే ఇతన్ని చూసి, వెంటనే ముహం తిప్పేసుకుంది. ఇతనూ అంతగా పట్టించుకోలేదు.

మూడురోజులతర్వాత మళ్ళీ ఒకరోజు రాత్రి నీలవేణి వచ్చి తలుపుతట్టింది. ఎదురుగా కూర్చుని అనేక విషయాలు మాట్లాడింది.

"నీ మనసు నొప్పిస్తే క్షంతవ్యుణ్ణి" అన్నాడు చంద్రం.

"నా మనసు నొప్పించటమా, లేదే?" అన్నది ఆశ్చర్యంగా.

"మొన్న అన్నమాటలకు నీకు కోపం వచ్చింది."

"మీరేమన్నా నాకు కోపం రాదు. ఎంచేతంటే, మీరెప్పుడూ నా శ్రేయోభిలాషులేగదా. ఆత్మీయులు తిట్టినా, కొట్టినా మన మంచికోసమే..."

ఈ నీలవేణి ఆడుతున్న నాటకానికి చంద్రం నివ్వెరపోతున్నాడు. ఎప్పుడు ఎందుకు ఎలా ప్రవర్తిస్తుందో, ఆమెకే తెలిసినట్లులేదు.

ఆమె చిత్రాన్ని పూర్తిచేద్దాం రమ్మన్నాడు. ఆ చిత్రం మొదలుపెట్టిన విషయమే తనకు తెలియనట్లు విస్తుపోయింది.

"అరె, ఇది అచ్చం నా బొమ్మలాగే అంది. ఎప్పుడు మొదలెట్టారు? నాకు చెప్పకుండా వేసి ఆశ్చర్యపరుద్దామనా?" అని అడిగింది.

"నేనిది ఎప్పుడు మొదలుపెట్టానో, నిజంగా నీకు తెలియదా నీలవేణీ?" అని అడిగాడు చంద్రం ఎంతో సౌమ్యంగానే.

"ఊహుఁ, నాకేంతెల్సు?..." అన్నది ఇంతలేసి కళ్ళతో బులిపిస్తూ.

చంద్రం ఆమె వచ్చినప్పటినుంచి ప్రతిచర్యనూ గమనిస్తూ, ఆలోచిస్తూ ఉన్నాడు. ఇదంతా కేవలం నటన అనుకోవటానికి వీల్లేదు. ఆ అవసరమూలేదు. రాత్రిళ్ళు తనదగ్గరకు వచ్చి, ఇన్ని కబుర్లుచెప్పి వెళ్ళటం–పగటిపూట ఆమెకేమీ తెలియదన్నమాట. ఇలా నిద్దరలో నడిచివచ్చి అనేక పనులుచేసి వెళ్లే

జబ్బు కొంతమందికి ఉంటుంది. కానీ ఈ అందమైన నీలవేణికి, అలాంటి భయంకరమైన వ్యాధి ఉన్నదా? అసలే దురదృష్టవంతురా లనుకున్న ఆమెకు ఇలా అర్ధరాత్రిళ్ళు తిరిగి తిరిగి వచ్చే జబ్బు ఉన్నదని తెలిస్తే, ఆమె బ్రతుకు ఏమవుతుంది?

ఆమె తన భవిష్యత్తుమీద ఎన్ని ఆశలు పెట్టుకుంది! ఎన్ని నిరాశలను తట్టుకుంది! కానీ ఈ చిత్రమైన వ్యాధి ఆమెను నిశ్చింతగా బ్రతకనిస్తుందా? ముందు ముందు మరెన్ని దారుణాలకు ఇది దారితీస్తుందో?—అని ఆలోచిస్తూ ఆమెవంకచూస్తుంటే, నీలవేణి అశోక్‌తో ముద్దాడుతోంది.

*　　　　*　　　　*

# 9

పగటిపూట నీలవేణి చంద్రానికి ప్రబల శత్రువులా ప్రవర్తిస్తున్నా, రాత్రిపూట తరచూ వచ్చి అతని నిద్ర చెడగొడుతూనే ఉంది. ఈమెకు ఉన్న ఈ జబ్బుగురించి డాక్టరుగారితో సంప్రదించి, తగిన మందులు వాడదామా అనుకున్నాడు. 'సోమ్నాంబలిస్ట్' గురించి చెప్పమని సత్యమూర్తిగారిని ఒకసారి అడిగితే, నరాల బలహీనత అందుకు కారణం అని చెప్పాడు. మరికొన్ని వివరాలు చెప్పమంటే, సైకియాట్రీ తెల్సినవాణ్ణి సంప్రదించాలనీ, ఉన్న పళంగా తను ఆ జబ్బుగురించి ఎక్కువగా చెప్పలేననీ అన్నాడు.

"ఇంతకీ దేనికీ వివరాలు?" అనిగూడా అడిగాడు సత్యమూర్తిగారు.

"ఏంలేదు, ఊరికనే" అని నవ్వేసి, ఆ ప్రసంగం మార్చేశాడు చంద్రం.

గట్టిగా పూనుకుని, నీలవేణికి వైద్యం చేయిద్దామన్నా, వాళ్ళకి విషయమే తెలిసినట్లులేదు. తనని చూస్తేనే, ఈసడించుకుంటున్న నీలవేణితో ఈ విషయం ఎలా చెప్పటం? ఇచ్చవచ్చినప్పుడు నిద్రలో లేచివచ్చి, గంటలకొద్దీ కూర్చుని బాతాఖానీ కొట్టివెళ్లే నీలవేణితో ఏంచెప్పినా ప్రయోజనం ఏముంది?

నీలవేణి ఇలా పొద్దుపోయినాక చంద్రం పడకగదిలో ఉంటున్నట్లుగా ఒకటి రెండుసార్లు, ఒకరిద్దరు పసిగటారు. దానితో మెల్లిగా పొగరాజుకుంది. నలుగురూ చెవులు కొరుక్కోవటం జరిగింది. ఇది బోసునాకా వెళ్ళిందిగూడా

పతంజలిగారు, బోసూ కలిసి, చంద్రంమీద ఒక పెద్ద పిటీషన్ తయారుచేసి పంపించారు. అందులో చంద్రం లంచగొండి అనీ, అమాయక ప్రజలమీద గూడా ఏదో కేసులు బనాయించి, వాళ్ళను బెదిరించి లంచాలు గుంజుతున్నాడనీ,

అంతేగాగ అతను స్త్రీలోలుడనీ, అతని ఇంటికి ఎదురువాటాలో ఉన్న ఒక స్త్రీతో ప్రస్తుతం సంబంధం పెట్టుకుని ఉన్నాడని ఆ అర్జీలో ఉదహరించారు.

ఇదిలా ఉండగానే, ఒకరోజు అకస్మికంగా జరిగిన ఒక సంఘటనతో నీలవేణి చంద్రంల విషయం వీధికెక్కింది.

ప్రైవేటు మాష్టారు ఇంట్లో పడుకున్న మురళికి ఒక రాత్రప్పుడు విపరీతమైన కడుపునొప్పివచ్చింది. పక్కన పడుకున్న కుర్రాతుళ్లలేచి మురళిని హాస్పటల్‌కు తీసుకువెళ్ళారు. మాష్టరుగారు స్వయంగా డాక్టరుగారింటికి వెళ్ళి, అయన్ని నిద్రలేపి తీసుకువచ్చారు.

మురళికి 'ఎపెండిసైటిస్' అనీ, వెంటనే ఆపరేషను చెయ్యాలనీ చెప్పి, డాక్టరు సత్యమూర్తిగారు ఆపరేషను థియేటర్‌లోకి వెళ్ళిపొయ్యాడు

మాష్టరుగారు నీలవేణి కీవిషయం చెప్పి, తీసుకురమ్మని ఇద్దరు కుర్రవాళ్ళను వాళ్ళింటికి పంపాడు. వాళ్లు వచ్చి చూస్తే, నీలవేణి ఇంటితలుపు దగ్గరకువేసి ఉంది కానీ ఆమె లోపల లేదు, వాళ్లు కుతూహలం పట్టలేక, ఆ ఇంటిముందే చాలాసేపు ఎదురుచూస్తూ ఉండిపొయ్యారు రెండుగంటల తర్వాత చంద్రం ఇంటితలుపులు తెరుచుకోవటం, నీలవేణిని చంద్రం సాగనంపటం, ఆమె తన ఇంట్లోకెళ్ళి తలుపువేసుకోవటం, చంద్రం పడకగదిలో లైటుఆరిపోవటం—అంతా గమనించిన ఆ ఇద్దరు విద్యార్థులకీ, నీలవేణిమీద కోపం, అసహ్యంగూడా కలిగాయి. మురళి ఆపరేషనుసంగతి, ఆమెకి అప్పుడు చెప్పకుండానే వెళ్ళిపోయి, తాము చూసివచ్చినదంతా మాష్టారుకు చెప్పారు. ఆయనమాత్రం ఏమనగలడు? ఎవరిపిల్లలే వాళ్ళమాటలు వినని ఈరోజుల్లో, పరాయి పిల్లలకు ఎవరేం చెప్పగలరు? తెల్లారాక సత్యమూర్తిగారు కబురుచేస్తే నీలవేణి హాస్పటల్‌కు వచ్చింది ఆదుర్దాగా- మరేం ఫర్వాలేదని చెప్పాడాయన.

స్కూల్లో మురళికి ఆపరేషను జరిగిన సంగతితో పాటు, నీలవేణి, చంద్రంల రహస్య ప్రణయంగురించి గూడా, కుర్రాళ్ళంతా పదేపదే చెప్పుకున్నారు.

మురళిని చూడటానికి చంద్రం హాస్పటల్‌కు వచ్చినప్పుడు అక్కడున్న కుర్రాళ్ళల్లో ఒకడు 'వొరేయ్, మీ బావగారొస్తున్నారు' అన్నాడు. ఆమాట మురళికి ములుకుల్లా తగిలినా అప్పుడేమీ చెయ్యలేక ఊరుకున్నాడు. తొందరగానే నయమవుతుందని మురళికి ధైర్యంచెప్పి, సత్యమూర్తిగారితో మురళిని శ్రద్ధగా చూడమని ఒకమాటచెప్పి వెళ్ళాడు చంద్రం.

ఈ వార్త తెలిసాక జానకిగూడా వచ్చి చూసివెళ్ళింది. వెళ్తూ, వెళ్తూ ఆమె గూడా సత్యమూర్తిగారి దగ్గరకువచ్చి, మురళిని కాస్త జాగత్తగా చూడమని, ఫీజు ఎంతయినా ముహమాటంలేకుండా అడగమని, తాను పంపిస్తాననీ చెప్పింది. సత్యమూర్తిగారు నవ్వాడు.

"మీరెంతయినా ఇవ్వగలరని నాకు తెల్సు. కానీ ఇది గవర్నమెంటు హాస్పటలు. మీరివ్వగూడదు, మేం తీసుకోగూడదు."

"నిజమే ననుకోండి. కొంచెం తొందరగా నయంచేయండి. వాడికి పరీక్షలు దగ్గరపడుతున్నాయని గోలచేస్తున్నాడు."

''నేను చేయగలిగినదంతా నేను చేస్తూనే ఉన్నాను. కానీ, దేవుణ్ణికాదుగదా వాళ్ళ బాధని చేత్తో తీసేయటానికి. చంద్రంగారితోగూడా ఈమాటే చెప్పాను..."

"ఆయనా వచ్చారా," అని అడిగింది జానకి.

"కావల్సిన వాళ్ళకు, రాగూడని ఆపదవస్తే, వచ్చి చూసివెళ్ళకుండా ఎలా ఉంటారు?" అన్నాడు సత్యమూర్తిగారు మొదటిమాటను నొక్కిపలుకుతూ జానకి డాక్టరుగారివంక అర్థంకానట్లు చూస్తే, ఆయన నవ్వుతూ అన్నాడు వాళ్ళిద్దర్నీ పెళ్ళి తొందరగా చేసుకోమనండి. ఎందుకంటే, వాళ్ల ఇంక ఏడంగా ఉండటం అంత మంచిదికాదు."

"అంటే..."

"అంటే ఏమిటోరొకు తెలియకనా? నాకన్నా? మీకే ఎక్కువ విషయాలు తెల్సిఉంటాయి," అన్నాడు సత్యమూర్తిగారు.

ఇంతలో నర్సువచ్చి ఆ ప్రసంగానికి అడ్డుపడింది. జానకి ఆలోచించుకుంటూ ఇల్లుచేరింది.

మురళికి నాలుగురోజుల్లో కొంచెం ఓపిక వచ్చింది. కుట్లు విప్పతీశారు నెమ్మదిగా లేచి నడుస్తున్నాడు. ఇంక ఇంటికి తీసుకెళ్ళవచ్చునని చెప్పారు

నీలవేణి తమ్ముడికి భోజనం తీసుకుని వచ్చింది. ఆమెతోపాటే అశోక్ గూడా ఆస్పత్రికి వచ్చాడు.

ఆవేళంతా మబ్బు మబ్బుగా ఉండి, జల్లులు జల్లులుగా వర్షం పడుతూనే ఉంది. ఆ చినుకుల్లో తడుస్తూనే నీలవేణి, అశోక్ ను తీసుకుని సత్యమూర్తిగారి గదిలోకి వచ్చింది. ఆమె వచ్చేటప్పటికి ఆయన తన పని అంతా పూర్తిచేసు

కుని, వెళ్ళటానికి సిద్ధంగా ఉన్నాడు. వర్షం లాఉందోనని కిటికీదగ్గర నిలబడి బయటకు చూస్తుండగా నీలవేణి లోపలికివచ్చింది.

"రండి..." అన్నాడు సత్యమూర్తిగారు ఆదరంగా.

"మా తమ్ముణ్ణి ఇంటికి తీసుకు వెళ్ళమన్నారట."

"హి ఈజ్ ఆల్ రైట్. ఇంటికి తీసుకెళ్ళండి. మందులు రాసిచ్చాను. సిస్టర్‌ను అడిగి తీసుకోండి. అటువైపు వచ్చినపుడు, నేను ఇంటికివచ్చి చూస్తాను" అన్నాడు సత్యమూర్తిగారు.

"థాంక్స్. మీకు చాలా శ్రమ ఇచ్చాము" అన్నది నీలవేణి.

"శ్రమేముంది? మేం ఉన్న దే అందుకుగదా" అన్నాడు సత్యమూర్తిగారు

బయట వర్షం పెద్దదయింది. అశోక్ గుమ్మంలోకి వెళ్ళి చూరునుంచి కారుతున్న నీళ్ళతో ఆడుకుంటుంటే, వాణ్ణి దగ్గరకి పిల్చింది. వాడు దగ్గరకువచ్చి నీలవేణిని అడిగాడు

"అమ్మా, ఆ నీళ్లు ఎక్కడివి?"

"వర్షానివి," అని చెప్పిందామె.

"వర్షం ఎక్కడుంది?" అని అడిగాడు మళ్ళీ

"మబ్బుల్లోంచి వర్షం కురుస్తుంది "

"మబ్బులు ఎక్కడివి?"

"మబ్బులు ఆకాశంలో ఉంటయి."

"ఆకాశం ఎక్కడిది?"

"నీ నెత్తి, నోరు మూసుకో" అని కసురుకుంది నీలవేణి. దానితో వాడి వాగ్ప్రవాహానికి అడ్డుకట్ట పడింది.

సత్యమూర్తిగారు నవ్వుతూ అడిగాడు. "మీకూ బాగా దగ్గరయ్యాడను కుంటాను."

"పిల్లలుగదా. చేరదీస్తే, అలవాటవుతారు." అన్నది వాడిజుత్తులో వేళ్ళు దూర్చి.

"ఎవరైనా అంతే" అన్నాడు సత్యమూర్తిగారు. నీలవేణి పదునైన తూపుల్లాంటి చూపుల్ని వదిలింది.

"మీ అభిప్రాయం?" అని అడిగింది.

"చంద్రంగారు మళ్ళీ పెళ్ళిచేసుకుంటారని అనుకుంటున్నారు."

"అది ఆయనకు సంబంధించిన విషయం. నాకెలా తెలుస్తుంది!"

మీరు ఆయనకు చాలా దగ్గరగదా?"

చెప్పదల్చుకున్నదేమిటో స్పష్టంగా చెప్పండి."

అంతే, నా ఉద్దేశ్యం, వారూ మీరూ దగ్గరదగ్గరగా ఉన్నారుగదా అని . ."

దగ్గరగా ఉన్నమాట నిజమేగాని, కొన్ని రోజులనుంచీ ఆయనకూ, నాకూ మాటలే లేవు"

ఎంచేత ?" అని అడిగాడు సత్యమూర్తి కుతూహలంగా.

ఏదో చిన్న బేదాభిప్రాయం వచ్చింది. అంతే. ఇంక ఆయనతో స్నేహం మానేశాను."

..బాబు మిమ్మల్ని 'అమ్మా' అంటున్నాడు..."

దానికేముంది ? మీరుగూడా నన్ను 'అమ్మా' అని పిలువవచ్చు 'అమ్మా' అని పిల్లలు తల్లిని పిలిచినప్పుడేగాదు, ఆప్యాయతను కనబరుచుకున్నప్పుడు, ఒక స్త్రీని ఎవరైనా అమ్మా అని పిలిచి మన్నించవచ్చు. అంత మాత్రాన వీళ్ళంతా వాడి తండ్రికి భార్యలనికాదు అర్థం..."

నీలవేణికి కోపం వచ్చిందని సత్యమూర్తిగారు అర్థంచేసుకున్నాడు ఇంక ఆ విషయం పొడిగించదల్చుకోలేదు.

జల్లు తగ్గేదాకా మౌనంగానే ఉండిపొయ్యాడు. తగ్గిన తర్వాత నీలవేణి సత్యమూర్తిగారి దగ్గర శలవుతీసుకుని వెళ్ళిపోయింది.

* * *

## 10

మురళిని ఇంటికి తీసుకొచ్చింది. ఇంకో వారంరోజులు రెస్ట్ తీసుకోవాలని చెప్పాడు డాక్టరు. అందుకని ఇంట్లోనే ఉండి చదువుకుంటున్నాడు స్కూలుకు పోవటంలేదు. షైర్రివేటుకు వెళ్ళటంలేదు. మధ్య మధ్య అశోక్ వచ్చినప్పుడు వాడితో కాలక్షేపం చేస్తున్నాడు. చంద్రంగారితో తన అక్క మాట్లాడటం మానేసిందని తెల్సుకున్నాడుగాని, అందుకు కారణం ఏమిటో తెలియలేదు ఒకసారి అడిగినా కసురుకుంది. అంచేత ఇక ఆ ప్రసంగం తీసుకు రాలేదు మురళి

రాత్రి పన్నెండు గంటలవేళ, దాహంవేసి మెలుకువ వచ్చిన మురళి లేచి కూర్చున్నాడు. గదిలో ఎక్కడా అక్క కనిపించలేదు. బయటికివచ్చి చూస్తే ఎదురింట్లో పడకగదిలో లైటు వెలుగుతోంది.

మురళికి కోపం వచ్చింది. ఇన్నాళ్ళు అక్క తనకెన్నో నీతులు చెబుతూ వచ్చింది. తనదాకా వచ్చేటప్పటికి అవేవీ గుర్తులేవన్నమాట. ఎన్ని ఆశలు కల్పించింది! ఎన్ని విషయాలు బోధించింది!

"అమ్మలా తాము కష్టపడకూడదు. ఈ మగవాళ్ళ మాటలు నమ్మగూడదు... తను చదువుకుని ఉద్యోగం సంపాదించుకుని, దూరంగా ఎటో వెళ్ళిపోవాలి. అక్కడ ఈ గతం తాలూకు నీడలేవీ మచ్చల్లా తమ బ్రతుకులమీద పారాడనిచోట. ఆమెని మెచ్చినవాణ్ణి, ఆమెకి నచ్చినవాణ్ణి చూసి వివాహమాడి నిశ్చింతగా స్థిరపడాలని ఎన్నిసార్లు అనుకోలేదు. ఇప్పుడా ఆలోచనలన్నిటినీ తానే తల క్రిందులు చేసింది. ఈ చంద్రంగారు విసిరిన వలలో చిక్కుకుపోయింది. భవిష్యత్తు మాటే మర్చిపోయింది..."

నీలవేణి వచ్చే సమయానికి మురళి ఏమీ తెలియనట్లే పడుకున్నాడు. ఈ విషయం అక్కను అడిగి తెలుసుకోవాలనుకున్నాడు. నెమ్మదిగా గుండె కుదుటపర్చుకుని మొదలుపెట్టాడు.

"అక్కా! ఇన్నాళ్ళూ మనకు ఎవరూ లేరనుకుంటూ వచ్చాను. ఇప్పుడు నాకు ఎవరూ లేరనుకుంటున్నాను."

నీలవేణి క్షణకాలం ఆశ్చర్యంగా చూసి అడిగింది "ఏం, ఏమైంది?"

"ఏమీ కాలేదు. ఎందుకో అలా అనిపిస్తోంది."

"అనిపిస్తుందిరా నీకు, అలానే అనిపిస్తుంది. ఇన్నాళ్ళూ ఆస్పత్రిలో పడి వుంటే, నీ చుట్టూ తిరిగి చేసిందంతా మర్చిపోయ్యావా?''

"లోకంకోసం కొన్ని పనులు చేస్తారు కొంతమంది. వాటినిచూసిఅదే నిజమని మోసపోగూడదు."

"ఏమిటీ నీ తలతిక్కవాగుడు?"

"ఒక్కోసారి ఉన్నది ఉన్నట్లు చెప్పకూడదు. అదీ తప్పే."

"ఈ డొంకతిరుగుడు మానేసి, అసలు విషయమేమిటో సూటిగా ఏడువు."

"మన ఏడుపుకీ, మన సంతోషానికీ కారణం మనం చేసిన పనులే. ఆ విషయం మర్చిపోకూడదు."

"నీ ఉపన్యాసాలు వినే తీరికలేదు నాకు. చెప్పదల్చుకున్నదేమిటో స్పష్టంగా చెప్పు

"ఆ చంద్రంగారితో మనం సంబంధం తెంచుకోవటం మంచిదక్కా

"నేను ఆ విషయం ఎప్పుడో తెల్సుకున్నాను నే నా గడప తొక్కటమూ




లేదు. ఆయనతో పల్లెత్తుమాట మాట్లాడటమూలేదు. ఆ పిల్లవెధవనుకూడా నెమ్మదిగా వదిలించుకోవాలని చూస్తున్నాను."

"ఇవన్నీ చేస్తూ నీకు ఆయనతో సంబంధంలేదని లోకాన్ని నమ్మించటానికి ప్రయత్నిస్తున్నావు. కాని ఎందుకీ నాటకం?"

"నాటకం ఏమిట్రా? ఆయన ఎలాంటివాడో తెలియకముందు మంచివాడని నమ్మాం. ఇరుగూ పొరుగూ గదాని స్నేహంగా ఉన్నాం. ఆయన బుద్ధి బయట పడ్డాక, ఇంక వాళ్ళ గడప ఎందుకు తొక్కుతాం?"

"పగలంతా ఇలా చిటపటలాడుతూ, చిందులు తొక్కుతూ ఉండి ఉపయోగం ఏమిటి? వెళ్ళవల్సిన టైంలో వెళ్ళొస్తూనే ఉన్నావుగదా..."

"రేయ్, పిచ్చివాగుడు వాగావంటే నీ నాలుక చీరేస్తాను"

"బెదిరించి నా నోరు మూయించగలవు గాని, ఊళ్లోవాళ్ళందరి నోళ్ళు మూయించలేవు."

"ఇవాళ ఏం పుట్టిందిరా నీకు? ఇంతలేసి అబద్ధాలు ఆడుతున్నావు."

"నువ్వు కాదన్న మాత్రాన నిజం, నిజంకాకపోదు. ఇదంతా ఆత్మవంచనా పరవంచనాను."

"నిన్ను చంపేస్తానివాళ...నా సంగతి తెల్సుండీ, అలాంటి మాటలు అనటానికి నీకు నోరెలా వచ్చిందిరా? దారేపొయ్యేవాడు ఎవడో ఏదో కూస్తే

మాత్రం నువ్వు ఎలా నమ్మావురా ?" అని కోపంలో నుంచి దుఃఖంలోకి దిగిపోయింది నీలవేణి.

మురళికూడా ఏడుస్తూనే ఉన్నాడు. ఇద్దరి ఆశయం ఒక్కటే. ఉద్దేశ్యం ఒక్కటే అయితే ఎవరిమటుకు వాళ్ళకు తెల్సిన వాస్తవాలు కొన్ని, తెలియని వాస్తవాలు మరికొన్ని. తెల్సిన వాటినిబట్టి వాళ్ళు యుద్ధానికి సిద్ధమైనారు.

ఇంత గొడవ జరిగాక అయినా అక్కలో మార్పు వస్తుందనుకున్నాడు. కానీ, మళ్ళీ రాత్రికి నీలవేణి అలాగే వెళ్ళిపోవటం చూసిన మురళి ఇంక ఈ విషయం వాదించటం అనవసరం అనుకున్నాడు.

పదిరోజుల తర్వాత మురళి సాయంత్రంపూట స్నేహితుడితో బజారుకు వెళ్ళాడు. సెంటర్లో జెండాచెట్టు అరుగుచుట్టూ చేరతారు జనం. రోజూ వచ్చేవాళ్ళే గనుక, కాలక్షేపానికి ఒకరిమీద ఒకరు జోకులు వేసుకుంటూ ఉంటారు. పనిపాటాలేని పెద్దవాళ్ళకి, కుర్రకారును చూస్తే కొంచెం లోకువ.

ఒకాయన చెట్టును ఆనుకుని కూర్చున్నాడు. ఆయన చుట్టూ నలుగురయిదుగురు సభను అలంకరించారు. మరో ముసలాయన చుట్ట కాల్చుకుంటూ, అరుగు చివర కూర్చుని ఉన్నాడు. మురళీ, అతని స్నేహితుడూ ఇంకో పక్కన కూర్చుని పేపరు చూస్తున్నారు

"ఓరెంకటేశర్లూ, ఏంట్రా పేపర్లో సంగతులు ?" అని అడిగాడు సభాధ్యక్షుడు.

"ఏంలేవు" అని తక్కున సమాధానం చెప్పాడు ఆ వెంకటేశ్వర్లు.

"వెంకటేశ్వర్లూ, ఎవరో ఆడకూతురితో రాత్రి రెండో ఆట సినిమాకెల్తన్నావు, ఎవరూ ?" అని అడిగాడు ఇంకొకడు.

"రాత్రి నేను రెండో ఆట కెళ్ళందే" అన్నాడు వెంకటేశ్వర్లు.

"నీకుమల్లే వుంటే నువ్వేననుకున్నా..."

"ఎంకటేశర్లు పెళ్ళి సెటిలయిందిగా..."

"ఎవరి పిల్ల ?"

"పాపారావు కూతురంటే మనోడికి శానా ఇష్టం."

"ఏవోయ్ ఎంకటేశర్లు, నిజమేనా ?"

"ఛీ పోడు పాపారావు కూతుర్ని ఎవడు చేసుకుంటాడు. దానికి మీసాలొస్తున్నాయి" అన్నాడు వెంకటేశ్వర్లు చిరాగ్గా

"ఏరా వస్తే, నీకు రావటల్లా?" అని నవ్వాడు చుట్ట.

ఇంతలోకి అక్కడికి ఎక్కడి నుంచో సైకిలుమీద వచ్చి వాలాడు బోసు. మురళిని చూస్తూ, సైకిలు గంట మోగిస్తూ అడిగాడు.

"ఏరా బావమ్మర్దీ...తగ్గిందా ?"

వెంకటేశ్వర్లు బోసుతో అన్నాడు. "మురళి మీకు బావమ్మర్ది ఎలాగయ్యాడు? మీ చెల్లిని ఎవర్కన్నా వాడికిస్తున్నారా?"

"లేదు వాడి అప్పను నేను చేసుకుంటున్నాను" అక్కడున్నవాళ్ళంతా ఫక్కున నవ్వారు. మురళి కోపంగాలేచి అన్నాడు.

"మర్యాదగా మాట్లాడండి..."

"పోరా, మీకు మర్యాదేంటి?"

"అనవసరంగా మా జోలికివచ్చి పోట్లాటకు దిగుతారేం?" అని రెట్టించాడు మురళి.

"బచ్చాగాడివి, నీతో నాకు పోట్లాట ఏంట్రా? నో వందరూపాయలిస్తాను. రాత్రికి మీ అప్పను రమ్మను..."

ఏంట్రా కూశావు?" అని మురళి కలబడటానికి వెళ్ళాడు.

బోసు బలంగా వెనక్కి నెట్టేశాడు. "ఏరా, ఆ పోలేసోడింటికి రోజూ పోతోందిగా, నాదగ్గరకు ఒకరోజు రావటానికేం?" అన్నాడు.

అంతా ముహాలింత చేసుకుని, పళ్ళన్నీ వెళ్ళబెట్టుకుని చూస్తూనే ఉన్నారు. మురళికి తలకొట్టేసినట్టయింది ఇంక అక్కడ ఒక్కక్షణంగూడా నిలబడలేక పోయినాడు

తలొంచుకొని వెళ్ళిపొయ్యాడు. అక్కడినుంచి——

ఎటువెళ్ళాడో, ఎక్కడికి వెళ్ళాడో తెలియదు.

మురళి మళ్ళీ ఆ ఊళ్ళో ఎవరికీ కనిపించలేదు.

నాలు రోజులతర్వాత, ఏడుస్తూ కూర్చున్న నీలవేణికి పోస్టువాడొక ఉత్తరం అందించి వెళ్ళాడు. ఆత్రంగా చదువుకుంది.

"అక్కా...

మంచికో, చెడుకో నీవు చంద్రంగారితో సంబంధం పెట్టుకున్నావు మనం పెంచుకున్న ఆశలన్నిటినీ తుంచేశావు. ఏ దురదృష్టజీవితం నీకు లభించ గూడదని ఇన్నాళ్లూ జాగ్రత్తపడుతూ వచ్చామో, ఆ పాపిష్టిబ్రతుకే నీకు తప్పనిసరి అయింది. సరే, ఇంక ఆయనతోనే నీ జీవితాన్ని ముడివేసుకో! మీ పరిస్థితులన్నీ కుదుటపడ్డాక ఒక ఏడాది తర్వాత నేను మళ్ళీ ఆ ఊరు

వస్తాను. ఈలోగా మీరు ఎక్కడికైనా ట్రాన్స్‌ఫర్ వచ్చి వెళ్ళిపోతే, మీరు ఎక్కడికి వెళ్ళిందీ జాన్‌కైనాతెలియజేయండి. నాగురించి వెతికే ప్రయత్నం చేయ వద్దు.నువ్వు సుఖంగా ఉండటమే నాక్కావల్సింది. నీగురించి చెడుగా ఎవరేమను కున్నా వినలేను. అందుకే ఆ ఊరినుంచి వచ్చేశాను.

బావగారికి నా నమస్కారాలు చెప్పు. మీ అశోక్‌కు ఆశీస్సులు

—మురళి

*　　　*　　　*

# 11

పతంజలిగారు, బోసూ కలిసి చంద్రంమీద పెట్టిన ఆకాశరామన్న పిటీషను పై అధికారుల దృష్టిలోకి వెళ్ళింది. దానిమీద నిజానికి చర్యతీసుకోవల్సిన అవసరం లేదు. కానీ అందులో ఎంతోకొంత యదార్థం లేకపోతే, ఈ పిటీషను ఎందుకు వస్తుంది అని పోలీసు సూపర్నెంటుగారికి అనుమానం వచ్చింది ఒకరోజు సాయంత్రం హఠాత్తుగా క్యాంపువేసుకుని వచ్చాడు.

ఆఫీసులోని లాంఛనాలన్నీ అయిపొయ్యాక చంద్రం ఆయన్ని తన ఇంటికి తీసుకువచ్చి చేయవల్సిన మర్యాదలన్నీ చేశాడు. యస్.పి. గారు తనకు వచ్చిన ఫిర్యాదుగురించి చెప్పాడు. అవన్నీ ఒట్టి అబద్ధాలనీ, తనకు లంచాలు ముట్టు కునే అలవాటు లేదనీ, స్త్రీలతో పరిచయాలుపెట్టుకునే అలవాటు అంతకన్నా లేదనీ గట్టిగా బల్లగుద్ది మరీ చెప్పాడు చంద్రం.

కానీ భయపడ్డంతా జరిగింది. ఆరోజు రాత్రిగూడా నీలవేణి వచ్చి తలుపు తట్టింది. చంద్రం గబగబా బయటకువచ్చి నీలవేణిని బ్రతిమిలాడుకుని బయటనుంచే ఆమెను పంపించివేశాడు. ఇది అ వచ్చిన ఆయన కనిపెట్టాడు మర్నాడు వెళ్ళిపొయ్యేముందు చంద్రంతో అన్నాడు.

"నీ పర్సనల్ విషయాల్లో జోక్యంచేసుకుంటున్నానని అనుకోకు. నువ్వు వీలైనంత త్వరలో మళ్ళీ పెళ్ళిచేసుకోవటం అవసరం."

చంద్రం ఆయన ముహంలోకి సూటిగాచూస్తే, ఆయన ఇంకా అన్నారు "అన్యాయానికి, అవినీతికి దూరంగా ఉండందే వాళ్ళను శిక్షించే హక్కు నైతికంగా మనకు ఉండదు. ఇది గుర్తుపెట్టుకో"

ఆయనకు ఏమని బదులు చెప్పగలడు? ఈపాటి ధర్మపన్నాలు తనకూ తెల్సునని ఆయనతోచెప్పి ప్రయోజనం ఏముంది? తన నిజాయితీని, నీలవేణే నమ్మలేకపోయింది. వీళ్ళంతా ఎలా నమ్ముతారు? ఒకరి నమ్మకాలతో తనకు

పనిలేదు. తన అంతరాత్మే తనకు న్యాయస్థానం అక్కడ తాను నిర్దోషి. అది చాలు అని తృప్తిపడటంకన్నా మరేం చేయలేకపోయినాడు చంద్రం.

చంద్రం పరిస్థితి అలాఉండగా నీలవేణి పరిస్థితి మరీ దిగజారిపోయింది. ఆమెకు ప్రపంచమంతా శూన్యంగా కనిపించింది. తన ఆశలన్నీ మురళిమీద పెట్టుకుంది. చుట్టూఉన్న లోకంతో పనిలేకుండా, వాడితోనే తన లోకం అనుకున్నది. కాని వాడూ నలుగురిలాగా తన ప్రవర్తన మంచిదికాదని వేలెత్తి చూపించాడు. ఇంత నిక్కచ్చిగా ఉన్నా, ఇంకా అభాండాలువేస్తే తనేం చెయ్యగలదు

వాడలా వెళ్ళిపొయ్యాడు. ఎప్పుడొస్తాడో, అసలు వస్తాడో రాడో తెలియదు. వాడేదో చదివి, సంపాదించి, తన్నికలకెత్తుతాడని అనుకున్నదంతా ఒట్టి పగటి కలే అయింది. తన దౌర్భాగ్యమే తనకు మిగిలింది. ఇంక ఒకే ఒక్క దారి కళ్ళకు కనిపిస్తోంది. చంద్రం!...

తన తప్పొప్పులు తనకే తెల్సుగాని, ఊళ్ళోవాళ్ళకు తెలియదు. ఎలా వచ్చిందో వచ్చిపడింది చెడ్డపేరు. బోసు బారినుంచి తప్పించుకోవటానికే, ఆనాడు చంద్రం స్నేహం కోరటానికి వెళ్ళింది. అదృష్టమో, దురదృష్టమో గాని, అతను ఒంటరివాడు అయినాడు. చచ్చిపోయిన భార్యకోసం చచ్చేదాకా ఆకాశంవంకచూస్తూ కూర్చోవటంతో తృప్తిపడుతున్న మగమహారాజు ఆయన. అలాంటివాడింటికి, ఎదుటి గుమ్మంలోకి తను రెండుసార్లు వెళ్ళినంతమాత్రాన, పోనీ, అమ్మా అంటూ దిక్కులు పిక్కటిల్లేటట్లు ఏడుస్తున్న పిల్లాణ్ణి చేతుల్లోకి తీసుకుని ఊరడించిమాత్రాన, ఇంక చెడిపోయినట్లేనా? దిక్కుమాలిన ఊరూ దిక్కుమాలిన మనుషుం లూను...

వాళ్ళ ఏడుపే నిజమయితే, ఇంక నిజంగానే ఏడుస్తారు కాబోలు!...ఎన్నాళ్ళిలా నిర్జీవంగా పడిఉంటుంది? వాడుగూడా వెళ్ళిపోయాక, ఈ అపవాదును తన మెడకు ఉచ్చేసి లాగుతూ, ఇంకెన్నాళ్ళు తననిలా ఒంటరిగా బ్రతకనిస్తారీకాకులు? పరిస్థితి చెయ్యిదాటిపోకముందే, తను జాగ్రత్తపడితేమంచిది— అనుకుని లేచి ఎదురింట్లోకి నడిచింది నీలవేణి.

వరండాలో కూర్చుని బాబుకు బీట్లపేకతో చదువు చెప్పాలని చూస్తున్న జాన్ సంతోషంగా నవ్వాడు ఈమెను చూసి.

"ఇదిగో, జాన్..." అని పిల్చింది

"వాట్ మేడమ్" అన్నాడు తలెత్తి చూసి.

"మీ అయ్యగారున్నారా?"

"నాట్ మేడమ్."

"ఇంకా రాలేదా?"

"టుడే లేట్ మేడమ్."

బాబును తీసుకుని హాల్లోకి వెళ్ళింది. ఇదివరకటి లాగానే కుర్చీలో కూర్చుని అశోక్‌తో కబుర్లుచెపుతూ, చంద్రంకోసం ఎదురుచూస్తూ కూర్చుంది.

అరగంట గడిచాక చంద్రం వచ్చాడు. ఈమెను చూసీచూడనట్లు తన పడకగదిలోకి వెళ్ళాడు. బట్టలు మార్చుకున్నాడు. పెరట్లోకి వెళ్ళాడు. ముహం కడుక్కున్నాడు. లోపలికివచ్చి భోంచేశాడు. అదీ పూర్తయ్యాక, వెళ్ళి తన మంచంమీద పడుకున్నాడు. వస్తూపోతూ ఈమెవంక చూసినా పలకరించలేదు. ఇంకా కోపం తగ్గలేదు కాబోలు మరి.

జాన్ వెళ్ళిపొయ్యేదాకా బాబుతో కాలక్షేపంచేసి, ఆ తర్వాత నీలవేణి వెళ్ళి నిద్రపోతున్న చంద్రాన్ని లేపింది. చంద్రం విసుక్కుంటూ లేచాడు.

"పగలైనా నన్ను నిద్రపోనీ" అని గొణుక్కున్నాడు తనలో తనే.

అయినా ఆ మాటలు నీలవేణికి వినిపించాయి. "పగలైనా నిద్రపోనీ అంటే రాత్రిళ్ళు నిద్రపోనివ్వటంలేదనేగా. మిమ్మల్ని నిద్రపోకుండా నేను వద్దన్నానా" అని అడిగింది.

"ఎందుకిలా నాచేత ఏవో ఒకటి అనిపించి, నీ మనసు కష్టపెట్టుకుని, నన్ను కష్టాలపాలు చేస్తావు?" అన్నాడు నవ్వుతూనే.

"అంటే నాతో మాట్లాడటం మీకింత కష్టంగా ఉందన్నమాట" అన్నది తీక్షణంగా చూస్తున్నట్లు నటిస్తూ.

"మరే. కష్టంగా ఉండబట్టేగా ఇన్నాళ్ళనుంచీ తిరిగిచూడటం మానేశాను" అన్నాడు చంద్రం దెప్పుతూ.

"మరి, ఏ ఆడపిల్లయినా ఊరుకుంటుందా–రాత్రికి వస్తావా అంటే?"

చంద్రం దీర్ఘంగా నిట్టూర్పు విడిచాడు. కొద్దిక్షణాల విరామం తర్వాత నీలవేణి అన్నది. "మీకు తెల్సుగదా నలుగురిలో గౌరవంగా బ్రతకాలని, పరిస్థితులతో ఎంతమొండిగా పోరాడుతున్నానో...అయినా చూడండి, చివరికి ఏమైందో! నేను ఏ పాపమూ ఎరగకపోయినా నామీద ఎన్నో అభాండాలు వేస్తున్నారు. మనిద్దరిచుట్టూ ఎన్నెన్ని కథలుఅల్లారు. కాకులులోకులు. ఆ కాకిగోల అలా ఉంచండి. చివరికి మా మురళి, వాడూ నన్ను అనుమానించాడు నేనేదో

"నేను చెప్పేది వినేందుకు నువ్వు కొంత గుండెధైర్యాన్ని అరువుతెచ్చుకోవాలి, నీలవేణీ "

"చెప్పండి "

"నలుగురిలో నువ్వూ సగర్వంగా తలెత్తుకుని తిరుగేందుకై, అంతంత మాత్రంగాఉన్ననీ గౌరవమర్యాదలను కాపాడుకోవటానికై, నీవు ఎంత తాపత్రయ పడుతున్నావో నాకు తెల్సు...కానీ నువ్వు దాదాపు రోజూ రాత్రిళ్ళు నా దగ్గరకు వస్తున్నది మాత్రం నిజం..."

"ఏమండీ, చివరకు మీరూ వాళ్ళతో చేరిపొయ్యారా?" అన్నది నీలవేణి, జివ్వున చిమ్ముకొస్తున్న కన్నీటి పొరలముధ నుంచి చూస్తూ.

"నేను వాళ్ళతో చేరటంలేదు నిన్ను నిజానికి దగ్గరగా చేరుస్తున్నాను... ఎప్పుడు ఎవర్ని ఏ అదృష్టం వరించినా, దాన్ని అంటిపెట్టుకుని ఏదోరూపంలో కొంత దురదృష్టంగూడా వచ్చి వాటేసుకుంటుంది. ఇంత అందమైన రూపాన్ని ఇచ్చిన భగవంతుడే, నీకో భయంకరమైన శాపాన్నిగూడా ఇచ్చాడు... నీకీమధ్య నిద్రలో నడిచివెళ్లే జబ్బుఒకటి పట్టుకుంది పగలంతా ఈ ఇంటిలో తిరుగుతూ ఉన్నందువల్ల, రాత్రిపూటగూడా అసంకల్పితంగానే ఇక్కడికివచ్చి కూర్చుని ఏవేవో మాట్లాడుతూ ఉంటావు. పగటిపూట నీవు బయటపడి చెప్పటానికి బిడియపడే అనేక విషయాలు, అప్పుడు నిస్సంకోచంగా చెబుతూఉంటావు. అయితే ఒకరోజు చెప్పినమాటలకీ, మర్నాడు చెప్పినమాటలకీ పొంతనకుదిరేది కాదు అసలు మొట్టమొదట నీ బొమ్మవేయమని అడగటానికి వచ్చావాక అర్ధరాత్రిపూట. నిన్ను బలవంతాన కూర్చోబెట్టుకుని నాలుగురోజులు శ్రమపడి నీ బొమ్మగీశాను..."

"నా బొమ్మగీశారా?" అని అడిగింది నీలవేణి ఆశ్చర్యంగా

"వచ్చినప్పుడల్లా ప్రతీసారీ, ఇంత ఆశ్చర్యంగా అడుగుతుంటే, నాకే విసుగొచ్చి దాన్ని దాచిపెట్టాను. దానిసంగతలా ఉంచు నువ్వు పగలురావటం మానేసి, రాత్రిళ్ళువచ్చి కూర్చోవటం కొంతమంది కళ్ళపడింది ఇలాంటి విషయాలకు లభించినంత ప్రచారం మన ఊళ్ళల్లో మరి వేటికి లభిస్తుంది? మన విషయం నలుగురూ చెవులు కొరుక్కోవటం దగ్గరే ఆగిపోలేదు మురళికి జబ్బు చేసినప్పుడు, ఆరోజు రాత్రి నీకు చెప్పటంకోసం వచ్చిన కుర్రాళ్ళు, నువ్వు ఇక్కడ ఉండటం చూసివెళ్ళారు ఇంకేంకావాలి? ఈవార్త దావానలం అయింది. మురళి హాస్పిటల్‌నుంచి ఇంటికివచ్చాకకూడా, నీ అలవాటు నువ్వు మానలేదు.

ఇలాంటి సున్నితమైన విషయాల్లో అయినవాళ్ళకు చెప్పటం అంటే చాలా ఇబ్బందిగా ఉంటుంది. ఇటు నీకు చెప్పి ఒప్పించనూలేక, దీన్ని ఆమోదించనూ లేక, అటు సాటివాళ్ళమధ్య తనకు జరిగే అవమానాన్ని భరించలేకనే మురళి ఎటో వెళ్ళిపోయిఉంటాడు..."

చంద్రం చెప్పిన విషయాలను నమ్మలేనట్లుగా ఎంతో ఆశ్చర్యంగా చూస్తూ, నెమ్మదిగా మాటల్ని కూడదీసుకుంటూ అడిగింది. "మరి ఇన్నాళ్ళూ ఈ విషయం ఎందుకు దాచిపెట్టారు?"

"ఇతరులకీ విషయం చెప్పినందువల్ల నీకు మరింత అపకారమేగాని, జరిగే ఉపకారమేమీలేదు పోనీ నీకైనా చెబుదామంటే, నువ్వు నాకా అవకాశాన్నే ఇవ్వలేదు ఇన్నాళ్ళ తర్వాత ఇప్పుడే గదా నాతో మామూలు స్థితిలో మాట్లాడటానికి వచ్చావు. నీ ఊహలూ, ఉద్దేశ్యాలూ నాకు తెలుసు గనక, నువ్వెలాంటి పరిస్థితిలో నా దగ్గరకు వచ్చినా, ఎంత నిశిరాత్రిపూట వచ్చి నా పక్కన కూర్చున్నా, నిన్ను నేను దూరంగానే ఉంచాను. ఈ మాట నువ్వు నమ్మాలి..."

"నమ్మవలసిన లోకం నమ్మలేకపోతోంది. ఇంక ఈ నిజాయితీకి అర్థం ఏమిటి?"

"మనం నీతిగా, నిజాయితీగా ఉండటం ఎంత అవసరమో, అలా ఉంటున్నట్లు లోకాన్ని నమ్మించటం గూడా అవసరమే, కాదనను కానీ ఎవరికీ విప్పి చెప్పుకోలేని కారణాలవల్లనో, విధి వైపరీత్యంవల్లనో ఇలాంటి నిందలకు గురిఅయినంత మాత్రాన కృంగిపోగూడదు, నీలవేణీ తాటిచెట్టు క్రింద నుంచుని ఫ్లాస్క్‌లోనుంచి వంచుకుని నేను బోర్న్‌విటా తాగుతున్నానంటే, అందరూ నమ్మకపోవచ్చు. అలాంటప్పుడు మన మనస్సాక్షే మనకు శ్రీరామరక్ష "

"ఈ అపవాదులకే కాదండీ, కలసిరాని కాలానికీ నేను తలవంచక తప్పనిసరి అవుతున్నది. నా ఆశలన్నీ పండుటాకుల్లా గలగలా రాలి పోతున్నాయి."

"అనుకున్నవన్నీ అనుకున్నట్లు జరిగిపోతున్నప్పుడు మన గొప్పదనం ఏమీలేదు. ఎదురు తిరిగిన పరిస్థితులను సైతం లొంగదీసుకోగలిగినప్పుడే మన గొప్ప బయటపడేది. అయినా నువ్వు నలుగురిలో తలొంచుకోవల్సిన పనేమీ చెయ్యలేదు, నీలవేణీ. వెళ్ళు. వెళ్ళి, మునుపటికన్నా ధైర్యంగా

తలెత్తుకుని తిరుగు. నిన్ను చూసి నవ్వినవాళ్ళ హీనత్వాన్ని చూసి నువ్వూ నవ్వు...వెళ్ళు..."

"నేను వెళ్ళను. వెళ్ళటానికి రాలేదు. ఇంక మీతో ఉండిపోవటానికే నిర్ణయించుకుని వచ్చాను."

"అంటే ఏమిటో స్పష్టంగా చెప్పు."

"నేను మిమ్మల్ని పెళ్ళిచేసుకుంటాను."

"జీవన పోరాటంలో ఓడిపోయి, చివరికిలా పరిస్థితులతో రాజీపడుతున్నావా ?"

"జీవన పోరాటంలో ఓడిపోయినానని అనటం భావ్యంకాదు. ఎందుకంటే ఎప్పటికప్పుడు ఏవేవో కావాలని ఆరాటపడటమే మిగిలింది గాని; వాటిని పొందటానికి నేను నిజానికి జరిపిన పోరాటం ఏముంది ?"

"ఎక్కడికో వెళ్ళాలని, నీ గతచరిత్ర తెలియనివాణ్ణి, చంద్రబింబంలా వెలుగుతూ చిరునవ్వులు చిందించేవాణ్ణి, వలచి వలపించుకోవాలన్న నీ ఆశలన్నీ ఏమైనయి ?"

"ఆశ లున్నంతమాత్రాన చాలదనీ, ఆ ఆశలనీ, అవకాశాలనీ పడుగు పేకలుగాచేసి, నేసి వేసుకున్న అందమైన వస్త్రమే జీవితానికి శోభనిస్తుందనీ-అనుభవం నేర్పుతుంటే కాదనలేకపోతున్నాను."

"వివాహమనేది ఒకనాటితో ముగిసిపొయ్యే వేడుక కాదు. తొందరపడి నిర్ణయం తీసుకుంటే తీరిగ్గా విచారించాల్సి వస్తుంది."

"ఇక్కడ మీ కొక్క విషయం చెప్పాలి. నేను ఇన్నాళ్ళూ ఏ మగవాడ్నీ లెక్కచెయ్యనట్లు నటించాను. నా అందం నాకో పెద్ద వరమనీ, దాన్ని చూసుకుని గర్వంతో విర్రవీగుతూ, ఎంతటివాణ్ణీ లక్ష్యపెట్టనట్లు నటిస్తూ వచ్చాను. అదంతా మేకపోతు గాంభీర్యం. ఆ మాత్రం గాంభీర్యం వహించకపోతే, ఈ ముష్కరులవంటి మనుష్యుల మధ్య, లేడిపిల్లలాంటి ఆడపిల్లను క్షేమంగా బ్రతకలేను. అంచేత నాకోసం ఏ యువరాజో కాచుకుని కూర్చున్నాడని పదే పదే మీ అందరికీ చెబుతూ, మీ మధ్య ఉంటూనే, అదొకరకమైన మిథ్యలో ఉంటున్నట్లు కనబడుతూ వచ్చాను. కానీ నాకు తెలుసు. అదంతా ఒక పగటి కలేనని. ఇలలో పొందలేనిదాన్ని కలలో చూసుకుంటారు ప్రతివాళ్లూ గూడా. కల అంటే, అదంతా కల్ల అని తెలిసినా, అలా భ్రమపడటం మానలేదు మనిషి. అంతేగానీ మీరంటే ఇష్టంలేకకాదు, మీకంటే గొప్ప సంబంధం

నాలాంటి నిరుపేదరాలికి దొరుకుతుందనీకాదు ... ఇవాళ బాబుమీద మీకన్నా నాకే ఎక్కువ ప్రేమ ఉందన్నా అతిశయోక్తిలేదు మన మధ్యనున్న మంచు తెరల్ని, ఇలా ఈ అపనిందలే తొలగించాయని అనుకుందాం జరిగినదంతా మన మంచికే అనుకుని, నా అంతట నేనే వచ్చి మిమ్మల్ని అడుగుతున్నాను ఏదో సాకు చెప్పి, మీరు నన్ను వదిలించుకోవాలని చూస్తే, ఇక నాకున్న అదృష్టపు అవకాశాల తలుపులన్నీ గడియలుపడినట్లే. నా గురించి ఇంత తెలిసిన మీకే నేను అక్కర్లేకపోతే, ఈ లోకంలో ఇంకెవరికీ నేను భార్యగా ఉండటానికి పనికిరాను ... చెప్పండి ... నన్ను ఉండమంటారా, వెళ్ళమంటారా ?"

చంద్రం నిట్టూర్చాడు కాసేపు మౌనం వహించి నెమ్మదిగా అన్నాడు "... ఇందాక నువ్వు అన్నట్లు – ఇప్పుడు నేను కాదంటే – అదృష్టపు అవకాశాల తలుపుల గడియలు బిగుసుకోవటం నీ ఒక్కదానికే కాదు నేనూ ఆ అవకాశాన్ని జారవిడుచుకున్నవాణ్ణే అవుతాను. ఇన్నాళ్ళూ ఈ ఆలోచన రానివ్వకపోవటానికి కారణం నువ్వు నాకు తగవనికాదు. నేను నీకు తగనేమోనని..."

"మన మధ్య ఈ తగువు ఇవాళ్టి ది కాదులెండి," అన్నది నీలవేణి సిగ్గుగా నవ్వుతూ.

చంద్రమూ నవ్వాడు. వాళ్ళిద్దరివంక చూస్తూ కూర్చున్న బాబూ నవ్వాడు

ఆ విధంగా వాళ్ళు ఒక అభిప్రాయానికి వచ్చాక, చంద్రం, నీలవేణీ మునుపటికన్నా మరింత చనువుగా తిరగటం మొదలుపెట్టారు. ఒకటి, రెండు సార్లు సాయంత్రాలపూట చెరువుగట్టుకు షికారుకు వెళ్ళి వచ్చారు. ఇంత నిర్భయంగా తిరుగుతున్న వాళ్లను చూసిన నలుగురూ నాలుగు రకాలుగా చెప్పుకున్నారు. ఇవన్నీ జానకి చెవినగూడా పడినయి.

ఒకరోజు పతంజలిగారు లేని సమయం చూసుకుని, జానకి నీలవేణి ఇంటికి వచ్చింది. ఇప్పుడు నీలవేణి తన మకాం చంద్రంగారి టికి మార్చేసింది తిండీ, నిద్రాగూడా అక్కడే. జానకి నీలవేణిని వెతుక్కుంటూ చంద్రం ఇంటికే వచ్చింది. ఆమె వచ్చే సమయానికి నీలవేణి అశోక్‌కు అన్నం తినిపిస్తోంది.

"అదేమిటే, నువ్వు బొత్తిగా పిల్లల తల్లివై పొయ్యావు," అని అడిగింది జానకి.

"ఆడదానికి అంతకన్నా కావల్సిందేమిటే?" అని నవ్వింది నీలవేణి. స్నేహితురాలిని కూర్చోమని చెబుతూ

"ఆడదానికి తన సంసారం, తన పిల్లలకన్నా కావల్సిందేమీలేదు. కానీ ఇది నీ సంసారమూ కాదు వీడు నీ బిడ్డా కాదు."

"లోకానికి అలా అనిపించటంలో అబ్బురమేమీలేదు గాని, నా మటుకు నాకు వీడు గత జన్మలో నా పిల్లాడే అయిఉంటాడనీ, ఈ జన్మలో ఇలా నా ఒడి వెతుక్కుంటూ వచ్చాడనీ అనిపిస్తోంది,'' అన్నది నీలవేణి అశోక్ ఎంగిలి మూతి కడిగి, పైటకొంగుతో తుడుస్తూ.

"బావుందే నిన్ను చూస్తూంటే నువ్వు మునుపటి నీలవేణివేనా అని అనుమానంగూడా వేస్తోంది. ఇంతమార్పు ఎలా వచ్చిందే నీలో?''

"మారుతున్న కాలం మనల్ని మార్చేస్తుందే... మురళి చెప్పకుండా లేచి పోయాడు. ఏడాదిదాకా తన గురించి ఆలోచించవద్దని ఉత్తరం రాశాడు. వాడి చదువుకనే మిషమీద మీ ఆయన దగ్గరనుంచి నెలకు వందరూపాయలు గుంజుతున్నాను. చాటుమాటుగా నీ దగ్గరనుంచి దొరికినంత కాజేస్తున్నాను. నవ్వుమాత్రం ఎన్నాళ్ళు ఇస్తావు? అస్తమానం మీ ఆయనతో గొడవపడటం ఏం బావుంటుంది ?"

"పెళ్ళి పెటాకులు లేకుండా పరాయివాడితో ఉండటం, ఇది మాత్రం బాగుందా ?"

''లోకంకోసం మెళ్ళో పసుపుతాడు కట్టించుకోవాలని తెలుసు. అదీ త్వరలోనే జరుగుతుంది."

"అయితే అంతా నిర్ణయించుకున్నారన్నమాట "

"నా కష్టాలన్నీ విన్నవించుకున్నాను ఆయన దయదలచి సరే నన్నారు."

"ఉహుఁ, ఇంకేం మరి?" అన్నది నవ్వుతూ.

మరి కాసేపు కబుర్లూ, సరససల్లాపాలూ అయినాక జానకి వెళ్ళిపోయింది. మర్నాడు సత్యమూర్తిగారు వాళ్ళింట్లోకి తొంగిచూసినప్పుడు జానకి, నీలవేణి చంద్రాన్ని పెళ్ళిచేసుకుంటున్నదని చెప్పింది. అది ఆయనకి పెద్ద ఆశ్చర్యాన్ని కలిగించలేదు. కానీ విన్న తర్వాత చంద్రాన్ని చూద్దామని వచ్చాడు. రాగానే అన్నాడు.

"శుభాకాంక్షలు. మీరు నీలవేణిని వివాహం చేసుకుంటున్నారట."

"చిన్న సవరణ నేను నీలవేణిని చేసుకోవటంలేదు. నీలవేణి నన్ను చేసుకుంటోంది" అన్నాడు చంద్రం నవ్వుతూ.

ఆ మాటలు విన్న సత్యమూర్తిగారు నవ్వుతూ, నీలవేణి వంకచూస్తే, నీలవేణి సిగ్గుతో వాళ్లఎదట నిలబడలేక, లోపలికి వెళ్ళిపోయింది.

* * *

## 12

నీలవేణికి, చంద్రానికి మధ్యనున్న అడ్డుతెరలన్నీ తొలగిపోయినయి. ఇదివరకటిలా ఆమె అంటే అతనికి బెరుకులేకపోగా ఏదో కొంత హక్కు ఏర్పడ్డట్లుగా గూడా తోచింది. ఇంతకుముందులాగా ఇల్లు, వాకిలీ అంటే నిర్లక్ష్యంగా వుండలేకపోతున్నాడు. బాబుకు, నీలవేణికి కావల్సిన గుడ్డలూ, ఆమెకోసం నగలూ తీసుకొచ్చి ఇస్తున్నాడు. వద్దు, వద్దు అంటూనే నీలవేణి వాటిని తీసుకుంటోంది. ఖరీదైన చీరలూ, నగలూ ధరించి, అద్దంలో అందం చూసుకుంటే అలంకరణ తెచ్చిపెట్టిన ఆకర్షణతోడై తన కళ్లకు తనే కొత్తగా, వింతగా కనిపిస్తూ వున్నది.

ఉన్నట్లుండి ఒకరోజు చంద్రం నీలవేణిని పట్నం బయల్దేరమన్నాడు. ఆమె ఆశ్చర్యపోయింది తర్వాత సంతోషాన్నీ, సిగ్గునూ దాచుకుంటూ అన్నది

"మీ హనీమూన్ ఇప్పుడుకాదు, పెళ్ళయ్యాక..."

"సంతోషించాంలేగాని, ఇప్పుడు నేను రమ్మంటున్నది హనీమూన్‌కికాదు. నిన్ను డాక్టరుచేత పరీక్ష చేయించాలి."

"అంటే ఇది కుదిరే రోగమో, కుదరని రోగమో తేల్చుకునిగాని, పెళ్ళికి ఒప్పుకోరన్నమాట," అన్నది నీలవేణి అంతలోనే కృంగిపోతూ.

"నేను ఒప్పుకోవటం అనేది ఇదివరకే జరిగిపోయింది. కాబట్టే, నువ్వు నా దానివి కాబట్టే, ఇప్పుడీ చికిత్సకు తీసుకువెళ్లటం..."

తన తొందరపాటుకు తనే కొద్దిసేపు చింతించి, నెమ్మదిగా అన్నది. "అయినా ఇప్పటికే నాకోసం ఎంతో డబ్బు ఖర్చుచేస్తున్నారు. సిటీలో డాక్టరు దగ్గర ట్రీట్‌మెంట్ అంటే మాటలా?..."

"మాటలు కాదు, మూటలు కావాలని నాకు తెలుసు. డబ్బు గురించిన బాధ నీకు వుండగూడదు. సంపాదించేవాణ్ణి నేనున్నాను. నాక్కావల్సింది, నా మాటకు ఎదురు చెప్పని భార్య...ఏమంటావు ?"

''చెప్పారుగా, మీ మాటకు ఎదరు చెప్పని భార్య కావాలని ... ఇంకేం చెప్పను ?''

''అదీ. అలా వుండాలి. అప్పుడే ముద్దూ, ముచ్చటా ... '' అని చంద్రం నీలవేణిని దగ్గరకు తీసుకోబోయాడు.

''మళ్ళీ మీ మాటకి ఎదురు చెబుతున్నానని అనుకోవద్దు. ప్రస్తుతానికి ముచ్చటతో సరిపెట్టుకుందాం...'' అని నవ్వింది నీలవేణి.

చంద్రం నీలవేణిని సిటీకి తీసుకొచ్చి స్పెషలిస్టుచేత పరీక్ష చేయించాడు. మెంటల్‌గా షాక్ తగిలినందువల్ల ఆమెకి వ్యాధి వచ్చి వుండవచ్చుననీ, కొన్నాళ్లపాటు అక్కడే వుంచి వైద్యం చేయించమనీ సలహా చెప్పాడు.

చంద్రంమాత్రం వస్తూ పోతూ వున్నాడు.

ఈలోగా ఊళ్ళో పెద్ద పుకారు పొక్కిపోయింది. నీలవేణి రహస్యంగా పురుడుపోసుకోవటానికి పట్నంపోయిందనీ, చంద్రం ఆమెతో అక్కడ కాపరంపెట్టాడనీ ఇరుగూ, పొరుగూ దగ్గరనుంచీ జెండాచెట్టుదాకా చెప్పుకున్నారు.

నీలవేణి తిరిగొచ్చాక ఆమెను మరింత చులకనగా చూశారు. ఎప్పుడైనా ఎదురుపడ్డ ఇరుగుపొరుగువాళ్ళు సూటిపోటి మాటలతో దెప్పిపొడుస్తూనే వున్నారు. అయినా వాళ్లను లక్ష్యపెట్టాల్సిన అవసరం లేదామెకు.

పెళ్ళి నిశ్చయమైంది. వచ్చే నెలలో ముహూర్తాలున్నయి. ఏదో ఒకరోజు నిర్ణయం చేసుకోవాలి ఈ విషయం ఆ నోటా ఆ నోటా ప్రాకి పతంజలిగారికీ, బోసుకీ గూడా తెలిసింది.

''అన్నీ అయిపొయ్యాక ఇంకిప్పుడు పెళ్ళిచేసుకోకపోతేమాత్రం ఏం?'' అన్నాడు పతంజలిగారు ఎదురుగుండా కూర్చున్న బోసుతో

''పెళ్ళిచేసుకుంటానని ప్రామిస్‌చెయ్యటం ఆడదాన్ని లొంగదీసుకోవటానికో ఆయుధం. అంతమాత్రాన చేసుకోవాలని ఎక్కడుంది ?'' అన్నాడు బోసు సిగరెట్టు పొగ వదులుతూ.

''అయితే ఇది జరగదంటావా ? '

''జరిగేదయితే ఇన్నాళ్లు ఎందుకు పడ్తుంది ? పట్నంలో కాపరం ఎందుకు పెట్టాడు ? ... నేను ఎప్పుడో చెప్పాను. అమ్మాయిగారి హిస్టరీ, జాగ్రఫీ తెలిసిన వాడెవడూ పెళ్ళిచేసుకోడు. చేసుకున్నంతపని చేస్తాడు, అంతే – అని చెప్పానా లేదా?''

''చెప్పావు. ఆ చెప్పిందేదో నువ్వే చేసి చూపిస్తానంటేగూడా చాలా సార్లు చెప్పావు,'' అన్నాడు పతంజలిగారు నవ్వుతూ.

''ఇప్పుడు మళ్ళీ చెప్తున్నాను, నీలవేణిని వదిలేది లేదు. ఆఫ్ట్రాల్ ఒక సానిపాపను లొంగదీసుకోలేకపోతే, ఇంక ఈ ఊళ్ళో మన విలువేముంది ?'' అన్నాడు బోసు.

అందుకు అవసరమైన సాయంచేస్తానని పతంజలిగారు మాట ఇచ్చాడు గూడా.

చంద్రం ఒకరోజు టౌనుకు బయల్దేరాడు. అతనితోపాటు పతంజలిగారు గూడా వెళ్ళాడు. సాయంత్రం లోపలే వచ్చెయ్యాలనుకున్న చంద్రాన్ని తనూ వస్తానని, కలిసివెళ్దామనీ ఆపాడు పతంజలిగారు.

సాయంత్రం ఎనిమిదిగంటలు కావస్తోంది. అప్పటికే ఊరు చాలావరకు మాటు మణిగింది. చంద్రంకోసం ఎదురుచూసి, చూసి, విసుగుచెంది, వెళ్ళి బాబు మంచంమీద కూర్చుంది. వాడు అప్పుడే నిద్రలోకి జారుకున్నాడు మృదువుగా వాడి నుదుటిమీద ముద్దెట్టుకుంది. వాడు 'అమ్మా' అని పిల్చిన క్షణం ఎలాంటిదోగాని, వాడి నోటిమాటే నిజమవుతున్నది. బాలవాక్కు బ్రహ్మవాక్కు అంటారు

బాబు మంచంమీదనుంచి లేచి, చంద్రం మంచంమీదకు వాలింది. ఇక్కడ ఈ పరుపుమీద, రేపు పెళ్ళయిన దగ్గరనుంచీ ... ఈ పోలీసువాళ్ళకు సున్నితం, సుకుమారం తెలిస్తేగా ... ఈ మాటంటే ఆయనేమంటారు? సిగ్గు ముంచుకొచ్చింది. కళ్ళు బరువుగా మూతలుపడినయి. చిరునవ్వుల మొగ్గలు పెదవులమీద విరిసీ విరియకుండా ఉన్నయి.

ఏవేవో ఊహలు...ఎవరో వచ్చినట్లు ... ఆయనే వంగి ..చేతుల్లో చేతులు కలిపినట్టు... పెదవులపై ఏదో వాలినట్లు ... గుండెలమీద బరువుగా ... వచ్చేశారా? కళ్ళు విప్పింది నవ్వుతూ

ఎదురుగా బోసు. కొండశిలువలా ప్రాకుతున్నాడు నీలవేణి కాళ్ళతో, చేతులతో తన్నుకుంటూ పైకి లేచింది. మళ్ళీ వచ్చి కావలించుకున్నాడు. చేతికి చిక్కిన చేపపిల్లలా గిలగిలలాడింది గింజుకుంది. గుండెలు అవిసేలా కేకలు పెట్టింది.

ఈ గోలకు బాబు లేచాడు. కళ్ళముందు జరుగుతున్న యుద్ధంలోకి వాడూ దూకాడు వాడూ అరిచాడు గోలగా. బోసును లాగాలని ప్రయత్నిస్తున్నాడు

నీలవేణి మొండి ధైర్యం తెచ్చుకుని తిరగబడి, బోసుతో సమానంగా పోరాడుతోంది.

మాదాకవళానికి వచ్చిన పిచ్చిది గుమ్మంలో నిలబడి అరుస్తున్నది. ఎవరు పెట్టినా, పెట్టకున్నా నీలవేణిమాత్రం దానికొక ముద్దవెయ్యకుండా ఉండదు. అందుకని నీలవేణి రావటం ఆలస్యమైనా అలాగే గుమ్మంలో నిలబడి 'మాదాకవళం తల్లీ' అని పిలవటం దానికి అలవాటు. చీకట్లో కుక్కలు వెంటపడకుండా ఉండేందుకు తెచ్చుకున్న కరతో చప్పుడు చేస్తుంది. ఇప్పుడు లోపలనుంచి వినవస్తున్న కేకలు, రంకెలు విని పిచ్చిది లోపలికి పరుగెత్తింది.

నిస్సహాయస్థితిలో నున్న నీలవేణిని చూస్తే దాని కడుపు తరుక్కుపోయింది. ఈ బోసుగాడు ... వీడే ఆ రోజు తననూ ఇలాంటి పరిస్థితుల్లోనే సర్వనాశనం చేశాడు ... పిచ్చిదాని గుండె మండిపోయింది. చేతిలోని కర్రతో వాణ్ణి తరిమి, తరిమి కొట్టింది. ఆనాడే వాడి తల బద్దలుకొట్టలేకపోయినే అన్న దాని బాధ ఇవాళ తీరింది. ఈ దరిద్రుడు ఇలా తాచుపాములా తనను వెంటాడుతున్నాడే అన్న భయం నీలవేణికీ తీరింది.

తలనుంచి నెత్తురు కారుతుంటే, కళ్ళు చీకట్లు కమ్ముతుంటే, కాళ్లు తేలి పోతుంటే, నేలకు ఒరిగిపోయినాడు బోసు.

పిచ్చిది తృప్తిగా, మనసు నిండుగా నవ్వుకుంది. నోటినిండుగా తిట్టి పోసింది. "దొంగ ముండాకొడకా ... ఎన్ని కొంపలు తీస్తావురా ... నా మొగుణ్ణి, నా మొగుణ్ణి చంపించి నువ్వుకాదురా తప్పుడు ముండా ..." బండ బూతులు తిడుతూనే క్రిందపడిపోయిన బోసును కర్రతో కొడుతోంది పూనకం వచ్చినదానిలాగా ఊగిపోతూ.

గోల, కేకలు, అరుపులూ విని, చూట్టానికి వచ్చిన ఇరుగుపొరుగువాళ్లు బోసును హాస్పిటల్‌కు తీసుకువెళ్ళారు. కానీ అప్పటికే ఆలస్యమైపోయింది.

చంద్రం వచ్చేటప్పటికి ఇల్లంతా కోలాహలంగా ఉంది. జరిగింది తెల్సుకుని హాస్పిటల్‌కు వెళ్ళాడు.

ఆరు నెలలపాటు కోర్టులో కేసు నడిచింది. చంద్రం ఎంత ప్రయత్నించినా పిచ్చిదాన్ని రక్షించలేకపోయినాడు, అందుకు అది ఏమాత్రం బాధపడలేదు.

నీలవేణి, చంద్రం జైల్లో ఉన్న పిచ్చిదాన్ని చూడటానికి వెళ్ళారు. వీళ్ళను చూసి వెర్రి ఆనందాన్ని అనుభవించింది.

"నా కోసం ఇంత దూరం వచ్చారా? నేను పిచ్చిదాన్ని. రాళ్లెయ్యటానికీ, కసిరి కొట్టటానికి తప్ప ఊళ్లోవాళ్ళకు మరెందుకూ పనికిరానిదాన్ని నా మీద దయతలచి, నన్ను చూడటానికి ఇంతదూరం వచ్చారా?" అన్నది పిచ్చిది.

"వాళ్ళు అసలైన పిచ్చివాళ్ళు ఎవరి బ్రతుకు వాళ్ళను బ్రతుకనివ్వకుండా తమ స్వార్థంకోసం, ఎదుటివాళ్ళ జీవితాల్లో నిప్పులుపోసి, సాగినంతకాలం ఆట సాగించుకుని, చివరకు తాము రగిలించిన మంటలకే ఆహుతైపోయే పిచ్చి వాళ్ళు...ఏదో, కష్టమో సుఖమో ఆ ఊళ్ళో పడి ఉండనివ్వకుండా, తీసుకు వచ్చి ఈ జైల్లో పడేటట్లు చేశాను నేను..."

"కేవలం మీకు జరిగిన దౌర్జన్యమే అయితే నాకంత ఆవేశం రాకపొయ్యేది. నేనూ ఒకనాడు ఇంతకన్నా ఎక్కువగా వాడి దుర్మార్గానికి గురైయ్యాను. ఊరినిండా జనమూ వున్నారు, వారి నిండా మంచితనమూ వుంది. అయినా ఎవరూ నోరు మెదపలేదు. ఈ పోలీసు బాబులాగా నా మొగడు పెద్ద పదవిలో లేడు పతంజలిగారి చేతిక్రింద నీళ్ళు తాగుతున్నాం గనుక, అడు సచ్చిన సంగతికూడా రెండో కంటివాడికి తెలీకుండానే తోటలో పాతేశారు..." గతం గుర్తుకు వచ్చిన పిచ్చిదానికి గుండె చెరువైంది

"ఊరంతా అన్నంత మాత్రాన ఈమె పిచ్చిదెలా అవుతుంది?" అనుకున్నాడు చంద్రం.

చేయగలిగిందేమీ లేదుగనుక ధైర్యంగా వుండమనీ, అప్పుడప్పుడూ వచ్చి చూసిపోతూ ఉంటామనీ చెప్పి వచ్చారు నీలవేణి చంద్రంలు

*   *   *

## 13

చంద్రానికి ట్రాన్స్‌ఫరైంది.

నీలవేణి కోరుకున్నట్లుగానే చాలా దూరానికి వెళ్ళిపోతున్నారు. చంద్రం దగ్గరనుంచి ఛార్జి తీసుకున్నాడు కొత్త ఆఫీసరు వచ్చి.

నీలవేణికి ఎంత ఆపుకున్నా దుఃఖం ఆగకుండా ఉంది జానకిని చూడకుండా వెళ్ళటానికి ఆమెకు మనసొప్పంద. కానీ బోసు కేసు విషయంలో పతంజలి గారికీ, చంద్రానికీ మాటలు లేకుండాపోయినయి. ఒకర్నొకరు చూసుకోవటమే మానేశారు. జానకికూడా వీళ్ళతో ఎలాంటి సంబంధం లేకుండా వుండే ఏర్పాటు చేసుకున్నాడు పతంజలిగారు.

ఇన్నేళ్ల సొంత సోదరికన్నా ఎక్కువగా మసులుతూ, ఎప్పటికప్పుడు ఎన్నో సహాయాలు చేసిన జానకికి మాటమాత్రం చెప్పకుండా ఎలా వెళ్ళటం అని కన్నీళ్ళతో చంద్రాన్ని అడిగింది నీలవేణి.

"నువ్వు వాళ్ళింటికి వెళ్ళినా అవమానం జరుగుతుంది నీలవేణీ. మనమీద వున్న కోపాన్ని ఎలా తీర్చుకోవాలో తెలియక సతమతమవుతున్నా డాయన. ఏ సాకు దొరుకుతుందా, ఎప్పుడు మనల్ని కించపరుద్దామా అని చూస్తున్నాడు. అంచేత వెళ్ళొద్దు. జానకి ఆ మాత్రం అర్థంచేసుకోగలదు" అన్నాడు చంద్రం.

ఇంక ప్రయాణమైపోతుండగా, జాన్ పరుగు పరుగున వచ్చి ఒక ప్యాకెట్ ఆమెకు అందించాడు. తీసి చూస్తే అందులో చీర, రవికగుడ్డ, పసుపు కుంకుమా వగైరాలన్నీ వున్నయి. ఒక చిన్న చీటీకూడా వుంది.

"నీలూ —

మళ్ళీ మనం కల్సుకుంటామన్న ఆశలేదు. ఇంక మనకు మిగిలింది గతస్మృతులు మాత్రమే.

కన్నీళ్ళతో వీడ్కోలు చెబుతున్న నీ జానకి..."

నీలవేణికి మళ్ళీ దుఃఖం పొంగింది.

బస్సులో చంద్రం పక్కన కూర్చుని, బాబును వొళ్ళో కూర్చోబెట్టుకున్న నీలవేణికి, చల్లనిగాలి హాయిగా స్వాగతం చెబుతోంది, కొత్త జీవితంలోకి రమ్మని.

జాన్ చెయ్యి ఊపుతున్నాడు, కన్నీళ్లు తుడుచుకుంటూ.





బతకమ్మ పెద్దనాయుడుగారి తోటలో మామిడిచెట్ల కానుకొని నిలబడింది. రేగిపోయి ముఖంమీద పడుతున్న జుట్టు సందులోంచి కళ్ళు చిట్లించి ఆత్రంగా చూస్తోంది, ఊళ్ళోకి తీసుకుపోయే మట్టి రోడ్డువైపు.

దూరంగా తాటితోపులు, ఆ పైన కారుమబ్బులు. అక్కడెక్కడో పొలాల్లో వరినాట్లు వేస్తున్న కూలీలు, శ్రమను మరచిపోయేందుకు బిగ్గరగా పాడుతున్న పాటల్ని సన్నగా మోసుకొస్తున్న పిల్ల గాలి–ఇవేమీ బతకమ్మ ఆలోచనల దరిదాపుల్లో లేవు

బతకమ్మ ఎండుపుల్లలు ఏరుకోటాని కొచ్చింది తోటలోకి. పసితనాన్ని వదిలి పెద్దరికంవేపు పరుగులు పెడుతున్న వయసు దానిది. పసితనాన్ని వదులుకోలేక పెద్దరికాన్ని పూసుకోలేక ఊగిసలాడుతున్న మనసు దానిది.

దాని వయసుకి నిన్నటివరకూ కడుపులో ఆకలి గురించి మాత్రమే తెలుసు.

కానీ నిన్న మధ్యాహ్నం.

నరాలు జివ్వుమనే ఆకలొకటి ఈ ప్రపంచంలో ఉందని దానికి తెలిసింది. ఆ సంగతి దానికి తెలియజెప్పినవాడు చినబాబు. పెద్దనాయుడుగారి ముద్దుల కొడుకు. పట్నంలో చదువుతున్నాడు

అతను "సదివేది కాలేజీ సదువనీ," అతను పండిన జాంపండులా పచ్చగా, ఎదిగిన అరటిచెట్టులా ఎత్తుగా అచ్చం "చినేమా హీరోలా" ఉంటాడనీ అతన్ని చూడకముందు. గూడెంలో ఆడాళ్లు నూతిదగ్గర, కాలవగట్టున అంట్లు తోము కుంటూ చెప్పుకుంటూన్నప్పుడు వింది బతకమ్మ.

ఆ తరువాత చినబాబుని తలచుకొన్న ప్పుడల్లా అస్పష్టంగా కళ్లముందు ఓ రూపం మెదిలేది దానికి.

ఆ రూపం తనని చూసి నవ్వినట్లు, ఒకోసారి దగ్గరకు తీసుకుని తల నిమిరి నట్లు, ఇంకోసారి రెండు చేతులతో బుగ్గల్ని తాకినట్లు ఓ స్పర్శలాంటి అను భూతి కలిగేది దానికి. అలాంటి అను భూతి కలిగినప్పుడు మత్తుగా కళ్ళు అరమూతలు పడేవి. పడుకున్న కుక్కి-మంచంగానీ దాంట్లో నల్లులుగాని, అప్ప డెప్పుడో పెద్దనాయుడిగారిచేలోగుక్కెడు గంజినీళ్ళకి డబ్బులకోసం కూలీకెళ్ళి ట్రాక్టరు దున్నుతూ అందులోంచి పడి మాంసంముద్దయి కాలి బూడిదయి పోయిన తండ్రిగానీ, అతని చావుతో తమకి కొత్తగా వచ్చిన కష్టం ఏదీ లేక పోయినా అతన్ని తలచుకుంటూ బాధ పడుతూ తిట్టుకుంటూ పనులు చేసుకు పోయే తల్లి మాటలు గాని దాని కలల లోకాల పొలిమేరలు చేరేవికావు.

సరిగ్గా మధ్యాహ్నం అది అలాగే మంచంమీద పడుకొని ఉండగా తల్లి చీపురుతో కొట్టింది. కల కరగక తప్ప లేదు. కలల మేడలోంచి వాస్తవపు పాక లోనికి వచ్చిపడిన బతకమ్మకి తల్లి తనని చీపురుతో కొట్టినందుకు ఏడు పొచ్చింది.

"నన్ను సంపడానికి పుట్టావే లంజ కానా, పొద్దెక్కిపోయినా అలా తొంగుండి పోతే పొయ్యేలా ఎలిగిస్తా ననుకు న్నావే..." లేచి ఎండుపుల్లలు ఏరుకు రావే . గెంజినీళ్ళన్నా కాస్తాను" అంటూ తల్లి మళ్ళా తనని చీపురుతో కొట్టింది.

"పెళ్ళిచేసి అత్తోరింటికి పంపాల్సిన పిల్లకి పెళ్ళీసైనేవు, అత్తోరింటికి పంప లేవు గాని సీపురుతో కొట్టడం ఒచ్చన్న మాట," అంటూ పాకలోకి అడుగు పెట్టేడు సివాద్రి. "ఇదిగో మరదలా నాతో వచ్చేయ్. నీ నడుం ఓ సేతినీ, సెర్నాకోళా ఓ సేతినీ అట్టుకుని బండి కట్టేనంటే-ఎవడ్రా ఆడు సివాద్రా? కలకట్రా? అదేటది బతకమ్మా-చినేమా హీరోయినా? అని ఆశ్చర్యం అయి పోవాల. నీకు మా అత్త ఇంతే - ఇలా ఎండుపుల్లలు ఏరుకురామంటది. పేద

నీళ్లు సల్లమంటది. పేడ పోగుసేసి పిడకలు సైమంటది-కూలికెళ్ళి పైసలొట్టుకు రామంటది. కాని పెళ్ళి మాత్తరం సైదు.. " అంటూ వాడు కుక్కిమంచం వైపు అడుగులు వేయబోతే బతకమ్మ కళ్ళు తుడుచుకొని మంచంమీంచి చివాల్న లేచి మూలనున్న తట్ట తీసుకొని వీధిలోకి వెళ్ళిపోయింది, ఎండుపుల్లలు ఏరుకోడానికి.

సివాద్రని మాస్తే బతకమ్మకి సెడ్డ సిరాకు. ఆడు తాడిలా అంతెత్తుండి గోసీ ఎడతాడు. ఆడికి నున్నగా క్రాపింగ్ తీడం రాదు సరిగదా నెలనెలా గుండు గీయించుకుంటాడు. పిల్చి సున్నపు బొట్లు పెట్టాలనిపిస్తది దానికి "

అదంతా ఒకెత్తు. వాడు బతకమ్మని అదో రకంగా వెర్రిచూపులు చూస్తుంటాడు, అదొక్కటీ ఒకెత్తు.

బతకమ్మకి వాడిచూపులు వికారం తెప్పిస్తాయి. వాడు దానికి పెళ్లవలేదని బాధపడిపోతుంటాడు. దాని తల్లి ఒప్పుకుంటే క్షణంలో పెళ్ళిచేసుకోడానికి సిద్ధంగా వున్నట్లు మాట్లాడతాడు. నిజంగానే తల్లి ఒప్పేసుకుంటే వాణ్ణి కట్టుకోక తప్పదేమో నన్న భయం దానికుంది.

అది నిన్నటిరోజున ఎండుపుల్లలు ఏరుకోడానికి పాకలోంచి బయటికొచ్చి పెదనాయుడుగారి కొబ్బరితోటలోకి వెళ్ళింది.

పెద్దనాయుడుగారు ఊరి కరణం. ఆయన పూర్వము కూడా కరణంగిరీ చేసి చాకచక్యంతో ఆస్తి కూడబెట్టారంటారు పెద్దనాయుడిగారి కొబ్బరి తోటలో కావలసినన్ని ఎండు పుల్లలు దొరుకుతాయి. ఎండు పుల్లలకోసం గూడెం పిల్లలు ఆ తోటనే ఆశ్రయిస్తారు

ఎండుపుల్లలే అయినప్పటికీ అవి పేదజనానికి చాలా అవసరమని తెలిసిన పెద్దనాయుడుగారు వాళ్లను తమ తోటలోకి ప్రవేశించడానికి వీలులేకుండా తోటచుట్టూ దడి కట్టారు. ఎండు పుల్లలు ఏరుతూ తోటలో పట్టుబడ్డ ఇద్దరు కుర్రాళ్ళని చెట్టుకుకట్టి కొట్టించారు. ఆ విధంగా ఆయన తన తోటలో ఎండు చితుకులు ఏరుకోవడం దొంగతనంతో సమానమనీ ఈ అపరాధానికి ఒడిగట్టినవాళ్లు పిల్లలయినా పెద్దలయినా కఠిన శిక్షకు పాత్రులనీ ఊరి పేదజనానికి చాటి చెప్పారు.

తట్టెడు పుల్లలు దొరికితే రెండు రోజులు పొయ్యిలోకి పుల్లల బాధ తప్పుతుంది, పొయ్యిమీద గిన్నెలోకి వెచ్చాల సంగతి ఎలాగున్నా – అందుచేత పేద జనం పెద్దనాయుడుగారి బెదిరింపుకి లొంగలేదు. దడి విరిచి తోటలోకి దూరి చీకటి వేళల్లో గబగబా పుల్లలు ఏరుకుపోయేవారు. ఆ సంగతీ తెలిసింది నాయుడుగారికి. "పేద వెధవలు మొండి

వెధవలు" అని ఓ నిర్ణయానికొచ్చేశా రాయన ఈ మొండివెధవలు తన తోటలో ప్రవేశించి అమూల్యమైన ఎండు పుల్లలు ఏరుకుపోకుండా చేయాలంటే ఏం చేయాలి? తోటనిండా నిప్పులబాట పరచడమా? కత్తుల బోన్లు ఏర్పాటు చేయడమా? ఘోర భీకర క్రూర మృగాన్ని పెంచడమా? అని పెద్దనాయుడుగారు సుదీర్ఘంగా ఆలోచిస్తున్నారు.

బతకమ్మ పెద్దనాయుడుగారి తోటలోకి అడుగుపెట్టేసరికి రెండు ఎండు మట్టలు, దానితోబాటు ఇన్ని డొలకలూ రాలాయి, బతకమ్మ కోసమే అన్నట్లుగా.

బతకమ్మ మరి ఆలస్యం చేయకుండా డొలకల్ని ఏరి తట్టలో వేసుకుంది. మట్టల్ని కొసలు ముడేసి చేత్తోపట్టుకొని తట్టని చంకలో పెట్టుకొని నాలుగడుగులు వేసింది. "ఎవత్తివే నువ్వు దొంగ ముండా" అన్న కేకకి హడలిపోయి కొబ్బరి మట్టల్ని జారవిడిచేసింది.

ఎదురుగా తోటబైట సైకిలుకి స్టాండు వేసి గన్నేరు కొమ్మ విరిచి బెత్తంలా చేతిలో పట్టుకొని పెద్ద పెద్ద అంగలు వేస్తూ బతకమ్మకేసి వచ్చాడు చినబాబు.

అతను ఎత్తుగా ఉన్నాడు అమృతంలో ఊరిన వడియంలా అందంగా డబ్బుతో పులిసిన మనిషిలా పొగరుగా ఉన్నాడు.

అతన్నిచూసి బతకమ్మ రాక్షసుణ్ణి చూసినట్టు జడుసుకుంది

"ఎవర్రూ చూడకుండా ఎండుపుల్లలు ఏరుకుపోదామని వచ్చావా ... అవక్కడెట్టవే దొంగలంజా" అని అరిచాడు, చినబాబు.

బతకమ్మ వణుకుతున్న చేతుల్తో తట్ట వంపి ఎండుపుల్లల్ని కింద కుప్పగా పోసింది. "అలా కాదు, వాటిని సరిగ్గా పోగుపెట్టు" అని మళ్ళా అరిచాడు చినబాబు

బతకమ్మ వణుకుతున్న చేతుల్తో వాటిని జాగ్రత్తగా ఏరి పోగులు పెట్టింది.

చినబాబు వాటిని మళ్ళా తట్టలోకి ఎత్తమని ఆజ్ఞాపించాడు. "ఆ తట్ట నెత్తిమీద పెట్టుకొని మట్టలు చేతుల్లోకి తీసుకొని ఇంటివేపు పద–దొంగతనం చేసినందుకు శిక్ష. అవి జాగ్రత్తగా మా పశువుల కొట్టంలోకి తీసుకురా" అని గన్నేరు కొమ్మని ఝుళిపించాడు.

బతకమ్మకి కన్నీళ్ళు తిరిగాయి. వంగుని తట్ట చంకన జేర్చుకుని కొబ్బరి మట్టలు చేతుల్లోకి తీసుకుంది. మెల్లగా ఈడ్చుకుంటూ నడుస్తోంది.

దానికి పదిహేడేండ్లకు తక్కువ వయసు ఉండదని కనిపెట్టిన చినబాబు పదిహేడేండ్లకి ఉండాల్సిన అందాలు దానిలో ఉన్నాయో లేవో వెతికి ఉన్నాయని తెలుసుకుని "ఆగు" అన్నాడు.

ఆగిపోయింది బతకమ్మ.

చినబాబు దాని దగ్గరగా వచ్చాడు దాని కళ్ళల్లోకి చూశాడు



"నేనెవర్ననుకున్నావే..చినబాబుని" అన్నాడు.

మనసులోంచి చెదిరిపోతున్న రూపాన్ని గబుక్కున గుర్తుకు తెచ్చుకుని తల ఎత్తి చినబాబుకేసి చూసింది బతకమ్మ.

చినబాబు బాగున్నాడు. అచ్చం చినేమా హీరోలాగే ఉన్నాడు. కలలలో తనని చూసి నవ్వినట్టు దగ్గరికి తీసుకున్నట్టు, రెండుచేతుల్తో బుగ్గల్ని తాకినట్టు అనుభూతి కలిగించే చినబాబులాగే ఈ బాబు 'శానా సక్కగున్నాడు' అనిపించింది బతకమ్మకి.

చినబాబు దాని భుజంమీద చెయ్యివేసి దాని చంకలోంచి తట్టతీసి నేలమీద పెట్టాడు. మెల్లగా నడిపించి తాటితోపు చాటుకి తీసికెళ్ళాడు.

భయంతోనే బతకమ్మ యంత్రంలా అతని వెనకే నడిచింది. తాటితోపు చాటుకి ఎవరి దృష్టీ పోదు. దృష్టి పోడా

నికి అసలక్కడికి ఎవ్వరూ రారు. అప్పుడూ రాలేదు.

చాలా కొద్దిసమయంలో బతకమ్మ చినబాబులో కోపాన్నీ, తాపాన్నీ, ఆవేశాన్నీ, కోరికని, లాలిత్యాన్ని. సర్వ మనోవికారాన్నీ చూసింది. అతను లేచి నిలబడ్డాడు.

బతకమ్మ ఇంకా అలాగే పడుకుని ఉంది. చినబాబు సిగరెట్టు వెలిగించి బతకమ్మకేసి చూసి నవ్వాడు చిన్నగా.

బతకమ్మ శరీరంలో అతను అంతకు ముందు అనుభవించిన మాంసం బరువుని తూకం వేస్తున్నట్టుంది అ చూపు.

అలా తూకంవేసి తృప్తిచెందినట్టుంది ఆ నవ్వు.

ఆ తరువాత అతను వెళ్ళిపోయాడు.

తోటలో బతకమ్మ మిగిలిపోయింది. తట్టనిండా ఎండుపుల్లలు రెండు కొబ్బరి మట్టలతో– చినబాబు కోరిక తీర్చినందుకు దానికి మిగిలినవి.

తట్ట నెత్తిన పెట్టుకుని మట్టలు చేతుల్లోకి తీసుకుని ఇల్లు చేరేసరికి "ఎండు పుల్లలు ఏరుకురావడానికి నీకు యింత పొద్దయిందా" అంటూ విరుచుకుపడింది తల్లి.

మొత్తాని కెలాగయితేనేం ఆ రోజు పొయ్యిమండి అన్నం ఉడికింది. కలిగిన దాంట్లో ఆకలి తీర్చుకొని మంచంమీద పడుకుంటే నరాలు జివ్వుమంటూ కొత్త ఆకలి ప్రారంభమైంది దానికి.

ఆ మధ్యాహ్నం చినబాబుతో తోట తోపులో... దానికి చిరుచెమట పట్టింది.

ఎండుపుల్లలు ఏరినందుకు దొంగ నన్నాడు, చినబాబు. ఆ తరువాత తనని నిలువునా దోచుకున్నాడు. దొంగని అన లేకపోయిందతన్ని. పైగా మరోసారి చిన బాబుని చూడాలనుంది.

అందుకే ఆ రోజు కూడా ఎండు పుల్లలు ఏరుకురాడానికి మళ్ళా పెద నాయడుగారి కొబ్బరితోటలోకి వచ్చింది. బుర్రకి నూనెరాసి నున్నగా దువ్వింది. ఓ గన్నేరు పువ్వుని తల్లో తురిమింది. మాసిన జాకెట్టుని పైటకొంగుతో కప్పేసి పరికిణీ పాదాలమీద జారాడే టట్లు కొంచెం కిందికి కట్టింది. తోటలో మామిడిచెట్టుకానుకొని నిలబడింది.

సరిగ్గా నిన్న ఇదే వేళ వచ్చాడు చినబాబు. ఈ వేళ కూడా తప్పనిసరిగా వస్తాడనిపిస్తోంది మనసుకి. అరగంట అలాగే చెట్టుకానుకొని నిలబడి చూసి చూసి అలిసిపోయినట్లుగా నిట్టూర్చింది. ఎండుపుల్లల తట్ట నెత్తిన పెట్టుకుని కోరికని తోటలో చెట్టుకీ, పుట్టకీ, గాలికి ఒదిలేసి భారంగా అడుగులేస్తూ ఇంటిముఖం పట్టింది.

* * *

ఆ తరువాత కూడా బతకమ్మ చాలా సార్లు పెద్దనాయుడుగారి కొబ్బరి తోటలో మధ్యాహ్నం వేళల్లో ఎండుపుల్లలు ఏరి




ఏరి కోరికను పుట్టకీ, చెట్టుకీ, గాలికీ వదిలేసి బరువుగా ఇంటికి వెళ్ళిపోయేది.

మరి కొన్నాళ్ళకి దాని ఇష్టానిష్టాలతో నిమిత్తం లేకుండా దాన్ని సివాద్రికిచ్చి ముడెట్టేశారు.

సివాద్రి పెదనాయుడు గారింట్లో పాలేరుపనికి కుదిరాడు.

త్వరలోనే పెద్ద పాలేరుగా అతనికి ప్రమోషనొచ్చింది.

పెద్దనాయుడుగారు పోయాక ఆయన ముద్దుల కొడుకు చినబాబు ఆ ఊరికి మోతుబరి అయ్యాడు.

పాలేరు పనిచేసి ఎప్పుడన్నా కొంగు నిండా "కామందులిచ్చారంటూ" ఇంత అన్నం పచ్చడి మెతుకులు మూటగట్టు కొచ్చి ఆప్యాయంగా తింటూ ఉంటాడు, సివాద్రి.

"ఎర్రోడు నా మొగుడు ... ఎంగిలి కూడని ఎరక్కుండా తింటున్నాడు" అనుకుంటుంది బతకమ్మ.

అన్నట్టు దానికి మరి ఐదేళ్ళుపోతే ఎండుపుల్లలు ఏరుకురాడానికి ఊరంతా తట్టమోస్తూ తిరిగే బాధ తప్పుతుంది.

అవును - దానికి కూతురు పుట్టింది.

# కథకానిది - కథలాంటిది



జీడిగుంట రామచంద్రమూర్తి

టాంక్ బండ్ మీద నడుస్తున్న చాలా మంది, అక్కడ ఆగి వింతగా చూస్తున్నారు...నీళ్ళల్లో తేలుతోంది శవం... అతనికి ఎంతో వయస్సు ఉన్నట్లు కనిపించటంలేదు. మహా ఉంటే పందొమ్మిదో, ఇరవయ్యో ఉంటాయి...

"ఏం కష్టమొచ్చిందో పాపం!... ఆత్మహత్య చేసుకున్నాడు!"— ఎవర అన్నారు గుంపులోంచి

అసలు ఆత్మహత్యో, హత్యో మన కెలా తెలుస్తుంది?"— మరో పెద్ద మనిషి అనుమానంగా అన్నాడు.

"బాగా చెప్పారు!... అయినా ఈ సినిమాలు చూసి కుర్రాళ్ళు చెడిపో

తున్నారండీ! ... రాత్రి సినీమాలు చూడటం, పగలు స్కూల్లో అమ్మాయిలను ప్రేమించటం!... ఒక హీరో యినూ—ఇద్దరో ముగ్గురో హీరోలు!... దాంతో ఆ హీరోలమధ్య తగూలు!... అలాంటి తగూల్లో ఇరుక్కుంటే ఏముంటుంది ?... ఒకర్నొకరు తన్నుకోవటం ... చంపుకోవటం! ఉడుకు రక్తం కదండీ!... 'లవ్ ఎఫయిర్'లో ఏదో గొడవ వచ్చివుంటుంది!... ఎవరో ఇతగాడ్ని చంపేసి – ఇందులో పారేసి వుంటారు' – చిదంబర రహస్యాన్ని కనిపెట్టిన పోజుపెట్టి – జారిపోతున్న కళ్ళజోడును పైకి తోసుకుంటూ అన్నాడు, నడివయసులోవున్న ఇంకో పెద్దమనిషి...

"మీరన్నదీ పాయింటే! లేకపోతే ఇంత చిన్నవయసులో, హాయిగా ఆడుతూ పాడుతూ చదువుకోవాల్సిన సమయంలో-ఆత్మహత్య చేసుకోవాల్సినంత అవసరం ఏమొస్తుందీ?"— ధృవపరిచాడు మొదటి వ్యక్తి.

సాయంత్రం నాలుగయ్యేవరకూ— ఆ శవాన్ని అలా ఎంతోమంది చూస్తూనే వున్నారు ... ఎవరికి తోచింది వాళ్ళు అనుకుంటూనే వున్నారు... ఆ తర్వాత పోలీసులు వచ్చారు...శవాన్ని బయటకు తీయించారు...

అందరూ అనుకున్నట్టే—ఆ కుర్రాడికి అట్టే వయస్సులేదు...తెల్లటి ప్యాంటు మీద నీలంరంగు షర్టు తొడుక్కున్నాడు ... మెడలో వెండితో చేసిన ఆంజనేయస్వామి బిళ్ళ వేలాడుతోంది.. ప్యాంటు జేబులు రెండూ ఖాళీగా వున్నాయి...చొక్కాజేబులో మాత్రం ఓ కవరుంది...నీళ్ళల్లో తడిసిపోవటం వల్ల కవరూ, అందులోని కాగితమూ, చీకిపోయి వున్నాయి ... కాగితంమీద అక్షరం ఒక్కటీ స్పష్టంగా కనిపించటం లేదు...

ఆ రాత్రే శవాన్ని పోస్ట్‌మార్టంకి పంపించారు ... అప్పటికి అతను మరణించి సుమారు పద్దెనిమిదిగంటలు కావస్తోందనీ— హత్యచేయబడినట్లుగానీ, విషప్రయోగం జరిగినట్లుగానీ సూచనలు లేవుకనుక, అతను ఆత్మహత్యా చేసుకున్నాడనీ— డాక్టర్లు రిపోర్టులో రాశారు...అంతకుముందు కనీసం రెండు రోజులైనా అతను ఆహారం తీసుకొని ఉండకపోవచ్చుననికూడా డాక్టర్లు అభిప్రాయపడ్డారు...

* * *

శంకరం మనసు ఆత్రంగా వుంది...

మరో అర్ధగంటకో, గంటకో న్యూస్ పేపరు వస్తుంది ... అందులో తమ పరీక్షాఫలితాలు పడతాయి...తాను ఈసారి పాసవుతాడు ... పాసయింతర్వాత ఏంచేయాలీ? ... తనకయితే బి.ఏ. చదవాలని కొండంత కోరికగా వుంది...కానీ తన తండ్రి చదివిస్తాడో

లేదో?... ఆ మధ్యెప్పుడో అన్నాడు కూడా-'నాకొచ్చే సంపాదనతో నీకు బి.ఏ. కూడా చెప్పించగలనా?'—అని!

పైగా ఇప్పటికే రెండేళ్లు వృధా అయి పోయిందని పదే పదే విసుక్కుంటు న్నాడు తన తండ్రి...నిజమే మరి! మొదటిసారి కాలేజీలో చదివి పరీక్షలు రాస్తే — రెండు సబ్జెక్టుల్లో ఫెయి లయ్యాడు...మళ్ళీ అంతా చదివితేనే మంచిదని ఎవరో సలహా ఇస్తే—పరీక్ష ఫీజు కట్టి — తనకు ప్రైవేటుకూడా పెట్టించి—ఎంతో డబ్బు ఖర్చుచేశాడు... కానీ, రెండోసారికూడా తాను ఫెయి లయ్యాడు...తండ్రి చిరాకుపడ్డాడు... తాను నిరాశపడ్డాడు!

ఈసారి...మళ్ళీ ఇది మూడో ప్రయత్నం ... ఈసారి పాసవటం ఖాయం...పాసయితే, ఎలాగో కష్టపడి బి ఏ. చదివి ఏదైనా మంచి ఉద్యో గంలో చేరాలి...తన తండ్రికి సాయ పడాలి...

తన తండ్రి...ముసలయ్య, ఆ ఊరి కాఫీహొటల్లో సర్వరుగా పని చేస్తున్నాడు రెండుపూటలా టిఫినూ, ఓ పూట భోజనం పెట్టి—నెలకు మరో ఎనభై రూపాయల జీతం ఇస్తారు— ఆ హోటలువాళ్లు!... అది కాకుండా, తన తల్లి సుబ్బులు, మిషన్‌కుట్టి అంతో ఇంతో సంపాదిస్తుంది... ఆ రాబడులే తమ కుటుంబానికి ఆధారం!... తనకు నాలుగేళ్ళ చెల్లెలుంది...దానికీ చదువు చెప్పించి పెళ్ళిచేయాలి...

ఎన్నో సమస్యలూ, ఎంతో భవి ష్యత్తూ — మరికాసేపట్లో వచ్చే తన పరీక్షా ఫలితాలమీద ఆధారపడ్డాయి...

వీధిలో దూరంగా పిల్లల గొడవ వినిపించడంతో, తన ఆలోచనలకు స్వస్తిచెప్పి—గుమ్మంలోకి వచ్చిచూశాడు శంకరం...

ఎదురింటి కనకయ్యా మేస్టారింటి దగ్గర ఓ కుర్రాడు పేపరు చూస్తు న్నాడు ... చాలామంది పిల్లలు, ఆ కుర్రాడి చుట్టూ గుమిగూడి—తన నంబరు చూడమంటే తన నంబరు చూడమంటూ అల్లరిచేస్తున్నారు...

ఆరాటమో, ఉత్సాహమో తెలియ కుండా మనసును ఉక్కిరిబిక్కిరి చేస్తూంటే, అప్రయత్నంగానే అక్క డకు నడిచాడు శంకరం... పేపర్లో తన నంబరుకోసం వెతుకుతూంటే, చేతులు సన్నగా వణుకుతున్నట్లనిపించింది...

తాను పాసవుతాడు ... అనుమానం లేదు! అయినా, తాను ఎంత కష్టపడి చదివాడనీ?...అన్నం, నిద్రా మానేసి మరీ చదివాడు... అ ఆలోచన వచ్చి స్థిమితపడిన శంకరం, తన నంబరు కోసం పేపర్లో చూశాడు... సెకండ్ క్లాసులో కనిపించలేదు...ఫస్ట్‌క్లాసులో చూసుకున్నాడు...అక్కడా లేదు! మరే మయినట్టూ? ప్రెస్సువాళ్లు ప్రింటు





చేయటం మరచిపోయారా?... లేకపోతే, ఒకవేళ తాను......?

'ఛీ...ఛీ... అలాంటి ఆలోచన వస్తోందేమిటి?...ఏమైనా ఈసారి తాను పాసయితీరాలి ... మళ్ళీ మరోసారి నంబర్లన్నీ చూశాడు... రెండు సబ్జెక్టుల్లోనే తన నంబరు కనిపించింది... అంటే...?...అంటే, మళ్ళీ ఓ'పార్ట్' పోయిందన్నమాట...ఛీ...దరిద్రం... ఇలా జరుగుతోందేమిటి?...

శంకరం కళ్ళల్లోకి కన్నీళ్ల కట్టలు త్రెంచుకుని వచ్చాయి...

వచ్చే దుఃఖాన్ని గొంతులోనే దాచుకుని-అడుగులో అడుగు వేసుకుంటూ మళ్ళీ ఇంట్లోకి వచ్చాడు శంకరం... అప్పటికే తన తండ్రి డ్యూటీకి వెళ్ళిపోయాడు... శంకరం నెమ్మదిగా వంటింట్లోకి నడిచాడు...కొడుకు వాలకాన్ని గమనించిన సుబ్బులు ఆందోళనగా అడిగింది.

"ఏమయిందిరా అలావున్నావ్?"- అని.

"పరీక్ష మళ్ళీ పోయింది"—అంతవరకూ గొంతులోనే ఆగిపోయిన దుఃఖం పెల్లుబికివచ్చింది శంకరానికి.

సుబ్బులు త్రానృడిపోయింది... కొడుకు ఈసారైనా పరీక్ష పాసవుతాడనీ, తండ్రిలా ఏ కాఫీహోటల్లోనో సర్వరులాకాకుండా - మంచి ఉద్యోగం సంపాదించుకుంటాడనీ — క్షణం క్రితం వరకూ కొండంత ఆశపెట్టుకుంది...ఆ ఆశకాస్తా—శంకరం చెప్పినవార్త వినగానే-హరించుకపోయింది...తనకొడుకు రాత్రింబగళ్ళు ఎంత కష్టపడి చదివిందీ తనకూతెలుసు...అయినా దురదృష్టం

తమను వెంటాడుతోంది ... ఎవరు మాత్రం ఏంచేయగలుగుతారు?

ఆ రాత్రి ముసలయ్య ఇంటికి వచ్చే సరికి బాగా పొద్దుపోయింది...

"ఇవాళ 'రిజల్ట్సు' వచ్చాయటగా"- రాగానే అడిగాడు భార్యని. పక్కగదిలో నిద్రపట్టక, చాపమీద అటూ ఇటూ దొర్లుతున్న శంకరానికి ఆ మాటలు వినిపిస్తున్నాయి...

"పరీక్ష ఈసారికూడా పోయింది"- తల్లి జవాబు చెప్తోంది...

ఆ తర్వాత కొన్ని నిముషాలు ఎవరి మాటలూ వినిపించలేదు...అంటే తన తండ్రికి బాగా కోపం వచ్చి వుంటుంది... అలా కోపం వచ్చినప్పుడు ఏమీ మాట్లాడకపోవటం తన తండ్రికి అలవాటు...

"అన్నం వడ్డించాలా ?" తల్లి అడుగుతోంది.

"అక్కర్లేదులే! రాగానే విన్నానుగా శుభవార్త!...కడుపు నిండిపోయింది"-

"దురదృష్టం వాడ్ని అలా వెంటాడుతూంటే వాడుమాత్రం ఏమిచేయగలడు చెప్పండి? అక్కడికీ రాత్రింబగళ్లు శ్రద్ధగానే చదివాడు పిచ్చితండ్రి"- మాతృప్రేమ ఆమె ప్రతి మాటలోనూ ప్రతిధ్వనిస్తోంది...

"ఏంచదివి ఏంలాభం? పైగా బి.ఏ. చదువుతానని పేచీకూడానూ! ఉట్టి కెగర లేనమ్మ స్వర్గానికి ఎగిరిందట... అయినా కాఫీహోటల్లో సర్వరుపని చేసే యోగం వీడి ముఖాన రాసిపెట్టి ఉంటే ఇదెలా పాసవుతాడూ?"

తండ్రి మాటలు విన్న శంకరం దిగులుతో కృంగిపోయాడు. మనసంతా ఏదో వెలితిగా అయిపోయింది.

అసలిలా ఎందుకు జరిగింది?...తన భవిష్యత్తుపై తాను ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు. అవన్నీ ప్రతిమనిషీ-సాదారణంగా పెట్టుకునే అతి సామాన్యమైన ఆశలే తప్ప-అత్యాశలు కానేకావు...

ఒకసారా, రెండుసార్లా?...మూడుసార్లు తన తండ్రికి కోపం వచ్చిందంటే రాదూ? ఇప్పటికే తన చదువుగురించి ఎంతో డబ్బు ఖర్చుచేశాడు... ఇప్పుడు మళ్ళీ ఫీజులుకట్టి తనను చదివించగలడా?

ఇంత కష్టపడి చదివితేనే తాను పాస్ కాలేకపోయాడు ... ఇంక చదువుమీద తనకు శ్రద్ధ ఎలాకలుగుతుంది?

అయినా తాను ఇంతదూరం ఆలోచిస్తున్నాడన్న మాటేగానీ, ఒకవేళ రేపో మాపో, 'సెకండ్ లిస్టంటూ' మరొకటి పేపర్లో రాకూడదా? అందులో తన నంబరు ఉండకూడదా?...ఉన్నా ఉండవచ్చు...మరీ రెండుమూడు మార్కుల్లోనే తన పరీక్ష పోయుంటుంది... వాటిని కలపమని ప్రభుత్వం ఆర్డర్లిస్తే అప్పుడు తాను పాసవుతాడు...తన లాంటివాళ్ళు చాలామంది పాసవుతారు... సెకండ్‌లిస్టు తప్పకుండా వస్తుంది...



చీకటిలో కాంతిపుంజంలా చిన్నమెత్తు ఆశ కనిపించటంతో-శంకరం మనసు కొంచెం తేలికపడింది...

ఆ మర్నాటినుంచీ వరుసగా నాలు గయిదు రోజులు లైబ్రరీకి వెళ్ళి పేప ర్లన్నీ చదవటం మొదలుపెట్టాడు... రెండోలిస్టు రాకపోగా – మోడరేషన్ పద్ధతిన మార్కులు కలిపే ప్రసక్తే లేదని ప్రకటనమాత్రం ఆరోరోజున పేపర్లో వచ్చింది...హతాశుడైపోయాడు శంకరం ... తన భవిష్యత్తేమిటో తనకు తెలిసిపోయింది...ఇంక తనకు చదువుకునే యోగంలేదు...

ఏదైనా ఉద్యోగంలో చేరాలి... తప్పదు!...

కానీ ఎవరిస్తారు ఉద్యోగం?... తనకు అర్హత లేం వున్నాయ్?...తాను ఖాళీగా కూర్చుంటే తనతండ్రి చూస్తూ వూరుకోడు...ఎలాగా కాఫీ హోటల్లో ఏ సర్వరు పనిలోనో పెట్టినా పెట్టగలడు.. కాఫీహోటల్లో అలా సర్వరుపని చేయటం కంటే – కాయకష్టంచేసుకుని బ్రతికినా బ్రతకచ్చు...

హైదరాబాద్‌లో ఎన్నో పరిశ్రమ లున్నాయనీ-అక్కడ ఏదైనా చిన్న ఉద్యోగం ఎలాగైనా సంపాదించుకో వచ్చుననీ-ఆమధ్యే ఎప్పుడో ఎవరో అంటూంటే తాను విన్నాడు...

తానుకూడా హైదరాబాద్ వెడితే- ఎక్కడో అక్కడ తనకు ఓ పని దొరకక్కపోదు...

ఆ నిర్ణయానికి వచ్చిన శంకరం మర్నాడే-ఇంట్లో ఎవరికీ చెప్పకుండా బయల్దేరి హైదరాబాద్ చేరుకున్నాడు.

"ఎక్కడకని పోతాడులే!...వాడే వస్తాడు!"-అని ధీమాగావున్న ముసలయ్య—మూడోనాటికికూడా శంకరం తిరిగి రాకపోయేసరికి కొంచెం ఖంగారు పడ్డాడు... తెలిసినవారికందరికీ కబురు చేశాడు... బంధువులకందరికీ ఉత్తరాలు రాశాడు—'శంకరం అక్కడకు వచ్చాడా?'—అంటూ...

పదిరోజులు గడిచాయి... పదిహేను రోజులు గడిచాయి...అయినా శంకరం జాడ తెలియలేదు...చేతి కందివస్తాడను కున్న ఒక్కగానొక్క కొడుకూ చేయి దాటిపోయినందుకు — దిగులుపడ్డాడు ముసలయ్య...

'అన్నయ్య ఎప్పుడు వస్తాడే?' అని పదే పదే ప్రశ్నించే నాలుగేళ్ళ పసిదానికి ఏ జవాబూ చెప్పలేక గుడ్ల నీరు పెట్టుకునేది సుబ్బులు...

హఠాత్తుగా ఓరోజున - పేపర్లో ఆ వార్త చదివాడు ముసలయ్య..."ఇంటర్ పరీక్షలో ఫెయిలయిన విద్యార్థులకు అయిదుమార్కులు కలుపుతున్నారనీ- అలా మార్కులు కలిపిన తరువాత పాసయ్యే విద్యార్థుల జాబితా త్వరలో వస్తుందనీ"- ఆ వార్త సారాంశం...

ముసలయ్యలో మళ్ళీ కొత్త ఆశలు కొండంత ఎత్తున పెరిగాయి...'రెండో లిస్టులోనయినా శంకరం పాసవుతాడు... ఈపాటికి శంకరం ఎక్కడ ఉన్నా ఆ వార్త చూసే ఉంటాడు-తిరిగి ఇంటికి వచ్చేస్తాడు — అనుకొన్నాడు ... కొడుకు అలా తిరిగిరావాలని కొండమీది దేవుడికి కోటి దణ్ణాలు పెట్టుకుంది సుబ్బులు...

రెండోలిస్టు పేపర్లో వచ్చింది... శంకరం పాసయ్యాడు ... ముసలయ్య సంతోషానికి అవధులు లేవు...

'శంకరం ఈపాటికి తన నంబరు పేపర్లో చూసుకునే వుంటాడు...రేపో మాపో తప్పకుండా తిరిగివస్తాడు'- ఆ ఆశతోనే, నిద్రాహారాలుమానేసి, శంకరంకోసం ఎదురుచూశాడు ముసలయ్య ... రాత్రింబగళ్ళు వీధితలుపు ఎక్కడ చప్పుడైనా శంకరమే వచ్చి వుంటాడని-కళ్ళల్లో వత్తులువేసుకుని మరీ చూసింది సుబ్బులు...

ఒకరోజు...రెండురోజులు...మూడు రోజులు...

రోజులు గడిచిపోతూనేవున్నాయ్... కానీ శంకరం జాడలేదు...ఎవరో సలహా






---

ఇస్తే—పేపర్లో ప్రకటన వేయించాడు ముసలయ్య...

"కనిపించుటలేదు."

ఈ ఫొటోలోవున్న శంకరం అనే పంధొమిదేళ్ళ పిల్లవాడు గత ఇరవై రోజులుగా కనిపించటంలేదు...చామన చాయ రంగు...గిరజాల జుట్టు... ఇంట్లోంచి వెళ్ళేరోజున తెల్లపాంటూ నీలంరంగు షర్టూ తొడుక్కున్నాడు... మెడలో వెండితోచేసిన ఆంజనేయ స్వామి బిళ్ళవుంది...ఆచూకీ తెలిపిన వారికి తగిన బహుమతి ఇవ్వబడు తుంది...

"...బాబూ...శంకరం! నీ పరీక్షా ఫలితాల రెండోలిస్టు వచ్చింది. నువ్వు పాసయ్యావ్...ఎలాగైనా కష్టపడి నీకు బి.ఎ. చెప్పిస్తాను. కోపంమానేసి ఎక్క డున్నా వెంటనే వచ్చేయ్...నీకోసం అమ్మా, చెల్లాయీ బెంగపెట్టు కున్నారు...

...నీ తండ్రి
ముసలయ్య..

ప్రకటన ఇచ్చిన ముసలయ్య, కొడుకుకోసం. ఆతృతతో ఎదురుచూస్తూ వున్నాడు...కానీ ప్రకటన చూసుకుని తిరిగి వచ్చేందుకు శంకరం లేడు!

హైదరాబాదు నగరంలో వారం రోజులపాటు ఉద్యోగంకోసం కాళ్ళరి గేలా తిరిగి, ఇక తనకు ఉద్యోగం రాదని తెలుసుకున్నాక ఆకలిని జయించ టానికి మార్గం కనిపించక—ఆత్మహత్య చేసుకున్నాడు...

ఉద్యోగం రాదని తెలిసినా, రెండో లిస్టు వస్తుందని ముందుగానే తెలిసుంటే శంకరం ఆత్మహత్య చేసుకునేవాడు కాదేమో?...

---

# నేను ఎలక్ట్రాన్



నా గురించి నేను చెప్పుకోవడం బావుండకపోయినా, చెప్పక తప్పటల్లేదు. అసలు చిన్నప్పట్నుంచీ నాది చాలా దుడుకు స్వభావం. దుడుకుగా ఉండడం ఏమంత సులువైన పని కాదు. హైస్కూల్లో వాతలు తేరేటట్లు తిన్న దెబ్బల్ని గురించీ, కాలేజిలోనూ, యూనివర్సిటీలోనూ–నేను యిరుక్కున్న విషమ పరిస్థితులను గురించి చెప్తే, దుడుకుతనంలో సర్టిఫికేట్ సంపాదిం

చడం ఎంతకష్టమో, మీకు తెలుస్తుంది. ఎటొచ్చీ మెదడులో బండతనంలేదు కాబట్టి, చదువులో వెనకబడకుండా అన్ని మెట్లూ అవలీలగా దాటి, చదువు పూర్తయిందనిపించాను.

రోజులు మారిపోయాయి. నేను పోస్టుగ్రాడ్యుయేట్ డిగ్రీ సంపాదించే సరికి, ఉద్యోగాలు నిండుకున్నాయి. ఇంటర్వ్యూలు ఎంత బాగాచేసినా, సిఫారసులు లేకపోవడం మూలాన ఉద్యోగం దొరకలేదు. అన్ని ఆశలూ ఉడిగి పోయిన తర్వాత, ఊరికే గోళ్ళుగిల్లు కొంటూ కూర్చోడం నాకే అసహ్యమని పించింది. నాన్న వ్యవసాయంలోకి దిగ మన్నారు. సరేకదా అని దిగాను. పొలంపని వాళ్ళ ఎదుట గొప్పకోసం, సులువు తెలియకుండా అరకట్టిన ఎడ్లను, ఆదిలించడం నేను మొదటి రోజునే చేసిన తప్పుపని. నల్లెద్దు నా కంటె పొగరుబోతుదవడం మూలాన, కసిదీరా తన్నింది. మోకాలంతా వాచి ఇరవై రోజులు మంచంపట్టాను. మూతి పళ్లు విరగనందుకు సంతోషించాను ఆ నల్లెద్దుకూ, నాకూ పడదన్న సంగతి తెలిసిన తర్వాత, మళ్ళీ పొలంలో అడుగుపెట్టడానికి నాకు మనస్కరించ లేదు. అయినా వ్యవసాయం చెయ్యమని, బ్రహ్మదేముడు నా నుదుట వ్రాయ లేదనుకొంటాను.

ఇంకేం చెయ్యడానికీ తోచక బి. ఇడి. లో చేరాను—మధ్యలో ఏదైనా ఉద్యోగం వస్తే, స్వస్తి చెప్పేద్దామన్న ఉద్దేశ్యంతో. కాని బి. ఇడి. డిగ్రీ కూడా చేతికొచ్చి కూర్చుంది. దాన్ని పట్టుకొని మరో ఏడాది కూర్చున్నాను. బోర్డువాళ్ల ధర్మమా అని ఒక్కుమ్మడిగా ఓ నలభై ఖాళీలు వచ్చాయి. ముప్పై ఆరు ఖాళీలు సిఫారసులవల్లా, నాలుగు ఖాళీలు క్వాలిఫికేషన్లవల్లా భర్తీచేశారు. ఆ నలుగురిలో నేనూ ఒకణ్ణయినందుకు ఎంతగానో సంతోషించాను. మొదటిసారిగా కోరుమిల్లి హైస్కూల్లో పడేశారు. ఆ రోజునుంచీ మొదలైంది, నా బడిపంతులి జీవితం.

చదువుకొంటూన్నప్పుడు, నేను ఎంత పొగరుబోతుగా ఉన్నా, చదువు చెప్పే స్థితికి వచ్చేసరికి, నా విద్యార్థులు పొగరు బోతులుగా ఉండడంమటుకు, సహించ లేకపోయాను. అందులోనూ, అక్షరం ముక్కకూడా రాకుండా దౌర్జన్యంగా ఉండేవాళ్ళను సహించలేకపోయాను. అందుమూలంగా, ఆ ఊరి మునసబుగారి సుపుత్రుడు సుబ్బారావు నాకు నంబర్ వన్ శత్రువయి కూర్చున్నాడు. నాలు గైదుసార్లు వాడిని కఠినంగా శిక్షిం చడంతో, అతగాడి మేనమామ - అంటే ఆ ఊరి ప్రెసిడెంటుక్కూడా కోపం వచ్చింది. దాంతో మా హెడ్మాస్టరు యిరుకులో పడిపోయాడు.

తొమ్మిదో క్లాసు సంవత్సరాంతం

పరీక్షల్లో కాపీ కొట్టకుండా సుబ్బారావు కడ్డుతగిలాను. నేను దిద్దిన ఇంగ్లీషు, లెక్కల పేపర్లలో బండసున్నాలు వచ్చాయి. హెడ్మాష్టరు సుబ్బారావుని పాస్ చేసెయ్యమన్నాడు. అతగాణ్ణి నా యింట్లో కూర్చోబెట్టి ఆ రెండు పేపర్లూ మళ్ళా రాయించమన్నాడు. "దుష్టుల్ని త్వరగా వదిలించుకోడాని కిదో మార్గం! వాణ్ణి తొమ్మిదోక్లాసులోనే ఉంచేస్తే మరో రెండేళ్ళపాటు వాడి బాధలు స్కూలుకి తప్పవు ! వాణ్ణి కనక పదో క్లాసులో పడేస్తే ఒక్కఏడాదిలో వాడి పీడా విరగడవుతుంది." ఇదీ ఆయన సిద్ధాంతం. అందులో నిజం లేకపోలేదు. యూనియన్ లీడర్లని ఆఫీసర్లుగా ప్రమోట్ చేసి, వాళ్ళ కోరలు పీకి వెయ్యడం జరుగుతున్నదే ! అయినా, నా అభిమానం, కర్తవ్యం అడ్డుతగిలాయి "నేను కోరుమిల్లి హైస్కూల్లో పనిచేస్తున్నంతకాలం- ఈ సుబ్బారావునే కాదు - ఏ సుబ్బారావునీ కూడా అగడాలు చెయ్యకుండా ఆపుచేస్తాను. ఈ విషయంలో మీరు నిర్భయంగా ఉండండి !" అన్న నా సమాధానం విని, ఆయన మరి మాట్లాడలేకపోయాడు. సుబ్బారావు తొమ్మిదో క్లాసులోనే ఉండిపోయాడు.

కాని, అనుకొన్నట్టుగా నేను కోరుమిల్లిలో ఉండలేకపోయాను. ఉండనివ్వలేదు. సుబ్బారావు బంధువర్గంలో ఒకాయన తాడిపత్రి ప్రెసిడెంటుగారట. పులిని కోరలుపీకి పిల్లిగాచేసే హస్తవాసి, తలలుమార్చే రాజకీయ చతురతా ఆయనకి ఉగ్గుపాలతోనే పెట్టిన విద్యలట. అందుకని కోరుమిల్లి ప్రెసిడెంటూ, మునసబూ కలిసి నన్ను తాడిపత్రి బదిలీ చేయించారు-నా కోరలు పీకించడానికి ! కూతురి పెళ్ళికి కావలసిన సంబారాలన్నీ సమకూర్చిన ప్రెసిడెంటుగారి ఋణం తీర్చుకోవడం కోసం, హెడ్మాష్టరు ముఖావంగా ఉండిపోయాడు !

కోరుమిల్లినుంచి తాడిపత్రి మకాం మార్చాను. నాకంటే ముందుగా నా వివరాలు తాడిపత్రి చేరటం, నా కాశ్చర్యమనిపించలేదు. నేను ఎటువంటి చిక్కులు తెచ్చిపెడ్తానో ఏమో నన్న భయంతో హెడ్మాష్టరు సతమతమవుతూన్న సంగతి, మొదటి పరిచయంలోనే పసిగట్టాను. నేను గౌరవంగా మాట్లాడ్డంతో, ఆయన చాలామట్టుకు, కుదుటబడ్డాడు మిగిలిన టీచర్లనందర్నీ పరిచయంచేశాడు. అందర్నీ అంచనా వెయ్యడం కష్టమనిపించలేదు. మూడు వంతులు ప్రెసిడెంటువర్గంలోనివాళ్లు, మిగిలినవాళ్లు ఆ ఊరి కరణం మున్సబులకి మద్దతు యిచ్చే ఉద్దేశ్యంగలవాళ్ళయినా, భయంకొద్దీ తటస్థంగా ఊరుకొన్నవాళ్లు.

ఆ రోజు మధ్యాహ్నం విశ్రాంతి

సమయంలో, టీచర్ల రూంలో కబుర్లాడు తుండే సమయంలో, ప్రెసిడెంటుగారి మనిషొకడు వచ్చి, 'ప్రెసిడెంటుగారు మిమ్మల్నోసారి వచ్చి ఆయన్ని కలుసు కోమన్నార'ని చెప్పాడు. నాకు మూడు రోజులవరకూ తీరుబడిలేదని చెప్పి, అతగాణ్ణి పంపించేయడంతో అందరూ అదోలా చూశారు. డ్రాయింగ్ టీచరు అవధాని ఆ రోజు సాయంత్రం, రహస్యంగా నాకు చాలా విషయాలు చెప్పి, 'ప్రెసిడెంటుతో వ్యవహారమంటే కత్తి మీద సాములాంటిది. అందు'ని జాగ్రత్తగా ఉండడ మంచిది!' అని హెచ్చరించాడు.

అవధాని సాయంతో, ఆ రోజే, ఊరి చివరగా ఉన్న ఓ పాతకొంపలో ఓ వాటా, పాతిక రూపాయలకి, అద్దెకు తీసుకొన్నాను. అద్దె తక్కువని వింత పడనవసరంలేదు. ఆ యింట్లో దెయ్యా లున్నాయని ప్రతీతి. ఆ యింటి యజమానికి, పక్కింటాయనకీ కక్షలు. అందుకని పక్కింటాయన చేసిన ప్రచారమని, ఆ యింట్లో దిగిన తర్వాత తెలిసింది. ఏమైతేనేం, ఉండడానికి నా కింత చోటు దొరికింది.

అయితే నేను ప్రెసిడెంటు చౌదరిని కలుసుకొన్నది, మూడురోజుల తర్వాత కాదు. వారంరోజుల తర్వాత! నేను వెళ్ళేసరికి తన లంకంత కొంపలో, ముందు వసారాలో వందిమాగధులమధ్య కొలువుతీర్చి ఉన్నాడు చౌదరి. నన్ను నేను పరిచయం చేసుకొన్నాను. నన్ను కూర్చోమని అడగనూలేదు – నేను కూర్చోనూలేదు. తాపీగా నోట్లోంచి చుట్ట తీసి, "ఏమయ్యా, ఇప్పుడా నీకు తీరుబడి దొరికింది? ! కాని నాకు నీతో మాట్లాడ్డాని కిప్పుడు వీలుకాదు," అన్నాడు హేళనగా. అందరూ ఘొల్లున నవ్వారు. నాకు వళ్లుమండుకుపోయింది. ఆత్మాభిమానం రెచ్చగొట్టింది. "ఈ ఊరి హైస్కూలు హెడ్మాస్టరుగా రున్నంతవరకూ మీతో మాట్లాడ్డానికి నా కేవిధమైన అవసరమూలేదు – రాదు కూడా! ఆ రోజున, మీరు నాకు కబురంపడంలో మట్టుకు ఏం రాచకార్య ముంది కనక? నన్నూ, నా ఆకారాన్నీ చూడాలన్న ఉద్దేశ్యం తప్ప! అదే కనక నిజమైతే ఇప్పుడు మీ కోరిక తీరే ఉంటుంది. మీకు తీరుబడిలేకపోయినా నాకు ఒరిగేదేమీలేదు!" నేనన్నమాటల కక్కడున్న వాళ్ళందరూ అదిరి పోయారు. చౌదరి ముఖం జేవురించింది. తిరిగి సమాధానం చెప్పలేకపోయాడు. ఆయనగార్ని వందిమాగధులకు వదిలేసి, బయటకు దారితీశాను.

నేను గేటు తీసుకొని బయటకు వెళ్లే ప్రయత్నంలో ఉండగా చౌదరి భార్యా, ఇరవై ఏళ్ళ కూతురూ, లోపలికి వస్తూ నా కంటబడ్డారు. గుళ్లోంచి తిరిగి వస్తూ న్నట్లు, వాళ్ల ఆకారాలు చెప్తున్నాయి.

అది ఎటువంటి బలవత్తరమైన ముహూర్తమో కాని, చౌదరి కూతురు నా హృదయంలో ఎగిరి కూర్చుంది! ఆ క్షణంలో నేను ఒకే ఒక్క నిర్ణయానికి వచ్చేశాను. చౌదరి యింటి అల్లుణ్ణయి తీరాలి. అది చౌదరిమీద ద్వేషంవల్ల కాదు. చౌదరి కూతురిమీద నాకు కలిగిన అపారమైన ప్రేమవల్ల!

నేను వలచిన యువతి అందచందాల్ని గురించి, ఒంపుసొంపుల్ని గురించి చెప్పడం, ఏమంత న్యాయం కాదు. నాకు నచ్చిన అందం, ఆమెలో ఉంది. నా మనస్సుని ఆకట్టుకొనే ఆకర్షణ ఆమెలో ఉంది. అంతకంటె నాక్కావల్సిందేముంది?

అవధానిద్వారా మరికొన్ని వివరాలు తెలుసుకొన్నాను ఆమె పేరు వరలక్ష్మి. ఆ ఊరి హైస్కూల్లో స్కూల్ఫైనల్ వరకూ చదివింది. మేనరికాల్లాంటి సంబంధాలేమీ లేవు. ఆ సంగతి వింటూంటే, నా కెంత ఆనందం కలిగి ఉంటుందో, మీ రూహించడం కష్టం కాదనుకొంటాను

రోజులు నెమ్మదిగా నడుస్తున్నాయి. నా వలపుల తలపుల్లో వరలక్ష్మి వీర విహారం చేస్తోంది కలల్లో కన్పించి కవ్విస్తోంది.

ఓ శనివారంరోజు చీకటిపడ్డాక ఏమీ తోచక స్కూలుకు పోయాను, స్కూల్లో నా డ్రాయర్లో మర్చిపోయిన ఓ నవల తెచ్చుకొందామని. అప్పుడే స్కూలు ఆవరణలోంచి ఓ ఖాళీ లారీ బయటకు వస్తోంది. వాచ్మన్ని సంగతేమిటని అడిగాను. మాట తప్పించి ఏదో సొద వాగాడు. అతగాడు మా టీచర్ల గది తాళం తీయగానే, నా నవల తీసుకొని బయటపడ్డాను. నా కేమిటో అనుమానం వేసింది. వరండాలోంచి వస్తూంటే, ధాన్యం వాసనవేసింది. అవధానిదగ్గరకు వెళ్ళి ఆరా తీశాను. ఆ మర్నాడు, ధాన్యసేకరణకోసం ప్రభుత్వాధికారులు వస్తున్నారు. చౌదరి తాలూకు రెండు వందల బస్తాలు స్కూల్లో దాచేశారు రహస్యంగా ఎవరూ అనుమానించలేని చోటు. చౌదరి మాస్టరందరికీ తలో బస్తాడు ధాన్యం యిస్తాడు. తనిఖీదారులు ఊళ్ళోంచి వెళ్ళిపోగానే, ఆదివారం రాత్రి ధాన్యం చౌదరి కొట్లోకి తరలించ బడుతుంది!

నాకు బుర్ర తిరిగిపోయింది! పంచాయితీ రాజ్యం - రామరాజ్యం - ఏమిటో యివన్నీ అర్థంలేని పదాలు. అధికారంలో ఉన్నవాళ్ళు చేసే అవినీతిపనులవల్ల, దేశం యిలా మండిపోతోంది.

ఆ రాత్రి భోజనంచేసిన తర్వాత, యింటి యజమాని సైకిలు తీసుకొని, నాలుగు మైళ్ళదూరంలో ఉన్న మేడిగుట్ట వెళ్ళాను. అక్కడ పోస్టాఫీసు నుంచి, నాకు తెలుసున్న ఓ స్నేహితుడికి కాకినాడ ఫోనుచేసి వచ్చాను. ఆ

రాత్రి ఏదో సంతృప్తి నన్నావరించింది. అజ్ఞాతంగా ప్రభుత్వానికి సహాయం చేశానన్న ఓ గర్వం నాలో విస్తరించింది.

ఆ మర్నాడు జరిగిన సంఘటనలకి నా మతిపోయింది. అధికారులు లౌక్యంగా స్కూలుని తనిఖీ చేసినప్పుడు, ఒక్క ధాన్యపుగింజ కూడా కనబడలేదు ! తాడిపత్రి పోస్టుమాస్టరుమీద నమ్మకం లేక, పక్క ఊరెళ్లి ఫోనుచేసినా ఫలితం లేకపోయింది ! ప్రభుత్వాలిచ్చే జీతాలు సరిపోనప్పుడు, చిన్న జీతాల ఉద్యోగులు, స్థానికంగా ఉన్న బల వంతుల ప్రాపకం సంపాదించలేకపోతే మనుగడ సాగించడం కష్టమన్న సత్యం కొట్టవచ్చినట్లు తెలిసింది. మేడి గుట్ట పోస్టుమాస్టరు నేను ఫోనులో మాట్లాడిన వివరం, ఆ రాత్రే చౌదరికి తెలియచేశా డనుకొంటాను. రాత్రికి రాత్రే ధాన్యం మరో చోటుకి రవాణా అయిపోయింది ?

అయితే నా పరాజయాన్ని నలుగురికీ చాటుకోలేదు. చౌదరికూడా తన విజ యాన్ని చాటుకోలేదు. అయితే చౌదరి నా పరాజయాన్ని నాకు వేలెత్తి చూప కుండా ఉండలేకపోయాడు. ఊరి శివార్లలో ఉన్న రామాలయంలో హరికథ జరుగుతున్నప్పుడు, ఎదురుపడ్డం తట స్థించింది. నన్ను చూసి మందహాసం చేశాడు. ఆ మందహాసంలోనే, వందర్థాలు గోచరించాయి !

క్లాసులో కుర్రాళ్ల యాగీపెట్టడం మొదలుపెట్టారు. వాళ్ళ ప్రతాపాలకి లొంగలేదు సరికదా, వాళ్లని తీవ్రంగా దండించడం చూసి, హెడ్మాస్టరు కూడా భయపడిపోయాడు. పెద్ద శాస్త్రిులు గారని, ఆ ఊళ్ళో బాగా పలుకుబడి ఉన్న పెద్దమనిషి, ఎడాపెడా దానాలు స్వీకరించి, పెద్ద మోతుబరయి కూర్చు న్నాడు. ఆయనగారి సుపుత్రుడు రామ బ్రహ్మం మా స్కూల్లో చదివే విద్యార్థి. అతగాడు హోంవర్కు చెయ్యనందుకు, ఓ రోజు చీకటిపడిన చాలాసేపటివరకు క్లాసులోనే ఉంచేశాను. నేనుకూడా ఉండ వలసి వచ్చింది. చచ్చీ చెడి హోం వర్కుని క్లాసులో పూర్తిచేసి, పదిం టికి ఇంటికి వెళ్ళాడు రామబ్రహ్మం. మర్నాటి ఉదయానికి ఊళ్లో సగంభాగం అట్టుడికి నట్టుడికిపోయింది. నన్ను కర్కోటకుడన్నారు. కిరాతకుడన్నారు. శాస్త్రులిగారి పొలంలో పనిచేసే యాద వులు కొంచెం పొగరుబోతు. వాణ్ణి నా మీదకు ఉసిగొల్పి పంపారు. ఆ రోజు సాయంత్రం నేనూ, అవధానీ 'లక్ష్మీ విలాస్' కాఫీ హోటల్లోంచి బయటకు వస్తోంటే, యాదవులు కావాలని నాతో గిల్లికజ్జా పెట్టుకున్నాడు. చాలావరకు శాంతంగానే సమాధానాలు చెప్పాను. నే నెంతకూ చెయ్యిచేసుకోకపోవడం

చూసి, అతగాడు రెచ్చిపోయాడు. చివరి కింక ఉండబట్టలేక, నన్ను సైడు కాల్వలోకి మెడపట్టి గెంటాడు. నేనెదురు చూసింది కూడా, అటువంటి చర్య కోసమే. తాపీగా లేచి వంటికంటిన బురదని విదుల్చుకొన్నాను. యాదవులు నా కేసి చూసి నవ్వుతున్నాడు, విజయ గర్వంతో. వాడి చూపుల్ని నా చూపుల్లో ఆకట్టుకొని, ఎగిరి డొక్కలో తన్నాను. రోడ్డుమీద వెల్లకిలాపడ్డాడు. పడ్డవాడు మళ్ళీ లేవకుండా, మీదపడి చితక్కొట్టేశాను. ముందు చెయ్యిచేసి కొన్నది వాడే కాబట్టి, నన్నాపడాని కెవరూ సాహసించలేదు. చొక్కాపట్టు కొని, యాదవుల్ని శాస్త్రు లింటికి లాక్కు వెళ్ళాను. నన్ను చూసిన రామ బ్రహ్మం జారుకోబోయాడు. యాదవుల్ని వదిలి, రామబ్రహ్మం కాలరు పట్టుకొని ఆపాను. నశ్యప్పట్టు పట్టోన్న శాస్త్రులు నన్ను చూసి నిర్ఘాంత పోయాడు. "చూడు రామబ్రహ్మం ! నీ తాతలు చేతులు చాచి సంపాదించిన ఆస్తులు వెనుక ఉన్నాయని చదువులు నిర్లక్ష్యం చేస్తే, రేపటిరోజున నువ్వు విచారించక తప్పదు ! దేశంలో వ్యవస్థ మారిపోతోంది.

"మరో దశాబ్దంలోగా వచ్చే మహా ప్రవాహంలో, నీ తాతల ఆస్తులు కొట్టుకుపోతాయి అప్పుడు నీ కండగా విల్చేది నీ విద్యే. ఆ రోజున అవసర మొచ్చి నువ్వు చేతులు చాచినా, భూములు దానాలు చేసేవాడెవడూ ఉండడు ! ఓ పైసాతో చీదరించు కొంటూ విదుల్చుకొంటారు. నేను నిన్ను శిక్షించానంటే, నీమీద కక్షకొద్దీకాదు. నా ధర్మం నెరవేర్చుకోడానికే, వస్తాను. వెళ్ళేముందు మీ అందరికీ ఓ మాట. గురు శిష్యులమధ్య గొడవలకి మెలితి పెట్టి, నాటు పశువుల్ని మీద కుసికొల్పితే, చూస్తూ ఊరుకోడానికి, నేను గాజులు తొడిగించుకోలేదు !" అనవలసిన నాలుగూ అనేసి, రోడ్డుమీదపడ్డాను. ఎవరూ నోరెత్తలేదు. తర్వాత పది రోజులవరకూ, పెద్దశాస్త్రు లింటి పట్టునే ఉండిపోయాడు.

ఈ సంఘటన జరిగిన తర్వాత, మునసబు, కరణాలు, నన్ను ఇచ్చి తంగా వాళ్ళ మనిషిగానే భావించి, దువ్వడానికి ప్రయత్నించారు. మురా తత్వాలు నా కిష్టంలేదని, వాళ్లని దరి చేరనివ్వలేదు.

ఏమిటో ఈ హీరో లక్షణాలు వచ్చేసినా, వరలక్ష్మి విషయంలో ముందంజ వెయ్యలేకపోయాను. కలలు కనీ, ఊహాగానాలుచేసీ విసుగెత్తిపోయాను. రౌడీల నుంచి రక్షించడం, పోట్లగిత్త బారినుండి కాపాడ్డం, చెరువులో మునిగిపోతూంటే రక్షించడం - లాంటి సినిమా అవకాశాలు దొరకలేదు. ప్రయత్నంలేందే, ఏ పనీ సాగదుకదా ! ఊరి శివార్లలో



ఉన్న రామాలయానికి దర్శనాలు ఎక్కువ చేశాను. నాలుగైదుసార్లు వరలక్ష్మి కంటపడ్డది కాని తల్లి కూడా ఉండడంవల్ల సాహసించలేకపోయాను.

రాములవారికి, ఓ రోజున నామీద అనుగ్రహంకలిగింది. వాళ్ళమ్మకి జ్వరం లాంటి దేదో వచ్చి ఉంటుంది! వరలక్ష్మి ఒంటరిగా వచ్చింది. ఒంటరిగా వచ్చినా ఆమె కొచ్చిన ప్రమాదం ఏముంది కనక ? ప్రెసిడెంటు గారమ్మాయిని కన్నెత్తి చూడ్డానికి, ఆ ఊళ్లో దమ్ము లెవరికుంటాయి ?

అస్తమిస్తూన్న సూర్యుడి ఎర్ర దనంలో ఆకాశం అలుక్కుపోయింది. తామరకొలను తళతళా మెరిసిపోతోంది. ఆలయానికి దూరంగా గోచీలు పెట్టు కొన్న కుర్రాళ్ళు, గోలీ లాడుకొంటు న్నారు. రాములవారికి తోడుగా పూజారి

తప్ప, మరెవ్వరూ గుర్తోలేరు. వరలక్ష్మి వంటరిగా దర్శనాని కొచ్చింది. అన్నీ కుదిరాయి. ప్రకృతి బావుంది. సమయం దొరికింది. కాని నాకు ధైర్యమే చాల్లేదు! రాళ్ళను పిండిచేసేవాడి చేతిలో వెన్న ముద్దని పెట్టి నిభాయించమంటే ఎంత కష్టమో, ముక్కుకు సూటిగా మాట్లాడే నాకు, నీలంరంగు డిసెంబరు పువ్వు లాంటి వరలక్ష్మితో మాట్లాడ్డానికి, గగనప్రయత్నమే చెయ్యవలసివచ్చింది. మండపం దిగి కిందికి వస్తూన్న వరలక్ష్మితో, "నేను మీకు తెలుసునను కొంటాను ?" అనగలిగాను. వెధవది, నా ఈ మొదటి మాటల్లోకూడా అహమే తొంగిచూసింది. అన్న తర్వాత, నాలిక్కరుచుకొన్నాను. తెలియదంటే, తలకొట్టేసినట్లేకదా ! వరలక్ష్మి సమాధానంకోసం నేను చూపిన ఆతృత, అంతవరకూ నా జన్మలో మరే విషయంలోనూ చూప లేదు. వరలక్ష్మి ముందుగా కొంచెం తడబడింది. అయినా నిలదొక్కుకుని నెమ్మదిగా అంది – "ఎందుకు తెలి యదు ? మా నాన్నగారికీ, ఆయన స్తోత్రపాఠకులకీ జరిగే ప్రస్తావనలు-మూడొంతులు మీ మీదనే !" వరలక్ష్మి అంత చక్కగా సమాధానం చెప్తుందని నే నూహించలేకపోయాను. వెంటనే నవ్వుతూ అన్నాను – "అంటే, నామీద మీకు దురభిప్రాయం ఏర్పడిపోయిం దనుకొంటాను ?"

వరలక్ష్మి అందంగా నవ్వింది. "మీ రనుకొన్నదే నిజం అయితే మీ మొదటి ప్రశ్నకు సమాధానం యిచ్చే దాన్ని కాను !"

నాలో వెయ్యి ఏనుగుల బలం పుంజు కొచ్చింది. నాలోని ఉత్సాహం హిమా లయను శిఖరాగ్రాలని దాటి పెరిగి పోయింది. ఆ తర్వాత వరలక్ష్మితో - నా కిష్టమైన డిసెంబరు పువ్వుల్ని గురించీ, తామరకొలను గురించీ, పల్లె వాతావరణం గురించీ, ఏం మాట్లాడానో నాకే తెలియదు. ఉన్నట్టుండి వరలక్ష్మి కదిలింది. "ఆలస్యమైపోయింది, వస్తాను." వెళ్లిపోతున్న వరలక్ష్మితో అన్నాను – "ఈ ఊరొచ్చిన ఇన్నాళ్లకు, నాకు నిజంగా చాలా ఆనందంగా ఉంది. నేను ప్రతిరోజూ సాయంత్రం ఇక్కడకు రావడానికి అలవాటుపడిపోయాను." అర్థమైందన్నట్లుగా తలూపి, వరలక్ష్మి వెళ్ళిపోయింది. ఆ రాత్రి నాకు నిద్ర పట్టిందని మీ రనుకొంటే, అది పొరపాటు.

రాములవారి దర్శనం ప్రతిరోజూ చేసేవాణ్ణి. ఒక్కో సాయంత్రం భక్తు లెక్కువైతే, నాకు ఆశాభంగం అయ్యేది. వారం మొత్తంమీద ఏ రెండు మూడు రోజులుమాత్రమే, వరలక్ష్మితో మాట్లా డ్డానికి వీలుపడేది. లేకపోతే చూపుల తూపులే గతి. ఇలా కొన్ని వారాలు జరిగిపోయాయి. ఆ ఊళ్లో తెలివైన

వాడు ఎవడైనా ఉన్నాడూ అంటే — గుళ్ళో పూజారి మాత్రమే. మమ్మల్ని గురించి నోరు మెదపలేదు. మధ్య మధ్యలో తనూ వచ్చి మాతో కూర్చుని ఏవో కబుర్లు చెప్పేవాడు. ఓ రోజున — వరలక్ష్మి రాని రోజున, పూజారి నన్ను నెమ్మదిగా హెచ్చరించాడు. "మీరు ఆలోచించే గమ్యమేమిటి ?" అంటూ. అప్పుడు నే నాయనతో అన్నాను— "మీ కీపాటికి అర్థమయ్యే ఉంటుంది. వరలక్ష్మిని పెళ్లిచేసికొందా మను కొంటున్నాను. ఇంతవరకూ వరలక్ష్మిని నేను ధైర్యంచేసి అడగలేదు. ఆ కార్యభారం మీరు వహిస్తే చాలా సంతోషిస్తాను."

పూజారి ఒక్క క్షణం మాట్లాడలేదు. "ఆ పిల్ల మనసు వేరే అడగాలా ? కాని ఈ వర్ణాంతర వివాహం ఎంత కష్టమో ఆలోచించావా ? అందులోనూ మతాతత్వాలతో నలిగిపోయే ఈ పల్లె పట్టులో, ఈ శుభకార్యానికి వీలుపడ దేమో ?" ఆయన నెమ్మదిగా అన్న మాటలకి నేను వెంటనే సమాధానం చెప్పలేకపోయాను. నే నంతదూరం ఆలోచించలేదు కూడా ! అదే సంగతి అన్నాను. "మీ రన్నది నిజమే. నేనంత దూరం ఆలోచించలేదు. అయినా రాబోయే అవరోధాలను ముందుగానే ఊహించి, బాధపడేవాణ్ణికాదు నేను. ముందుగా నాక్కావల్సింది వరలక్ష్మి అంగీకారం తర్వాత విషయాలు తర్వాత చూసుకొందాం."

ఆ మర్నాడు సాయంత్రం నే నాల యానికి వెళ్ళలేదు. రాత్రి పదిదాటిన తర్వాత, పూజారి వచ్చి తలుపుతట్టాడు. తలుపు తీసి లోపలికి రమ్మన్నాను. గుమ్మంలో నిల్చునే అన్నాడు. "నువ్వూ —వరలక్ష్మి ఒకరికోసం మరొకరు పుట్టారు. అయితే ఈ వ్యవహారం ఎలా నరుక్కొస్తావో, అంతా నీవే ఆలో చించుకో. వరలక్ష్మి, ఆ శుభఘడియ కోసం ఎదురుచూస్తోంది !" అంతటి శుభవార్తని చెవిని పడేసిన పూజారిని కౌగలించుకోకుండా ఉండలేకపోయాను.

రెండురోజుల తర్వాత గుడి వెనక మండపంలో వరలక్ష్మిని కలుసుకో గలిగాను. వణుకుతున్న చేతులతో వరలక్ష్మి జడలో గులాబీలు తురుము తోంటే, కిసుక్కున నవ్వింది. ఆ నవ్వే, కోటి రాగాలై నన్ను ముంచేసింది.

ఇక్కడ వరలక్ష్మితో ఎన్నో మధుర క్షణాలు గడిపేస్తున్నా, అక్కడ స్కూల్లో నాకు ప్రతిఘటన ఎక్కు వవడం మొదలైంది. హెడ్మాస్టరు మింగలేకా, కక్కలేకా బాధపడ్డం మొదలుపెట్టాడు. మళ్లీ ఇంకోసారి, పెద్దశాస్త్రులు కొడుకు రామబ్రహ్మన్నీ, వాడి నేస్తగాణ్ణీ దండించవలసి వచ్చింది. ఆ నేస్తగాడి తండ్రికూడా బాగా పలుకు బడి ఉన్న పెద్దమనిషి. ఆ ఊరి మాల

గూడెం అంతా అతని చేతుల్లో ఉంది. అగ్రహారంలో, పెద్దశాస్త్రులుకి మంచి పట్టే ఉంది. చౌదరికి, ఓట్లదృష్ట్యా వీళ్ళిద్దరూ కావల్సినవాళ్లు! వీళ్ళిద్దరూ తమ పరువు గంగపాలయిందని, యిద్దై పోయారు. చౌదరి తన గ్రామం పరువే మట్టికొట్టుకుపోయిం దనుకోవడంతో, నేను తను పిలిపించినా రానన్న సంగతి తెలుసు కాబట్టి, తనే ఓ రోజున నన్ను ఫుట్ బాల్ గ్రౌండ్‌లో బెదిరించాడు. "నువ్వు మమ్మల్నందర్నీ యిరకాటంలో పెడ్తున్నావు. ఇలాగైతే నిన్నిక్కణ్ణించి బదిలీచేయించవలసి వస్తుంది!"

అసమర్థుడైన హెడ్మాస్టరుకింద పని చెయ్యడం, నాకూ యిదిగానే ఉంది. అయితే ఈ ఊర్నించి బదిలీ వస్తే, నా జీవిత స్వప్నం ఏంకాను? వరలక్ష్మి లేకుండా ఎలా బతికేది? వాడి చూసి, చౌదరి ఆత్మాభిమానం దెబ్బతినేలా ఓ విసురు విసిరాను. "మీ బావగారు, మీచేత నా కోరలు పీకించడానికి నన్నిక్కడికి బదిలీ చేయించారు. మీ దగ్గర నెగ్గుకు రాగలిగినప్పుడు, నన్నె క్కడికి బదిలీచేసినా భయంలేదు. ఏదో మాస్టారుగా కుర్రాళ్ళని దండిస్తే అది మీరు వ్యక్తిగతంగా ఎందుకు తీసుకొం టున్నారో బోధపడటంలేదు. మీకూ, నాకూ మధ్య గెలుపు ఓటమిల ప్రసక్తి లేకపోయినా, మీ బావగారూ, అనుచరులూ, మిమ్మల్ని చూసి నవ్వుతారు. ఎంచేతనంటే ఈ బదిలీ నాకు శిక్షకాదు. మీ గౌరవానికి పరీక్ష!" చౌదరి కళ్లలో ఎరుపు చూసి నేను కొంచెం జంకిన మాట వాస్తవమే. మాట్లాడకుండా వెళ్లి పోయాడు. నాకు తెలుసు – చౌదరి నా బదిలీ గురించి యింక మాటెత్తడని. వియ్యంమాట దేము దెరుగు కాని, అన్నీ కయ్యాలకే అవకాశాలు వస్తున్న నా దుర దృష్టాన్ని గురించి ఆలోచించి బుర్ర పాడుచేసుకొన్నాను.

ఎంత ఆలోచించినా, కొన్ని పనులు జరగడమనేది అసంభవం. అయితే, ఒక్కోసారి అనుకోకుండా జరిగిన సంఘటనలు, మన ప్రయత్నాల్ని సులువుగా నెరవేరుస్తాయి. నా విషయంలో సరిగ్గా యిదే జరిగింది.

ఓ రోజున వరలక్ష్మి, నేనూ ఆలయం దగ్గరున్న తామరకొలను గట్టున చెయ్యీ చెయ్యీ పట్టుకొని నడుస్తూ, చౌదరి పాలేరు కుర్రాడు 'వెంకటేశు' కళ్ళపడిపోయాం. వరలక్ష్మి బెదిరిపోయింది. మరో అరగంటకల్లా ఈ వార్త చౌదరి కందిపోతుంది! అనవసరంగా గొడవపడి నవ్వులపాలు కావడం నాకూ యిష్టంలేదు ఏదో అదృశ్యమైన శక్తి, నా కా క్షణంలో గుండె ధైర్యాన్నిచ్చింది. అప్రయత్నంగా వెంకటేశుని పిల్చాను. తె బోతూ, యిబ్బందిగా దగ్గర కొచ్చాడు. వెంకటేశు భుజాన్ని తట్టి అన్నాను–

"నువ్వు చూసిన సంగతి మీ అయ్య గారికి చెప్పకుండా నువ్వుండలేవని నాకు తెలుసు. ఆయనగారి ఉప్పు తిని బతుకుతున్నందుకు, ఈ సంగతి ఆయన చెవిని పడేయడం నీ ధర్మం! తప్పదు! కానీ మీ అమ్మాయిగారి పరంగా నే నొక్కటి అడుగుతున్నాను. రేపుదయం ఎనిమిదింటికి నా దగ్గరకు రా. ఆ దెయ్యాలకొంప నీకు తెలిసే ఉంటుంది. నీతోపాటు నేనూ, మీ అయ్యగారింటికి వస్తాను. చెప్పవలసిందంతా ఎదురు గుండానే చెప్పు. అయితే ఈ లోపుగా ఎవరితోనూ ఈ సంగతి చెప్పనని ప్రమాణం చెయ్యి. ఏమంటావు ?" వెంకటేశు వరలక్ష్మివైపు చూశాడు. వరలక్ష్మి కళ్ళలో ఏం అభ్యర్థన చూశాడో కాని, వెంకటేశు యిబ్బందిగా తల ఆడించాడు. మరుక్షణంలో అక్కణ్ణించి కదిలి వెళ్ళిపోయాడు. నన్ను ప్రేమిస్తున్నట్లుగా తన తండ్రికి ధైర్యంగా చెప్పగలిగితే చాలని వరలక్ష్మికి నూరిపోసి యింటికి పంపిం చేశాను.

అక్కణ్ణించి తిన్నగా హెడ్మాస్ట రింటికి వెళ్ళాను. "మీ అవసరం ఎంతైనా నాకు కలిగింది. మిమ్మల్ని నా పరంగా చౌదరి గారింటికి వెళ్ళమని కోరుతున్నాను." ఉపోద్ఘాతంగా నే నన్న మాటల కాయన నవ్వుతూ, "ఎందుకు? క్షమార్పణ లందచెయ్యడానికా ?" అన్నాడు.

"ఏం తప్పుచేశానని ? తప్పుగా ప్రవర్తించే కుర్రాళ్ళని దండించి నందుకా ? ఈ విషయమై ఆయనతో అప్పుడే మాటలు జరిగాయి కూడా ! మిమ్మల్ని వెళ్ళమన్నది వేరే పనికోసం. వరలక్ష్మిని నా కిచ్చి పెళ్ళిచెయ్యమని అడగడంకోసం !" నా మాటలు విని ఆయన కొయ్యబారిపోయాడు. హాస్యాని కన్న మాటలు కాదని ఆయన గుర్తిం చాడు. తేరుకొని తాపీగా అన్నాడు- "నేను పిల్లలు కలవాణ్ణి. ఏదో నా మానాన నన్ను బ్రతకనియ్యి ! ఇప్పటికే మీ యిద్దరిమధ్యా నలిగి యాతనపడ్తున్నాను. ఈ రాయబారం కనక నేను చేస్తే, నీ పెళ్లిమాట ఎలా ఉన్నా, వచ్చే నెలలో జరగబోయే నా కూతురి పెళ్లి ఆగిపోతుంది. చౌదరిగారు ఈ విషయంలో నాకు చాలా సహాయం చెయ్యబోతున్నారు. ఈ భారం నువ్వు ఎవరి నెత్తినో పెట్టేకంటే, నువ్వే స్వయంగా వెళ్ళడం ఉత్తమం !"

అనుభవాన్ని కాచి వడబోసి అన్న మాటలు. నాకు నిజమే ననిపించింది.

మర్నా డుదయం వెంకటేశు వచ్చాడు. వస్తాడో, రాడో నన్న అను మానం కలిగినా, 'రాకేం చేస్తాడు ?' అన్న మొండిధైర్యంతో కూర్చున్నాను. "మీతో మాట్లాడవలసిన అవసరం రాదనుకోవడం పొరపాటే అయి పోయింది. ఈ రోజున మీతో మాట్లాడ

వలసిన అవసరం వచ్చింది. వెంకటేశు, మీ కీ ఉత్తరం యిచ్చిన తర్వాత ఓ సంగతి చెప్తాడు. ఓ అరగంటలోగా నేనూ వచ్చి మిమ్మల్ని కలుసుకొంటాను" అని రాసి ఉంచిన ఉత్తరాన్ని వెంకటేశు కిచ్చి "మీ అయ్యగారి కీ ఉత్తరం యిచ్చిన తర్వాత, నిన్న నువ్వు చూసిన సంగతి నిర్భయంగా చెప్పు. నీ వెనక నేనూ వస్తున్నాను", అని చెప్పి పంపించాను.

అక్కడే బ్రహ్మాండం బ్రద్దలయ్యిందో నాకు తెలియదు! చౌదరి ఏ ప్రళయ కాల నృత్యంచేశాడో నాకు తెలియదు! కాని నేను వెళ్లేసరికి, వెంకటేశు గజగజలాడిపోతూ ఓ పక్కగా నిలబడి ఉన్నాడు. లోపలి గుమ్మందగ్గర వరలక్ష్మి నిర్లిప్తంగా నిల్చుని ఉంది. ఆమె నల్లటి బుగ్గలమీద కూడా తట్లు కనిపించాయంటే, చౌదరి ఎంత బలంగా చెయ్యి విసిరాడో ఊహించుకోగలిగాను. చౌదరి ముఖమంతా కందగడ్డలా చేసికొని, ఉడికిపోతున్నాడు. "వెంకటేశుకంటె మధ్యవర్తి నా కీ గ్రామంలో దొరకలేదు. మీకు సంగతి తెలిసే ఉందనుఉంటాను. వరలక్ష్మిని పెళ్లిచేసికొందామనుకొంటున్నాను," నాకున్న ధైర్యాన్నంతా కూడదీసుకొని, ఒక్కొక్కమాటా బలంగా అన్నాను.

"నువ్వు అడగ్గానే చేతిలో పెట్టడానికి, ఇదేమీ కూరగాయల బేరం కాదు. నా పరువు ప్రతిష్ఠలు నట్టేట్లో ముంచడానికి నువ్వు కంకణం కట్టుకొన్నట్లున్నావు. నా గుండెలమీద కుంపటిలా కూర్చున్న నువ్వు, శాశ్వతంగా నా నట్టింట్లో అడుగుపెట్టడం ఈ జన్మలో జరగనిపని!" చౌదరి అరుస్తూ అన్నాడు.

"వరలక్ష్మి, నేనూ పరస్పరం ప్రేమించుకొన్నాం. వరలక్ష్మి శ్రేయస్సే మీ ధ్యేయమైతే, ఈ వివాహానికి మీరు అడ్డుచెప్పకూడదు! చెప్తున్నారూ అంటే, కారణం—కుల మత భేదాల్ని విసర్జించలేని మీ పాతకాలపు బూజుపట్టిన భావాలా? లేక బంధుకోటిలోనూ, ఆశ్రితవర్గంలోనూ అలుసైపోతారన్న భయమా?" ఈ ఉద్రిక్త పరిస్థితిలో, అక్కడకు చేరిన కొంతమంది స్తోత్రపాఠకుల్ని నేను గమనించలేదు. వాళ్ళకి విషయం బోధపడే ఉంటుంది. చౌదరి పిచ్చివాడిలా కేకలు వేస్తూ, "నీ ప్రశ్నలకు సమాధానం చెప్పవలసిన అవసరం నాకు లేదు. ఈ ఊళ్లో నీ మొహం కనబడ్డానికి వీల్లేదు, జాగ్రత్త!" అని, పక్కగదిలోకిపోయి తలుపులు మూసుకొన్నాడు. అక్కడ చేరిన వాళ్ళందరూ చల్లగా జారుకొన్నారు. నేను మూసిన తలుపు దగ్గరగా వెళ్లి, "మీరు కోపంగా ఉన్నారు – ఈ వివాహం జరిగితే, మీకు బంధువర్గం కొంత యిబ్బంది కలిగిం




చినా, రాజకీయరంగంలో మట్టుకు మీ పేరు మరింత ప్రకాశిస్తుంది. ఆలోచించుకోండి. నేను సాయంత్రం మళ్ళీ వస్తాను," అన్నాను గట్టిగా. తట్లుతేరిన వరలక్ష్మి బుగ్గలమీద నిమిరి, ధైర్యంగా ఉండమని నెమ్మదిగా చెప్పి, చౌదరి యిల్లు వదలి వెళ్ళాను.

మరో గంటకల్లా ఊరంతా అట్టుడికి నట్టుడికిపోయింది. చిలవలు పలవలుగా పెరిగి, చైనాదేశపు భయంకర విష సర్పంలా, ఊరంతా మా సంగతే ఆక్రమించింది. స్కూలుకి సెలవుపెట్టి, రామాలయానికి పోయాను. పూజారి బలవంతంమీద యిన్ని మెతుకులు తిన్నా, సహించలేదు. మధ్యాహ్నం అవధాని రొప్పుకొంటూ వచ్చాడు. "ప్రమాదం ముంచుకొస్తోంది. నువ్వు చౌదరితో ఘర్షణపడ్డ సంగతిని మునసబు కరణాలు వాడుకో జూస్తున్నారు. ఈ రాత్రికి నిన్ను కొట్టించడానికి, వాళ్లన్ని ఏర్పాట్లూ చేశారు. అయితే ప్రజలకి, చౌదరి ఈ ఘాతుకం చేయించినట్లు కనపడ్తుంది. చౌదరిమీద కసి తీర్చుకోవడానికి నిన్ను ఎరగా వేస్తున్నారు. నువ్వు రెండో కంటివాడికి తెలియకుండా వెంటనే ఊరు విడిచి వెళ్ళిపో. ఈ రహస్యం నా కెలా తెల్సిందని అడగొద్దు!" చెప్పవలసింది చెప్పి, తన పని అయిపోయినట్లుగా అవధాని హడావుడిగా వెళ్ళిపోయాడు

ఆ సాయంత్రం చౌదరి యింటికి అన్నట్లుగానే వెళ్లాను. వెంకటేశు యింకా అక్కడే ఉన్నాడు. లోపలి గదిలోంచి వరలక్ష్మి ఏడుపు వినవస్తోంది. మరో గదిలో మొగుడి కేదో నచ్చచెప్తోందనుకొంటాను, వరలక్ష్మి తల్లి. "వెంక

చేశూ, మీ అయ్యగార్ని పిలు," అన్నాను. వెంకటేశు కూర్చున్న చోటు నుండి కదల్లేదు. నా గొంతు వింటూనే, వరలక్ష్మి బయటకు వచ్చింది. ఏడ్చి ఏడ్చి కళ్ళు వాచిపోయి ఉన్నాయి. వరలక్ష్మి చెయ్యిపట్టుకొని, ఆమె తల్లి దండ్రులున్న గదిలోకి దారితీశాను. నన్ను చూస్తూనే, చౌదరి పళ్ళుకొరు కుతూ, మంచం దిగాడు. చౌదరి ఏదో అరవకముందే, నేనే అన్నాను. "ముఠా తత్వాలతో నలిగిపోతున్న మీ గ్రామంలో జరగబోయే దారుణాన్ని చెప్పడానికి వచ్చాను. మనిద్దరిమధ్యా పెద్ద ఘర్షణ జరిగిందని ఊరంతా పాకిపోయింది. నన్ను కొట్టించడానికి మీ ప్రతిపక్షం వాళ్ళన్ని ఏర్పాట్లూ చేశారు నన్ను కొట్టించిన నేరం మీ మీదకు రావడం సహజం ! ఇదీ వాళ్ళు వేసిన పథకం. అంతమంది కలిసి నన్ను కొట్టించాలను కొంటే, నే నొక్కణ్ణే ఎదిరించలేను. నాకు చావంటే భయంలేదు. కాని యిప్పుడు చావడానికి, నా కిష్టంలేదు. ఎంచేతనంటే, నేను లేకుండా వరలక్ష్మి బ్రతకలేదు. అది నా కిష్టంలేదు మీకూ యిష్టంలేదనుకొంటే, నన్ను రక్షించే భారం మీదే !" మాటల్లో మడత పేచీ పెట్టి, అక్కడే ఉన్న కుర్చీలో కూల బడ్డాను. నా కాళ్ళను పెనవేసికొని, వరలక్ష్మి నేలమీద కూర్చుండిపోయింది.

నా మాటల్లోని నిజం, చౌదరి హృద యంలో నాటుకుపోయింది. ముఖంలో తొట్రుపాటు గమనించాను. వరలక్ష్మి వైపు చూశాను. మమకారం పొంగు కొచ్చింది మొహంలో మార్పు కనిపిం చింది. "నువ్వు బయటకు రాకు ! ఇక్కడే ఉండు. గంటలో వస్తాను," అని గాలిలో మాటలు వదిలేసి, చౌదరి బయటకు వెళ్ళిపోయాడు. నేను చెప్పింది నిజమో, కాదో, విచారించ డానికి వెళ్ళాడని తెలుసు. వరలక్ష్మి తల్లి మమ్మల్నిద్దరినీ ఆప్యాయంగా చూసి, మా మానాన మమ్మల్ని వది లేసి, వంటింట్లోకి వెళ్ళిపోయింది.

బాగా చీకటిపడిన తర్వాత చౌదరి తిరిగి వచ్చాడు. పొలంనుంచి ఓ అర డజనుమంది కమతగాళ్ళు వచ్చి, యింటికి ముందూ వెనకా కాపలా ఉన్నారు. నేను చౌదరి యింట్లోనే ఉన్నట్లు పైవాళ్ళకి తెలియకపోయినా, ముందు జాగ్రత్తలు తీసుకొన్నాడు.

"పద నాతో భోంచేద్దువుగాని," అన్నాడు ముక్తసరిగా. "తీరా యింత దూరం వచ్చిన తర్వాత, కతికితే అతక దేమో అన్న భయంగా ఉంది !" అన్నాను. చౌదరి నవ్వకుండా ఉండలేక పోయాడు. "నువ్వు నిజంగా అసాధ్యు డివే ! ఆ భయం అక్కర్లేదు, భోజ నానికి లే ! వరం, నువ్వు చెప్పి చూడు !" అన్నాడు. వరలక్ష్మి కళ్లలో వెయ్యిజ్యోతుల వెలుగు ! నన్ను చెయ్యి పుచ్చుకుని లాక్కువెళ్ళింది. భోజనం చేస్తూంటే చౌదరి అన్నాడు. "నేను ఎంత రాజీపడదామనుకొన్నా,మనుస్సు కుదరటల్లేదు. నా చేతులమీదుగా ఈ

పెళ్ళి జరిగించలేను. నువ్వు వరలక్ష్మిన్ని పట్నం తీసుకుపోయి, రిజిస్టర్ మేరేజి చేసుకో !" నా విస్తట్లో నెయ్యి వడ్డిస్తూన్న వరలక్ష్మి చేతిలోంచి, గిన్నె జారిపడింది. "మీ అంగీకారంతో జరిగినా, లోకం దృష్టిలో దొంగతనంగా పారిపోయి, పెళ్లి చేసికొన్నట్లుండడం నా కిష్టంలేదు. అది మీకూ_డా ఏమంత గౌరవం కనక ? నలుగు రెదురుగుండా మీరు నాకు వరలక్ష్మిని కన్యాదానం చేయవలసిందే !" నే నన్న మాటలకి చౌదరి కొంతసేపటివరకూ సమాధానం యివ్వలేదు. "సరే నీ యిష్టప్రకారమే జరుగుతుంది. నువ్వన్న మాటల్లో నిజం లేకపోలేదు !" అన్నాడు. వరలక్ష్మి వాళ్ళ నాన్న విస్తట్లో గిన్నెడు పెరుగూ బోర్లించింది !

ఆ మర్నాడు నలుగురి సమక్షంలోనూ, రామాలయంలో నాకూ, వరలక్ష్మికి పెళ్లి జరిగిపోయింది. ఊరంతా ముక్కు_మీద వేలేసుకొంది.

అయితే పాపం, నేనుండే యింటి యజమానిని, నా ఆచూకీ చెప్పమని నాలుగు తన్నారట - నన్ను తన్నవలసిన రాత్రి ! ఆయన్ని క్షమించమని కోరాను. మమ్మల్నిద్దర్నీ మనసారా దీవించాడు. అంతకంటె కావలసిందేముంది ?

మారుతున్న వ్యవస్థలో, వర్ణవిభేదాలని విసర్జించలేనప్పుడు కొంత కష్టం కలగక మానదు. నా తల్లిదండ్రులకి కొంతకాలం దూరం అయ్యాను అయితే వరలక్ష్మి ఆడపిల్లను కన్నతర్వాత రెండు కుటుంబాలూ దగ్గరపడ్డాయి.

అధికార దాహం ఉన్న మనిషి, తన వారసుడు కూడా గట్టివాడుగానే ఉండాలని చూస్తాడు. అందుకనే, చౌదరి నన్ను అల్లునిగా చేసుకోగలిగాడు. ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే, నే నిప్పుడు రాష్ట్ర శాసనసభ్యుణ్ణి ! కారణం — నేను ప్రెసిడెంటు గిరీ వెలిగించినప్పుడు, ఊరు బాగుపడింది. మురాతత్వాలు సమసిపోయాయి. వర్ణాంతర వివాహాలు దగ్గరుండి జరిపించాను. శ్రమదానాన్ని ఆదర్శంగా చూపి, ఊరి యువకుల్నందర్నీ ఒక త్రాటిమీద నడిపించాను. ఫలితంగా చెరువులు బాగుపడ్డాయి. రోడ్లు బాగుపడ్డాయి. పంచాయితీ రాజ్యాన్ని రామరాజ్యంగా నడిపాను.

అన్నిటికంటె సంతృప్తికరమైన విషయ మేమిటంటే — అధికారం చేపట్టటానికి, అక్రమమార్గా లవసరంలేదని నిరూపించాను.

"నిన్ను మంత్రిగా చూడాలయ్యా !" అంటాడు మామ, చౌదరి. ఈ రాజకీయ పరమపద సోపానపటంలో పాములవాత పడకుండా, నిచ్చెన మెట్లెక్క_డానికి- ప్రజాసేవే ఆదర్శంగా, ఆయుధంగా నమ్ముకొన్నాను నేను. ఏమవుతుందో చూద్దాం !

---




(గత సంచిక తరువాయి)

## 9

మధ్యాహ్నం వేళ.

చలపతిరావు భోజనంచేసి కునుకు తీస్తున్నాడు. కవిత, కల్పన యింట్లో లేరు. ఇద్దరూ నాగార్జునసాగర్ నుంచి తిరిగి వచ్చారు. ఒక్క పూట కూడా యింట్లో వుండరు. స్నేహితులతో సినిమాలకో ఎక్కడికో అక్కడికి తిరుగుతూనే వుంటారు. చేసే మనిషి యింట్లో ఎదురుగా వుండేసరికి, వంటవాడు పెళ్ళికి వెళ్ళాలనే సాకుతో ఏకంగా వారం రోజులు శలవు పెట్టేసాడు. చేతినిండా ఏదో ఒక పని లేకపోతే తోచని శారదకి, వంటపని విసుగ్గా కాని, అలసటగా కాని అనిపించలేదు.

అప్పటివరకూ చలపతిరావుగారికి పుస్తకం చదివి వినిపించిన శారద, ఆయన కునుకుతీయటంతో పుస్తకం మూసి లేచి వచ్చింది. ఇంతలో వీధి తలుపులు టకటక లాడినాయి.

శారద వెళ్ళి తలుపు తీసింది!

ఎదురుగా సీర్కావిపంచె, పొట్టి చేతుల చొక్కా ధరించిన ఒక పల్లెటూరు ఆసామి నిలబడివున్నాడు ఆయన చేతిలో సంచీవుంది పక్కన ముగ్గురు చిన్నపిల్లలు వున్నారు.

"అనసూయమ్మగారున్నారా!" అని అడిగాడు ఆసామి.

"లేరు. వూరెళ్ళారు," అంది శారద.

"ఎప్పుడు వస్తారు ?"

మూడు నెలలవరకూ రారు."

"ముడు నెలలా ?"

"అవును, ఫారెన్ వెళ్ళారు."

ఆసామి అర్థంకానట్టు కళ్లు చిట్లించాడు.

"ఆ వూరు ఎక్కడ ?"

శారద అతనికి అర్థంకాలేదని గ్రహించింది.

"మన దేశంకాదు. విదేశం వెళ్ళారు."

అతను చిక్కులో పడ్డట్టుగా బుర్ర గోక్కున్నాడు

శారద, అతని ప్రక్కన నిలబడిన ఆడపిల్లల్నే చూస్తోంది. ముగ్గురి మధ్యా ఎక్కువ వయసు తేడా లేకపోవటంతో దాదాపు ఒకే వయసుగా కన్పిస్తున్నారు. వాళ్లు ఆ యింటిని, శారదని విస్ఫారిత నేత్రాలతో చూస్తున్నారు.

"ఆరి అమ్మాయిల్ని పిలవండి," అన్నాడతను.

"వాళ్ళు కూడా యింట్లో లేరు. ఎక్కడికో వెళ్ళారు."

"ఎప్పుడు వస్తారు?"

"తెలియదు "

"ముసలాయన వుండా లే_" సందేహంగా చూసాడు.

"ఆయన నిద్రపోతున్నారు. ఏం పనో చెప్పు. అవసరం అయితే లేపుతాను."

పల్లెటూరి ఆసామి ఆ చిన్నపిల్లల్ని చూపిస్తూ, "యీ బుల్లెమ్మలు అనసూయమ్మగారి మేనకోడళ్ళు యీరి అమ్మమ్మ చచ్చిపోయింది యీరి అత్త యీళ్ళని నన్ను యిక్కడ దింపి రమ్మనమని పంపించింది !"

శారద వాళ్ళవైపు పరిశీలనగా చూసింది భవానీప్రసాద్ పిల్లలు కాబోలు వీళ్ళు! అనసూయమ్మగారు వూరు వెళ్ళేముందు ఒకసారి వీళ్ళ సంగతి వచ్చి ఆవిడ చిరాకుపడటం గుర్తుకువచ్చింది.

"మీరెవరు !" శారదని ఎగాదిగా చూస్తూ అడిగాడతను.

"ఈ యింట్లో వుంటాను. అనసూయమ్మగారు కూతుళ్లకి సాయంగా వుంచి వెళ్ళారు "

ఆసామి అట్లాగా అన్నట్లు తలూపాడు.

"సరే, యీ పిల్లలి వుండనీయండి. నేను మళ్లా వస్తాను. ఇదుగో పెద పాపా ! చెల్లాయిల్ని తీసుకుని లోపలకి వెళ్ళు." అంటూ చేతిలో సంచీ అందించాడు ఆ పిల్ల చేతిసంచీ అందుకుంది. ఆ కళ్లలో భయం, సందేహం, జంకు స్పష్టంగా కన్పిస్తున్నాయి.

"ఇది మీ యిల్లే! మీ తాతయ్యా, అత్తయ్య, అందరూ యిక్కడే ఉంటారు. లోపలికి వెళ్ళండి."

"హేమా యిప్పుడే ఆ సెంటర్ దాకా వెళ్ళి బీడికట్ట కొనుక్కుని వస్తాను."

పెదపాప అన్న అమ్మాయి తల వూపింది.

"తొందరగా వస్తావా వెంకట స్వామీ?" అంది.

"ఇప్పుడే చిటికెలో వచ్చేస్తా." అతను వెళ్ళబోయి ఆగాడు. "మరేం భయపడకండి. మీ కేమైనా కావాలంటే ఆ అమ్మాయిని అడగండి," అని కేక పెట్టినట్లుగా చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ పిల్లలు శారదవెంట, లోపలికి వచ్చారు.

పెద్దపాప అన్న అమ్మాయి సంచీని ఎవరో ఎత్తుకుపోతారన్నంత గట్టిగా పట్టుకుంది. ముగ్గురూ బిక్క మొహా లతో చూస్తూ లోపలికి వచ్చారు.

"సంచీ అక్కడ పెట్టు." శారద అక్కడున్న బల్ల చూపించింది.

పెద్దపాప సంచీని పెట్టింది.

"మంచినీళ్ళు కావాలా?"

కావాలన్నట్టు తలూపింది.

శారద లోపలికి వెళ్ళి మంచినీళ్ల గ్లాసుల్లో తెచ్చి యిచ్చింది.

శారద తిరిగి వచ్చేసరికి ఆ పెద్ద పాప అన్న అమ్మాయి, బల్లమీద పెట్టిన సంచీ మళ్ళీ ఒళ్లో పెట్టుకుని కూర్చుంది.

శారదకి నవ్వు వచ్చింది.

"అదెవరూ ఎత్తుకుపోరులే! అక్కడ పెట్టు," అంది. "నా పేరు శారద. మీ పేర్లేమిటి ?" అని అడిగింది.

"నా పేరు గిరిజ, మా చెల్లెలు పేరు జలజ. మా చిన్నచెల్లెలి పేరు చిట్టి." పెద్దపిల్ల ఆరిందాలా చెప్పింది

"ఎప్పుడు బయలుదేరారు మీరు ?"

"నిన్న ప్రొద్దున."

"భోజనం చేసారా ?"

"ఇడ్లీ తిన్నాం."

"ఆకలేస్తోందా? అన్నం తింటారా?"

వాళ్లకళ్ళు ఆశగా చూసాయి! ముఖాల్లో ఆకలి స్పష్టంగా కనిపించింది. కవిత, కల్పన భోజనాలకి రాకపోవడంతో చేసిన వంటంతా అలాగే వుంది.

శారద వాళ్ళని డైనింగ్ టేబిల్ దగ్గరకి రమ్మనమని భోజనం వడ్డించింది.

పిల్లలు ఆత్రంగా, ప్లేటమీద కల బడినట్లుగా తింటున్నారు. శారదకి జాలే సింది! తను ఆకలి వేస్తోందా అని అడగకపోయినట్టయితే వాళ్ళు అలాగే వుండేవాళ్ళేమో! శారదకి తలితండ్రులు పోయిన కొత్తలో తన చిన్నతనం గుర్తుకు వచ్చింది! ఎంత ఆకలివేసేది! ఎంత మొహమాటంగా వుండేది! హాస్టల్లో లెక్కప్రకారం పెట్టిన తిండి సరి పోయేదేకాదు! ఎప్పుడూ పొట్ట ఆవురా వురుమంటూ వుండేది! ఆకలి భరించ లేక ఒక్కొక్కసారి లేత పచ్చగడ్డి తెంపి అవి నమిలేది!

"శారదా! శారదా! తలుపులన్నీ తీసివున్నాయి. ఎక్కడున్నావు?" కల్పన అరుస్తూ లోపలికి వచ్చింది. లోపలికి




వచ్చిన కల్పన, డైనింగ్ టేబిల్‌దగ్గిర, చింపిరి తలలతో, మాసిన బట్టలతో, జిడ్డోడుతున్న ముఖాలతో, స్టీలు కంచాల్లో అన్నాలు తింటూన్న పిల్లల్ని చూసి నివ్వెరపోయింది. కల్పన కళ్ళు ఎరుపెక్కినాయి. బ్యాగ్ పట్టుకున్న చెయ్యి నడుంమీద పెట్టుకుంటూ, "భేష్! మేం యింట్లో లేకుండా చూసి, మీ హాస్టల్ వాళ్ళందరినీ చేరేసి యిల్లు దోచి పెడుతున్నావన్న మాట! ఎవరిని అడిగి వాళ్ళని యింట్లోకి రానిచ్చావు? ఎవరిని అడిగి వీళ్ళకి భోజనాలు పెట్టావు?"

ఏదో పనిమీద వెళ్ళిన భవానీ ప్రసాద్ కూడా అప్పుడే యింటికి వచ్చాడు. అతని చేతులనిండా గులాబీలకి వేసే మందులు, విత్తనాల పాకెట్లు వున్నాయి.

కల్పన అరుస్తుండటం విని సరాసరి అక్కడకే వచ్చాడు.

"ఏమిటి కల్పనా, ఏమైంది?" అని అడిగాడు.

"ఏమిటా! పేనుకి పెత్తనం యిస్తే గడ్డం అంతా కొరికి పెట్టిందిట! మేం వద్దు మొర్రో అంటే, నువ్వు యీవిడ గారిని వుండమన్నావు! మనం లేని సమయం చూసి యిల్లంతా దోచిపెడుతోంది! చూడు ఆ రకాల్ని! ఎంత దర్జాగా, మన డైనింగ్ టేబిల్ దగ్గర తింటున్నారో. మొన్నొకసారి ఆ హాస్టల్ నుంచి ఎవరెవరో వస్తే, నేను గట్టిగా తిట్టి పంపేసాను. అందుకని, యింట్లో ఎవ్వరూ లేకుండా రానిస్తోంది. ఛీ! ఛీ! మనం ఎంత బాగా చూసినా సరే!

వీళ్ళ బుద్ధులే అంత." కల్పన అంటూనే డైనింగ్ టేబిల్ దగ్గరకు వెళ్ళింది.

అప్పటికే పిల్లల భోజనాలు పూర్తి కావస్తున్నాయి. కల్పన కేకలకి హడిలి పోయినట్లుగా చూస్తున్నారు వాళ్ళు.

"ఏయ్. లెండి. పొండి యిక్కడ నుంచి. మళ్ళీ యీ యింట్లోకి వచ్చారా తంతాను జాగ్రత్త" అంటూ బెదిరించింది.

పెద్దపిల్ల కుర్చీలోనుంచి లేపటంలో సంచీ క్రింద పడింది. కల్పన ఆ సంచీ తీసి డైనింగ్ రూమ్‌లోంచి బైటికి గిరాటేసింది.

"సంచీ పట్టుకుని తయారయారు పాపం, నింపుకు పోదామని వచ్చారు కాబోలు. మేము రావటంతో ఆట గట్టింది."

పిల్లలు ముగ్గురూ భూతాన్ని చూసి నట్లుగా బెదిరి అవతల గదిలోకి పారి పోయి నిలబడ్డారు.

"కల్పనా !" శారద అవమానం దిగ మింగుతూ సంజాయిషీ చెప్పబోయింది.

"నోర్ముయ్. ముందు ఆ కంచాలు తీసి, శుభ్రంగా కడిగి పెట్టు. యింకో సారి యిలాంటిది జరిగిందంటే, నిన్నే మెడబట్టి గెంటుతాను. జాగ్రత్త ! ఈ యింట్లో నువ్వొక పనిమనిషివని మర్చి పోకు. ఒళ్ళు దగ్గర పెట్టుకో."

కల్పన గబగబా అనేసి, టకటకా వెళ్ళిపోయింది. శారదకి కళ్ళనీళ్ళు పర్యంతం అయింది.

భవానీప్రసాద్ సానుభూతిగా చూసాడు.

"శారదా ! ఇలా ఎందుకు చేసావు. నువ్వెవరినైనా పిలవదలచుకుంటే, మేం వుండగానే పిలవటం మంచిది. వాళ్ళకీ, నీకూ యీ అవమానం తప్పుతుంది."

"క్షమించండి ! కల్పనకి ఎప్పుడూ ఎదుటివాళ్ళమాట వినే ఓపికవుండదు . ఇప్పుడూ అంతే జరిగింది.

వాళ్ళు మా హాస్టలు పిల్లలుకాదు ! వూరినుంచి వచ్చారు, మీవాళ్ళు."

"మా వాళ్ళా! వూరినుంచా!" అతను కంపరంగా ఆ పిల్లలవైపు చూసాడు.

"మీ అత్తవారి వూరినుంచి వచ్చారు. వాళ్ళ అమ్మమ్మ చచ్చిపోయిందిట ! మేనత్త మనిషినిచ్చి యిక్కడికి పంపింది."

భవానీప్రసాద్ కళ్లు వెడల్పయి నాయి ! అతని చూపులు అగ్నిగోళాల్లా అయినాయి ! ఆవేశం ఆపుకుంటున్న ట్టుగా, వూపిరి పీల్చటం ఎక్కువైంది.

"వాళ్ళా! వాళ్ళని యింట్లోకి ఎందుకు రానిచ్చావు ? ఎవరు తీసుకువచ్చారు యిక్కడకి ? ఎవరికి అంత ధైర్యం వచ్చింది?"

శారద నివ్వెరపోయింది.

"శారదా ! పంపించేయ్ ! తక్షణం పంపించేయ్ !" అతని గుప్పెట్లు బిగుసు

కున్నాయి! పళ్ళు పటపటలాడినాయి. చేతిలో పొట్లాలు వాళ్ళమీదకి విసర సాగాడు. పిల్లలు భయపడి వాకిట్లోకి పారిపోయారు!

అతను కూడా వాళ్ళవెంట పరుగెత్త బోయాడు.

శారద చప్పున వచ్చి అతన్ని పట్టుకుంది.

"వదలు, వదులు, నన్ను వదులు." అతను పెనుగులాడాడు!

శారద వదలలేదు.

"వదులు, లేకపోతే నిన్ను చంపేస్తాను వదిలేయ్ నన్ను."

భవానీప్రసాద్ అరుపులు విని కల్పన కూడా పరుగెత్తుకు వచ్చింది.

అతన్ని చూడగానే "మైగాడ్! మామయ్యకి మళ్ళీ ఫిట్ వచ్చింది," అంటూ పరుగెత్తుకుని వచ్చింది. అతన్ని పట్టుకోవటంలో శారదకి సాయపడింది!

ఎంతో కష్టంమీద, కల్పనా, శారదా యిద్దరూ అతన్ని అక్కడ వున్న గది లోకి తోసి తలుపులు బయట గడియ పెట్టారు.

"తలుపు తియ్." అతను తలుపు బాదుతూ అరుస్తున్నాడు.

ఆయాసపడుతున్న కల్పన శారద వైపు కోపంగా చూస్తూ, "ఇదంతా నీ మూలంగా జరిగింది," అంటూ మందు కోసం గబగబా పైకి పరుగెత్తింది.

పది నిముషాల తర్వాత, శారద బయటికి వచ్చింది. చెట్టుక్రింద పిల్లలు నిలబడి వున్నారు. ముగ్గురూ వెక్కి వెక్కి ఏడుస్తున్నారు. వాళ్ళని అలా చూడగానే శారద గుండెలు నీరయి నాయి! దగ్గరకి వెళ్ళింది. "ఏడుస్తున్నా రెందుకూ? ఏడవకండి. మీ వెంకట స్వామి రాగానే వెళ్ళి పోదురుగాని," అని సముదాయించింది.

పొద్దుకూకింది! చీకటిపడింది.

పిల్లలు ముగ్గురూ వెంకటస్వామి కోసం కళ్ళలో వత్తులు వేసుకున్నట్లుగా ఎదురుచూస్తున్నారు!

ఎంతోసేపు గడిచింది!

వెంకటస్వామి రానేలేదు!

కవిత కూడా వచ్చింది.

శారద ద్వారా జరిగిందంతా విన్న కవిత, కల్పన యిప్పటికి ఆ పిల్లల్ని వుండనీయమన్నారు! శారద వెళ్ళి వాళ్ళని లోపలికి రమ్మనమని పిల్చింది.

కానీ ఎంత చెప్పినా వాళ్లు రాలేదు!

వాకిట్లోనే వున్నారు.

శారద చాప యిచ్చి వాకిట్లో అరుగు మీద పడుకోమంది! వాళ్ళు పడు కున్నారు! శారద కూడా చాప తెచ్చి తనుకూడా వాకిట్లోనే వేసుకుంది. చాప మీద వాళ్ళని చూస్తుంటే, శారదకి తన చిన్నతనం తమ్ముళ్ళతో కలిసి అలా పడుకోవడం గుర్తుకు వచ్చింది. కనీసం ఒక్కరైనా తనకి తోడుగా బ్రతకకూడదా! ఈ సమయంలో ఎంత ఏకాకి తను! శారద కనుకొలకుల్లో నీళ్ళు నిండినాయి.

(సశేషం)




ఏడుకొండలు, నూకరాజు మెమోరియల్ మిడిల్ స్కూల్ గేట్లో నిలబడ్డాడు. అతని వెనకాల దాదాపు ఒక ఎకరందాకా కొలతకు వొచ్చే ఖాళీస్థలం వుంది. అందులో తూర్పునుంచి పడమరకి సాగదీసినట్టువున్న బిల్డింగు వుంది. బిల్డింగ్ వెనకాతల మనకు కనిపించకపోయినా పిల్లలు దొడ్లోకీ, మూత్రాలకి పోయేందుకు లావెట్రీలు, యూరినల్సూ వున్నాయి. వాటి వరసలోనే రెండు మూడు అలవేరేడు చెట్లూ, ఇప్పుడో అప్పుడో పడిపోయేందుకు సిద్ధంగా వున్న ఓ మామిడిచెట్టూ వున్నవి.

ఏడుకొండలు కూడా, ఎర్రటి ఎండాకాలంలో తార్రోడ్డుమీద పరి

గెడుతూ అదివరకే చాలాసార్లు పంచ రయిపోయిన సైకిలు ట్యూబులా గున్నాడు.

అతని చూపంతా స్కూలుగేటుకు ఎడంవేపువున్న నాగమణి కొట్టు మీదుంది.

ఆ టౌన్లోకెల్లా పెద్దదయిన హోటెల్లోకి వెడితే ఒక రాత్రికి రెండు వందలన్నా గిట్టే యవ్వనం, అందం-నాగమణిది !

వయసు పదహారేళ్ళు !

సంసారం – రిక్షాతొక్కుతూ ఆరుగురిని కన్న తండ్రి ప్రస్తుతం పెద్ద జబ్బుతో మంచంమీద తీసుకు తీసుకు బతుకుతున్నాడు.

తల్లి ఆరుగురిని కని, ఏడోవాణ్ణి కనలేక పసిగుడ్డుని కడుపులోనే వుంచుకుని పోయింది. ఆమె పోయి ఏడాద్దాటుతోంది.

ఆరుగుర్లోనూ గుడ్డల అవసరం వున్నది ఒక్క నాగమణికే. తరువాతి ఐదుగురూ మగపీనుగులు. వాళ్ళకి సిగ్గుదాచుకుందికీ, ఊపిరి పీల్చుకుందికీ, రెండుపూటలు లేకపోతే ఒకపూటయినా తిండి పెట్టేదీ నాగమణే !

అందువల్లే నాగమణంటే తమ్ముళ్ళకీ, తండ్రికీ పెద్ద భయం.

తల్లి బతికున్నంతవరకూ నాగమణి పదిమంది యిళ్ళల్లో పాచిపనిచేసి యింటికి తోడుంది. తల్లి పోయేక దాచుకున్న డబ్బేట్టి కొట్టెట్టింది. నాగమణి కొట్టుపెట్టినప్పుడే నూకరాజు మెమోరియల్ స్కూలు కట్టడం ప్రారంభమయ్యింది.

యిప్పుడు నాగమణి వ్యాపారం హాయిగా సాగుతోంది.

పిల్లలు రావడం, పోవడం గమనిస్తున్నాడు ఏడుకొండలు.

ప్రతిక్షణం నవ్వుతూ, నవ్విస్తూ—పిల్లల్ని తెగ ఆకర్షిస్తోంది నాగమణి.

ఆమె కొట్లో పిల్లలకి కావలసిన తినుబండారాలన్నీ వున్నాయి.

కొన్ని గాజు జాడీల్లోనూ, కొన్ని పళ్లేల్లో, కొన్ని డబ్బాల్లోనూ !

ఏడుకొండలు ఆ కొట్లో ప్రతి వస్తువును తినేసేట్టు చూస్తున్నాడు.

ఏడుకొండలు ఉన్నట్టుండి ఉలిక్కిపడ్డాడు.

నాగమణి కొట్లో బలపాలూ, పెన్సిళ్ళూ కూడా వున్నాయి.

ఏడుకొండలు కోపం కొండంతయ్యింది.

'నంజె ! ఇంకెంత సేపులే ఈ నవ్వులూ పువ్వులూ !' అనుకున్నాడు.

నెమ్మదిగా జేబు తడుముకున్నాడు. అనుకోకుండా మీసం మెలేసేడు.

నాగమణి కొట్టుకేసి కదలబోయి ఆగిపోయేడు.

'యిప్పుడెందుకూ – స్కూలొదిలేస్తే కాస్త నెమ్మది. ఏ గొడవా

వుండదు,' అనుకున్నాడు. మళ్ళీ గేట్లో కొచ్చి నుంచుండిపోయేడు. చుట్టూతా చూసేడు.

ఆ వీధి చిన్న సందులాంటిది. వీధికి రెండువేపులా కొట్లే – చిన్నవీ పెద్దవీ. రేకుల్తో చేసినవీ, డబ్బా లాంటివీ.

ఎడంవేపు కొట్లనానుకుని వెనకాల పెద్దగోడ. గోడకవతలివేపు ఆ టౌను బస్స్టాండు. బస్స్టాండులో యిరవయి నాలుగ్గంటలూ రద్దీయే. బస్స్టాండుకీ, ఆ వీధికీ దారిలేదు. ముందు కెళ్ళి సెంట ర్నించి వెనక్కి తిరిగి వెళ్ళాల్సిందే. అందుకనే కాబోలు ఇక్కడ స్కూలు కట్టేందుకు మునిసిపాలిటీ వాళ్ళు పర్మిష నిచ్చేరు.

ఈ వీధిలో వ్యాపారం ఎక్కువగా కూలిజనాలకి సంబంధించినది కావటం వల్లే 'చిన్నబజారు' అన్న పేరొచ్చింది.

ఏడుకొండలు యిదివరకు సెంటర్లో ఒక పెద్ద జనరల్ స్టోర్లో పనిచేసే వాడు. తన పన్నెండేళ్ళ వయసునించీ అక్కడ ఒళ్లు వొంచి పనిచేసేడే తప్ప మరోరకంగా ప్రవర్తించలేదు. చిన్న విషయంమీద యజమానితో మొన్న గొడవపడ్డాడు.

యజమానికీ, పనివాడికీ స్నేహమే వుండాలిగానీ, యిద్దరిమధ్యా ఏ తేడ రెన్నో వచ్చినా పనిచేసేవాడికి క్షేమం కాదని పాతికేళ్ళ ఏడుకొండలు తెలుసు కున్నాడు. అందుకనే అక్కడ ఉద్యోగం యింకా వదలకుండానే సొంతంగా ఏదేనా చిన్న వ్యాపారం పెట్టుకుందామనే ఆలోచన వచ్చి వెంటనే అప్పలరాజు గారిని కలిసేడు

కారు దిగి నేరుగా వరండాలో వున్న కుర్చీలో పదిలంగా కూచుని ఇందాక గేటుదగ్గర తనకి నమస్కారం పెట్టిన వాడిని, ఏడుకొండల్ని లోపలికి పంపిం చమని నౌకరుకు ఆజ్ఞ జారీచేసేడు అప్పలరాజుగారు.

చుట్ట వెలిగించుకుంటూ ఎదురుగా మెట్లకింద నుంచున్న ఏడుకొండల్ని నిశితంగా పరీక్షగా చూసేడు.

ఏడుకొండలు భక్తితో మళ్ళీ నమస్కారం చేసేడు.

అప్పలరాజుగారు అంత మంచితనం తోనూ ఆ నమస్కారాన్నందుకుని గొంతు సవరించుకుని–"ఏమిటీ పనీ?" అన్నారు.

ఆయనకి బాగా తెలుసు తన కొడుకూ, కూతురూ, పెళ్ళాం తప్ప బంధువుల్తో సహా ప్రతివాడూ ఏదో సహాయంకోసం తప్ప మరొకందుకు రారని.

"నా పేరు ఏడుకొండలండీ!"

అప్పలరాజుగారు మాట్లాడలేదు.

"మీ సాయంకోసం వచ్చానండీ!"

అది తెలుసు. పనేమిటీ అన్నట్టుగా "ఊఁ" అన్నారు అప్పలరాజుగారు.

''మీ స్కూలుదగ్గర కొత్తగా చిన్నకొట్టు...'' ఏడుకొండలు మాట పూర్తవకుండానే అప్పల్రాజుగారి కళ్లకి నాగమణి కనిపించింది.

'దాన్నెలాగూ రప్పించుకోవాలి' అని మనసులో అనుకున్నారు.

అది నిప్పులాంటిదని విన్నారాయన.

'దాన్నెలాగునైనా లొంగదీసుకోవాలి ... లొంగదీసుకోవాలి ... ' అప్పల్రాజుగారు పదే పదే అనుకుంటూంటే—

''ఆ స్థలం నా కిప్పిస్తే మీకు ఋణపడి వుంటాను.'' ఏడుకొండలు చేతులు కట్టుకుని విన్నవించుకున్నాడు.

'దాన్నెలాగునైనా లొంగదీసుకోవాలి.'

''ముగ్గురు చిన్నచిన్న ఆడపిల్లలు ... చెల్లెళ్లు ... ముసలితండ్రీ తల్లీ ... అందర్నీ నేనే సాకాలి. మీరు దయతలచి ఆ స్థలం నా కిప్పిస్తే మీ మేలు జన్మజన్మలకీ మర్చిపోనండీ !''

''దాన్నెలాగునైనా లొంగదీసుకోవాలి.''

''మునిసిపలాఫీసులో ఆరా దీసానండీ ... అందరూ మీ మాటే అన్నారండీ ! ఆఫీసరుగారికి మీ మాటంటే వేదవాక్కన్నారు ... మీరు దయతలచి ఆ స్థలం నా కిప్పిస్తే...''

'దాన్నెలాగునైనా...ఓ రాత్రికి...'

''పేదవాణ్ణి ! ఈ ఊరికీ, మాలాటోళ్ళకీ ధరమరాజులాంటివారుమీరు ! కనికరించి ఆ స్థలం నా కిప్పిస్తే...''

అప్పల్రాజుగారి బుర్ర వేడెక్కిపోయింది.

''అయితే'' అన్నారు.

''మీరు దయతలచి ఆ స్థలం ఇప్పిస్తే ..'' అన్నాడు ఏడుకొండలు నీళ్లు నములుతూ.

''ఏ స్థలం ?'' అన్నారు అప్పల్రాజుగారు.

ఏడుకొండలు కంగారుపడ్డాడు.

''స్కూలు గోడ మూలది. అక్కడో ఆడకూతురు కూచుంటుంది ... '' అన్నాడు భయం భయంగా ఏడుకొండలు.

''అయితే'' అన్నారు అప్పల్రాజుగారు.

''ఆ స్థలం నా కిప్పిస్తే ... అక్కడ పిల్లలకి...నేను...ఓ కొట్టు...''

అప్పల్రాజుగారు వెంటనే ''ఏం కొట్టు ?'' అనడిగేరు.

''పుస్తకాలు ... చాక్లెట్లూ ... పెన్సిల్లూ... పుస్తకాలు ... బిస్కట్లూ ...పుస్తకాలు... జంతికలూ ... పుస్తకాలు ... పెన్సిళ్లూ...'' ఏడుకొండలకి చెమటపట్టింది.

''అదీ అవే అమ్ముతోంది కదయ్యా!'' అన్నారు అప్పల్రాజుగారు విసుగ్గా.

''చిత్తం! నాది పెద్ద కుటుంబం. నా సంపాదనే దిక్కండీ మా యింటికి. మీరు దయతలిస్తే నెలకింత ... ఎంతో

కొంత ... మీకు యిచ్చుకుంటాను. జన్మాంతం మీకు ఋణపడి వుంటాను."

అప్పల్రాజుగారికి మళ్ళీ నాగమణి గుర్తుకొచ్చింది. 'నంజకి ఫారిన్ చీరొకటి కట్టి హైదరాబాద్‌లో పెడితే ఏడాదికో లక్ష సంపాదిస్తుంది,' అనుకున్నారాయన.

తన స్కూలుదగ్గర అది కొట్టుపెట్టి తనకి ఏమీ ఋణపడనందుకు కోపంగా వుంది ఆయనకి.

ఏడుకొండలుకేసి తీక్షణంగా చూసారాయన.

"మీరు కనికరించకపోతే నాకు చావే దిక్కండీ! ఎన్నో ఆశలు పెట్టుకు వచ్చాను." ఏడుకొండలు ఏడిచినంత పనిచేశాడు. నటించాడు.

అప్పల్రాజుగారు చుట్ట పూర్తిగా తాగి మెట్లపక్కకి విసిరేసి, లేచి లోపలికి వెళ్ళాడు.

ఏడుకొండలికి ఏడుకొండలు ఎక్కినంత ఆయాసంగా వుంది. తీరా ఎక్కాక దేవుడి దర్శనం డౌటులో వున్నట్టుగా అప్పల్రాజుగారి దయ కలుగుతుందో లేదోనని భయంగా వుంది.

ఐదారు నిమిషాల తర్వాత చేతిలో పెన్నూ, కాగితంతో వచ్చారుఅప్పల్రాజుగారు.

ఏడుకొండలు మొహం వెలిగింది.

"మీ మేలు జన్మజన్మలకీ మరవనండీ," అన్నాడు మొహాన వున్న చెమట తుడుచుకుంటూ.

"ఆఫీసరుగారికి ఉత్తరం యిస్తాను. గాని నువు ముందు దాన్నడుగు. ఖాళీ చేస్తుందో లేదో – పాపం! అదీ దిక్కులేందే గదా! ముందుగా చెప్పిచూడు!" అంటూ ఉత్తరం రాయటం మొదలెట్టి, ఆగి ఎందుకయినా మంచిదని, "అవునూ– నీ పేరేమిటన్నావ్?" అన్నారు.

"ఏడుకొండలండీ!"

"ముందుగా వెళ్ళి దాంతో చెప్పు. అదేమయినా, గొడవపెడితే దాంతో నన్ను కలవమని చెప్పు," అన్నారు.

"చిత్తం" అని అప్పల్రాజుగారు రాసిచ్చిన ఉత్తరం ముక్క తీసుకుని నమస్కారాలమీద నమస్కారాలు చెబుతూ గేటు దాటేడు ఏడుకొండలు.

ఏడుకొండలు జేబు తడుముకున్నాడు. జేబులో అప్పల్రాజుగారు రాసిచ్చిన ఉత్తరం పెరపెరలాడింది.

టింగు టంగు టింగు టంగుమని స్కూలు వొదిలేరు.

బిలబిలమంటూ పిల్లలు గేటుదాటేరు.

అయిదారు నిమిషాలవరకూ నాగమణి కొట్టుముందర పిల్లలు గుంపులు గుంపులుగా జేరి నాగమణి వ్యాపారానికి ఉత్సాహాన్నీ, ఊపిరినీ పోసేరు.

ఏడుకొండలు ఆలోచిస్తూ కూచున్నాడు.

"రేపట్నుంచీ అది నా వ్యాపారం!" అనుకున్నాడు.

"నంజె, మొహం ఎలా వెలిగిపోతోందో చూడు," అనుకున్నాడు.

వెంటనే కసిగా నవ్వుకున్నాడు.

"దీని మొహం రేపు చూడాలి... ఆ కొట్లో నేను కూచుంటే దాని మొహం చూడాలి !" అని అనుకున్నాడు.

చూస్తుండగానే పిల్లలు పల్చబడ్డారు. వీధిలో మిగతా కొట్లముందర పనుల నుంచి వచ్చిన కూలీజనం కుప్పలు తెప్పలుగా, హడావిడిగా జేరుతున్నారు. ఆ జనం తాలూకు పసిపిల్లలు కూడా నాగమణి కొట్టుదగ్గరికి వచ్చి పోతూ వున్నారు.

ఏడుకొండలు కసిగా వున్నాడు.

'నంజ ! నంజ !! నంజ !!' అనుకున్నాడు.

వెంటనే నాగమణి కొట్టుకేసి కదిలాడు.

అప్పటికి నాగమణి కొట్లో కిరసనాయిలు దీపం వెలిగిస్తోంది.

కోపంగా వున్న ఏడుకొండలు విషయం ఎలా మొదలుపెట్టాలో తెలీక క్షణం తటపటాయించాడు.

దీపం వెలిగించి కొట్టుముందర నుంచున్న ఏడుకొండల్ని చూసి "ఏటి బాబూ ?" అంది నాగమణి.

'ఏట్రా నంజకొడక!' అన్నట్టుంది ఏడుకొండలికి.

"నీ కొట్టు ఎత్తెయ్యాలి" అన్నాడు ఏడుకొండలు.

ఆ దీపం వెలుగులో ఒకవేపునుంచే పడుతున్న వెలుగులో నాగమణి దెయ్యంలా కన్పిస్తోంది ఏడుకొండలికి.

నాగమణి మొదట ఆశ్చర్యపోయింది. తరువాత వెంటనే తేరుకుని "ఏమిటీ ?" – అంది.

"నీ కొట్టు మూయాలి ! ఈ స్థలం నా కొచ్చింది," అన్నాడు ఏడుకొండలు.

నాగమణికి విషయం అర్థంకాలేదు. ఆమెకి వెంటనే తన తమ్ముళ్ళూ, తండ్రీ గుర్తుకొచ్చారు.

కోపం వచ్చింది. ఉక్రోషం వచ్చింది.

"ఏం ? ఎందుకూ ?? – నేనిక్కడ ఏడాదిగా వున్నాను. ఈ స్థలం నీ కెట్లా వచ్చిందీ ?" అంది.

ఎట్లా వచ్చిందో చెప్పబోయి ఆగిపోయాడు. చెప్పాల్సిన అవసరం కన్పించలేదు ఏడుకొండలికి.

క్షణం ఆలోచించాడు.

కోపం తగ్గింది.

"ఇదిగో – ఈ స్థలం నా కొచ్చిన మాట నిజం ! మునిసిపాలిటీవాళ్ళు వచ్చి రూల్సు ప్రకారం నీ కొట్టు ఊడ్చేయకముందే చెప్పాను. తరువాత నీ యిష్టం," అన్నాడు ఏడుకొండలు.

నాగమణికి కోపం వచ్చింది.

తన బ్రతుక్కి కావలసిన అవసరం విజృంభించింది మనిషి వణికిపోయింది.

"నీ తాత రానీ. నే నీ కొట్టు వదలను. ఎవడొస్తాడో రానీ," అని అంది.

"మాట జారకు. విషయం చెప్పాను తర్వాత నీ యిష్టం." అన్నాడు, ఏం అనాలో తెలీక.

అతన్లో ముందులా కోపంలేదు. ఆవేశం లేదు. మనిషి కంగారుగా వున్నాడు.

నాగమణి యిప్పు డతనికి కరిచే పిల్లిలా వుంది.

ఏడుకొండలికి చెమట పట్టడం మొదలయ్యింది.

"మాట జారేదేమిటీ నీ బొంద రమ్మను నంజకొడుకుల్ని, ఎవర్ని ఎవరు ఏం పీకుతారో. ఎవ్వడ్రా వాడు. ఓ ఆడకూతురు పొట్టమీద తన్ని మరోడికి కూడెట్టే మగాడు. రమ్మనాన్ని. నా దగ్గరకు రమ్మను. ఆడలంజనాగు ఎదరికి రాక నిన్ను పంపాడూ ? గాజులు తొడుక్కో మనాన్ని..." నాగమణి ఆగకుండా తిడుతుంటే ఏడుకొండలికి తంతున్న ట్టుంది. అటూ యిటూ చూశాడు. అప్పటికే విషయం తెలిసి చుట్టూతా జనం పోగయ్యారు.

నాగమణి ఆగలేదు మధ్య మధ్యే ఏడుస్తూ యింకా యింకా తిడుతోంది. ఏడుకొండలికి అక్కడినుంచి వెళ్ళి పోదామని వుంది. కాని చుట్టూతా తనని "ఏమిటి విషయ"మని నిలేస్తూ సముద్రంలాగు జనం.

ఏడుకొండలికి ఏమీ పాలుపోలేదు. జేబు తడుముకున్నాడు. జేబులో కాగితం యిప్పుడు కేరు కేరు మన్నట్టుంది.

నాగమణి కొట్టుకి ఎదురుగానూ ప్రక్కనూ వున్న కొట్లవాళ్ళు ఊరు కోరని ఏడుకొండలికి అర్థమయింది.

మళ్ళీ జేబు తడుముకున్నాడు.

జేబులో కాగితం ఊపిరాడక చస్తు న్నట్టే పెరపెరమన్నది.

* * *

ఆ రోజు తర్వాత రెండ్రోజులగ్గానీ నాగమణి కొట్టు తెరవలేదు.

మర్నాడు కొట్టు తెరవనందుకు నానా రకాలుగా ఊహించిన మిగతా కొట్లవాళ్ళలో ఒకడు దగ్గరగా వచ్చి, "ఏందే నాగమణీ ఏంటీ గొడవా ?" అన్నాడు.

"ఏమీలేదు," అంది.

"ఆ లంజికొడు కెవడూ - మొన్న నీ కొట్టు మూయిస్తా నన్నాడు గదా ? ఏమన్నా గొడవయిందా ? మాతో చెబితే సాయానికి వొచ్చేవాళ్ళంగదా ?" అన్నాడు.

నాగమణి చిన్నగా నవ్వింది. నవ్వి, "ఆడు యింకోచోట కొట్టు తెరు స్తాడ్లే. యిప్పుడు నాకు రెండు కొట్లు !" అంది.

అడిగినవాడు ముందు తెల్లబోయి తేరుకుని అప్పుడు గమనించేడు.

నాగమణి కాళ్ళకి పసుపు వుంది. మట్టెలు వున్నాయి.

ఆశ్చర్యంగా నాగమణికేసి చూసేడు.

నాగమణి, మెడలో వేలాడుతున్న పసుపుతాడుని జాకెట్లోకి భద్రంగా తోసుకుంది.

---




**బొం**బాయి మహానగరం! అద్దె కొంపల్లో నివసించే జనాభా పాలిట మహానరకం. విలాసాలకూ, వినోదాలకూ, కలతలకూ, కలహాలకూ కాణాచి.

అది ఓ మిట్ట మధ్యాహ్నం.

మెరైన్‌డ్రైవ్ పైనుంచి ఖరీదయిన సముద్రపవనాలు వేడిగా వీస్తోన్నాయి. వాతావరణంలో దుమ్మూ ధూళీ మిళితమై పోయి మానవుని ఆయుఃపరిమితిని అవనతం చేస్తోన్నాయి

పదవ అంతస్థులో తమ గృహ మన బడే ఒకే ఒక గదిలోని వాలుకుర్చీలో చేరగిలబడిపోయి దినపత్రికలో లీనమై ఉన్నారు గృహస్థు ఆచారిగారు. వారి గృహిణి వారి ఎదటే నేలపై చతికిలబడి పోయి ఆ నగరంలో అతికష్టంగా లభ్యమయ్యే రాళ్ళలోని బియ్యాన్ని ఓపిగ్గా ఏరుతోంది.

"ఆచారీ సాబ్, నమస్తే!" సహోద్యోగి దేశ్‌పాండే కంఠస్వరాన్ని గుర్తించి లేచి వెళ్లి అతన్ని లోనికి ఆహ్వానించేరు ఆచారిగారు.

"మీ ప్రక్క పోర్షను ఖాళీగా ఉందని తెలిసి యిలా వచ్చేను" అంటూ కూచున్నాడు దేశ్‌పాండే

చాలాకాలంగా ఆ భవనంలో ఉంటూన్న ఆచారిగారిపై ఓనర్ కుందన్ లాల్‌కి చాలా నమ్మకం ఉంది. ప్రక్క పోర్షను ఖాళీ అవటంతోనే దానికోసం ఎవరేనా వస్తే చూపించండంటూ తాళం చెవిని ఆచారిగారి కిచ్చి వెళ్లేడతను.

ఉదయంనుంచీ ఏ పదిమందో వచ్చి వెళ్ళారా యింటికి కొందరికి అద్దె నచ్చ లేదు. మరికొందరికి 'పగిడీ' (తిరిగి రాని అడ్వాన్సు) నచ్చలేదు. యింకా కొందరికి గదిలోని సౌకర్యాలు బావో లేవు. దాంతో ఆ మహానగరంలో చూపరులకి ఆశ్చర్యం గొలిపేలా ఆ పోర్ష నలా దాదాపు ఓ పదిగంటలపాటు ఖాళీగా ఉండిపోయింది.

ఆ భవనంలో ఉన్న నూటయిరవై కుటుంబాల్లోనూ తెలుగువారివి రెండే రెండు. గ్రౌండ్‌ఫ్లోరులో సత్యనారాయణ గారనే వారొకరూ, పైన పదో అంత స్తులో ఆచారిగారూనూ, కాపరాలు చేస్తోన్నారు. ఆ రెండు కుటుంబాల్నీ రోజుకోసారేనా కలుపుతూ ఉంటుం దా భవనంలోని ఏకైక పుష్పక విమానం. చాలాకాలంగా అరమరికలు లేకుండా సాగివస్తోంది వారి మధ్యనున్న మంచి స్నేహం.

లోకాభిరామాయణం పూర్తయ్యాక దేశ్‌పాండేకి గదిని చూపించేరు ఆచారి గారు కాని అతను పెదవిని విరవ టాన్ని గమనించే రాయన. వారికి మాత్రం తెలిసిన ఈ వ్యక్తి పొరుగున ఉంటే తమ కుటుంబాని కెంతో సహ కారంగా ఉంటుందన్న అభిప్రాయం ఏర్పడింది. దాంతో దేశ్‌పాండే సూచనని అంగీకరించేరాయన.

దేశ్‌పాండే దృష్టిలో మరెక్కడో ఓ పోర్షను ఖాళీగా ఉంటంతో అతను వెళ్ళి దాన్నికూడా చూసి ఈ రెండిళ్లలో ఏదో ఒకటి నిర్ణయించుకోవటానికి కాస్త సమయం కావలసి వచ్చింది. ఆ సమయాన్ని ఆచారిగారు సమకూర్చేరు. యిహ ఆ తర్వాత ఆ పోర్షన్ని చూడ వచ్చిన ప్రతివ్యక్తికీ యిల్లు బుక్కయి పోయిందంటూ చెబుతూ వచ్చేరాయన.

సాయంకాలం ఏడయింది. గ్రౌండ్ ఫ్లోరునుంచి సత్యనారాయణగారు పైకి వచ్చేరు. ఆచారిగారి గదిలోకి అడుగు వేసిన వారివెంటే మరో క్రొత్తవ్యక్తి ఉంటంతో వారిని సాదరంగా ఆహ్వానిం చేరు ఆచారిగారు.

"ఆచారిగారూ ! వీరు రాజుగారని గోద్రెజ్‌లో ఫోర్‌మన్‌గా ఉంటున్నారట. మీ ప్రక్క పోర్షన్ ఖాళీగా ఉందని తెలిసి యిలా వచ్చేరు. వారి శ్రీమతి క్రింద మనింట్లోనే ఉన్నారు." సత్యనారాయణగారి పలుకుల్ని వింటూనే ఆచారిగారి కళ్ళల్లో ఆనందం తొణికిస

లాడింది. ఆ రోజుని పర్వదినంగా భావించేరాయన. తెలుగువాళ్ళకీ, తెలుగు వాతావరణానికీ మొహం వాచిపోయిన వారు ప్రక్కపోర్షనులోకి తెలుగు వాళ్ళొచ్చే అవకాశం కనిపించగానే సంతోషపడిపోయేరు. గబగబా వెళ్ళి ఆ పోర్షన్ తలుపుని తెరిచేరాయన.

కాని గదితాళం తీస్తున్న సమయంలోనే ఆచారిగారికి దేశ్‌పాండే జ్ఞాపకం వచ్చేడు. వెంటనే వారి ముఖకవళికలు మారిపోయేయి.

"కాని సత్యంగారూ! యిక్కడో చిక్కొచ్చిపడిందండీ! ఈ మధ్యాహ్నవే మా కొలీగ్ ఒహతను, మరాఠీ లెండి, వచ్చి ఇల్లు చూసుకుని సాయంకాలాని కల్లా కుందన్‌లాల్‌కి ఎడ్వాన్సు యిచ్చి మరీ వస్తా నన్నాడు. కాని అతని దృష్టిలో మరో యిల్లుందనే అన్నాడు లెండి! అయినా ఏదీ? యింతవరకూ రాలేదు. మరి ఏంచేద్దామంటారు?" అన్నారు ఆచారిగారు.

"వచ్చే వాడవుతే ఈపాటి కెపుడో రావాలి కదండీ? ఆ రెండో యిల్లేదో అతని దృష్టిలో ఉందంటున్నారుగా? దాన్నే సెటిల్ చేసుకుని ఉండచ్చు. ముందసలు రాజుగారిని యిల్లు చూడ నివ్వండి!" అంటూ గుమ్మంలోనుంచి ప్రక్కకి తప్పుకున్నారు సత్యనారాయణగారు.

రాజుగారు పోర్షన్‌ని చూస్తూన్న సమయంలోనే పుష్పకవిమానం కాస్తా పైకి వచ్చి ఆగిపోయింది. గది గడపలో కాలుంచిన దేశ్‌పాండేని చూడటంతో ఆచారిగారి వదనం ఆరిపోయింది. అయినా లేని నవ్వుని తెచ్చిపెట్టుకున్నారాయన.

"హలో పాండే! ఏవయింది? నీవు వేరే యిల్లు కుదుర్చుకున్నావా? లేక కుందన్‌లాల్‌ని కలుసుకున్నావా? నీకు చెప్పానుగా? త్వరగా రమ్మనీ! యిదో యిపుడే పిల్లాస్తే ..." అంటూన్న ఆచారిగారిని మధ్యలోనే త్రుంచేసేడు దేశ్‌పాండే.

"ఆ వేరే యిల్లు విషయం సెటిలవ లేదు సాబ్‌జీ! వెంటనే కుందన్‌లాలింటికి పరిగెత్తేను. కాని అతనింట్లోలేడు. ప్లీజ్! వాళ్ళతో చెప్పేయ్యండి! నేనే వస్తా నీ యింట్లోకి." కంగారుగా పలికేడతను

వారిని గుమ్మంలో చూసిన సత్యనారాయణగారు కాస్తా విషయాన్ని గ్రహించి చరచరా వచ్చేరు. ఆచారిగారితో తెలుగులో పలికే రాయన.

"తను రావటానికి ఆలస్యం అయిందనీ, ఈలోగానే రాజు గారొచ్చి యిల్లు చూసుకుని యింటతనికి డబ్బిచ్చి యిల్లు కుదుర్చుకుని వచ్చేరని చెప్పండి! తెలుగాళ్ళకి మన మీమాత్రం చేయకపోతే ఎలాగండీ?" అన్నారాయన.

ఆచారిగారు యిరకాటంలో పడి

పోయేరు. వారికికూడా దేశ్‌పాండేకి బదులు యిపుడా యింట్లోకి రాజుగారొస్తేనే బావుంటుందనే బలమైన అభిప్రాయం ఏర్పడిపోయింది. దాంతో గొంతులో వెలక్కాయ పడినట్లున్నప్పటికినీ సర్దుకుని పలికేరాయన.

"సారీ పాండే ! ఈయనగారు వెళ్ళి కుందన్‌లాల్‌కి అడ్వాన్సు యిచ్చే వచ్చేరట ! యిల్లు కడిగించేసి రేపుదయాన్నే మారిపోయే ఆలోచనలో ఉన్నారట ! నీ వనవసరంగా ఆలస్యం చేసేవు" అన్నారాయన.

దేశ్‌పాండే ఆ ముగ్గురివంకా అదోలా చూచేడు. పెదవిని విరుస్తూ వెనక్కి అడుగువేసే డతను.

"సారీ ఫ్రెండ్స్ ! మీ కనవసరంగా యిబ్బందిని కలిగించేను. సో సారీ ! గుడ్‌నైట్ !" అంటూ లిఫ్ట్‌వంక నడిచే డతను.

అతనివంకే, చూస్తున్న ఆ ముగ్గురూ లిఫ్ట్ తలుపు మూసుకుని కనుమరుగయిపోవటంతోనే తేలిగ్గా ఊపిరి పీల్చుకోగలిగేరు.

"అయితే యింకేం సార్ ! యిల్లు కడిగించేద్దాం. ఈ రాత్రే మారిపోతాము. యిహ యింకా ఆ హోటల్లో ఉంటం ఎందుకు ?" అంటూ సత్యనారాయణగారివంక సాభిప్రాయంగా చూచేరు రాజుగారు.

ఆచారిగారుమాత్రం క్షణం ఆలోచించేరు.

"రాజుగారూ ! ముందు మీరెళ్ళి కుందన్‌లాల్‌కి అడ్వాన్సిచ్చి రాకూడదుటండీ?" అన్నారాయన సాలోచనగా.

"ఆచారిగారూ ! భలేవారండీ మీరూ! మళ్ళీ ఆ దేశ్‌పాండే ఏదో చేయగలడనే భయ ఉన్నట్లుంది మీకు ! మీ రెలాగూ చెప్పారుగా ? అతని దృష్టిలో మరో యిల్లుందనీ, యిది కుదరలేదని తెలిసి యిపు డక్కడికి పరిగెత్తుంటా డతను. ఫరవాలేదు, ఉదయమే వెళ్లి యింటాడికి ఎడ్వాన్సిచ్చి రావచ్చును లెండి! ముందు వీరిని యిల్లదీ శుభ్రంచేసుకోనివ్వండి !" అన్నారు సత్యనారాయణగారు.

రాజుగారు క్రిందికి వెళ్లి తమ యింటావిడతోనూ, సత్యనారాయణగారి భార్యతోనూ పైకి వచ్చేరు.

ముగ్గు రాడాళ్లూ కలిసి యిల్లంతా కడిగి శుభ్రంచేసేసరికల్లా రాత్రి తొమ్మిదయిపోయింది.

రాజుగారు కాస్త వరండాలోకి వచ్చి హోటల్ కెళ్లి తమ సామాన్లను తెచ్చుకోవటాని కుద్యుక్తులయ్యేరు.

ఈలోగా కాఫీలు తీసుకుని వెళ్ళండంటూ కేకేసేరు ఆచారిగారి సతీమణి.

అంతా ఆచారిగారి గదిలో కూచుని కాఫీలు తీసుకుంటున్న సమయంలో వాకిలిముందు కాస్త అలికిడి వినిపిం




చటంతో తలెత్తేరు ఆచారిగారు. గడపలో నుంచుని ఉన్న దేశ్‌పాండేని చూడటంతోనే వారి మొహం వెలవెలా బోయింది.

"చూడండి ఆచారి సాబ్ ! మీ ఫ్రెండ్ ఎలా చెప్పారో మరి ? నేను యిక్కణ్ణుంచి సరాసరి కుందన్‌లాలింటికి వెళ్ళి వాకబు చేసేను. అతను తన వద్ద కీ ఉదయంనుంచీ ఎవరూ రాలేదనీ, తన కెవరూ అడ్వాన్సు యివ్వలేదనీ చెప్పేడు దాంతో నే నతనికి వెంటనే అడ్వాన్స్‌ని ముట్టచెప్పి యిలా వచ్చేను. దయతో గది తాళంచెవి నిస్తారా ?"

దేశ్‌పాండే పలుకుల్ని వినటంతోనే ఆచారిగారికి మతిపోయినట్లనిపించింది. రాజుగారికి మొహంలో కత్తివాటుకి నెత్తురుచుక్క లేకుండాపోయింది. సత్యనారాయణగారు నేల చూపులు చూడ సాగేరు.

దేశ్‌పాండేకి సమాధానం ఏం చెప్పాలో తోచక రాజుగారివంక చూచేరు ఆచారిగారు.

రాజుగారు నిట్టూరుస్తూ శుష్కమందహాసం చేసేరు

"తాళంచెవి నతని కిచ్చేయండి సార్ ! మీరు చెప్పినమాట విని ఉంటే విషయవసలు యిందాకా వచ్చేదేకాదు. అతనికంటే ముందు నేనే అక్కడికి వెళ్ళుంటే ఈ యిబ్బంది కలిగేదే కాదు. అతను యిక్కణ్ణుంచే నేరుగా అక్కడికి వెళ్లుంటా డనేదిమాత్రం శుద్ధ అబద్ధం. ఆ రెండో యిల్లేదో కుదరని పక్షంలోనే అక్కడికి వెళ్ళుంటాడు. అతనికి సమయాన్ని మనమే ధారపోసేము. అయినా

ఏంచేస్తాం ? దేనికయినా యోగం ఉండాలి మరి ?"

ఆచారిగారు నీరసంగా లేచివెళ్లి తాళంచెవిని తెచ్చి దేశ్‌పాండేకి అందించేరు కాని సూటిగా అతడివంక చూడలేకపోయే రాయన.

మర్నాటి సాయంకాలమే దేశ్‌పాండే కుటుంబం కాస్తా ఆ యింట్లోకి మారిపోయింది.

ఎనిమిది ప్రాంతంలో తమ వాటాలోకి అడుగువేసిన దేశ్‌పాండేని చూసి తలొంచుకున్నారు ఆచారిగారు.

"ఆచారీ సాబ్ ! యిందులో మీరు సిగ్గుపడవలసిం దేమీలేదు. మీ దోషం ఎంతమాత్రమూ లేదన్న విషయాన్ని నేను బాగా ఎరుగుదును. నేను రాగానే నన్ను మీరు మామూలుగానే పలకరించేరు. కాని ఈలోగానే ఆయ నెవరో వచ్చి మీ కేదో చెప్పటంతోనే మీ ధోరణి మారిపోయింది. నాకు మీ భాష రాకపోయినా భావంమాత్రం ఆ క్షణంలోనే బోధపడిపోయింది.

"అందుకే నేరుగా కుందన్‌లా లింటికి పరిగెత్తేను. కాని ... " ఆగిపోయేడు దేశ్‌పాండే.

వింటూన్న ఆచారిగారుమాత్రం తలని పైకెత్తలేకపోయేరు.

"కాని ఆచారి సాబ్ ! అసలు విషయాన్ని మీ కిపుడు చెబుతున్నాను. అన్యథా భావించకండి. కూటికోసం కోటి విద్యలన్నా రెవరో ! కాని నేను కొంపకోసం కోటి వేషాలంటాను. మీ ముందు నేను నటించటానికి నానా యిబ్బంది పడవలసివచ్చింది. నే నిక్కణ్ణుంచి వెళ్ళేసరికి కూడా కుందన్‌లాల్ యింకా తన యిల్లు చేరలేదు. వాడి యింట్లో వాకబుచేస్తే ఈ యింటిని గురించి ఎవరూ వచ్చి వెళ్ళలేదని తెలిసింది. దాంతో నా అనుమానం బలపడిపోయింది. తప్పనిసరిఅయిన పక్షంలో మళ్ళీ వెనక్కి తిరిగి యిక్కడికి వచ్చేను. కుందన్‌లాల్‌కి అడ్వాన్సు యిచ్చి వచ్చానని అబద్ధంచెప్పి మీ నుంచి తాళంచెవిని తీసుకున్నాను. కాని కుందన్‌లాల్‌ని కలుసుకున్నదీ, పగిడీ చెల్లించిందీ మాత్రం ఈ ఉదయమే ! మీరు కూడా నా ఎత్తుకు పైఎత్తుగా కుందన్‌లా లింటికి రాత్రే వెళ్ళుంటే నా నాటకం ఎపుడో బయటపడిపోయేది. హెన్స్, ఫర్‌గెట్ ది ఈవెంట్ ! లెట్స్ లివ్ హేపీలీ !" అంటూ ఆచారిగారి చేతి నందుకున్నాడు దేశ్‌పాండే.





# చేదు

అదృష్టదీపక్

ఆకాశాన్ని నేలమీద పరిచినట్టుగా ఉంది సముద్రం. బీచ్‌లో కూర్చున్న మనుషుల ఆలోచనల్ని పక్కదారి పట్టించాలని రణగొణధ్వని చేస్తోంది సముద్రం. కాని ఈ హోరు నన్నేమీ చేయలేకపోతోంది.

"ఏమిటి ? ఏదో ఆలోచిస్తున్నట్టున్నావ్ !" నీలవేణి అడిగింది. ఒక్క క్షణం ఆమె తెల్లని పలువరుసలో తన అందాన్ని చూసుకొని మురిసిపోయింది వెన్నెల.

"అబ్బే - ఏం లేదు !"

నా గొంతు నాకే ఎంతో అసహజంగా అనిపించింది. గుండెలో సుళ్ళు తిరుగుతున్న నిప్పుల ఉప్పెనను మాటల్లోకి అనువదించాలని యిందాకటినుంచి ప్రయత్నిస్తున్నాను. ఇంక ఆలస్యం చెయ్యగూడదు, అడిగెయ్యాలి !

ఏడుస్తున్న పిల్లవాడి నోరు బల వంతంగా ఎవరో నొక్కేసినట్లు సముద్రం తన ఘోషను మధ్య మధ్యలో హఠాత్తుగా ఆపేస్తోంది. రెండు క్షణాల నిశ్శబ్దం అనంతరం మళ్ళీ మామూలుగా హోరు మొదలవుతుంది. దారాన్ని తెంపి నట్టుగా హోరుని మధ్యలో కట్ చేసే ఆ నిశ్శబ్దం అంటే నాకు చాలా భయం. అది తెలియకుండానే నాలో వణుకు పుట్టిస్తుంది. ఆ నిశ్శబ్దం బ్రతికేది రెండు మూడు క్షణాలే అయినా పదునైన బ్లేడులా నా ఆలోచనల్ని కోసేస్తోంది. అలాంటి నిశ్శబ్దం మనిషిరూపం ధరించి నా పక్కనే కూర్చున్నట్టుగా ఉంది నీలవేణి.

ఎలాగో కొంత సేపటికి నా గొంతు ముడి విప్పుకొన్నాను.

"నీలూ !" ఏమిటన్నట్టుగా నావైపు చూసింది.

"మన మధ్య ఉన్న ఇంటిమెసీతో ఒక విషయం అడుగుతాను. నిజం చెబుతావా ?"

"యస్ ! తప్పకుండా అడుగు."

"నువ్వు సుఖంగానే బ్రతుకు తున్నావా ?"

"అంటే ?" ఆశ్చర్యంగా చూసింది.

"అహఁ ... ఏం లేదు. నువ్వూ చిట్టి బాబూ ఏ విధమైన గొడవలూ పెట్టు కోకుండా సుఖంగా సంసారం సాగిస్తు న్నారా ?" నా ప్రశ్నకు జవాబుగా పెద్దగా నవ్వడం మొదలెట్టింది నీలవేణి. ఒకదానిమీద ఒకటిగా వచ్చిపడుతున్న కెరటాల్లా చాలసేపు విరగబడి నవ్వింది.

"యిలాంటి సీరియస్ జోకులు ఎప్పుడు నేర్చావు మహానుభావా ? ఏదో గొప్ప విషయం అడుగుతావనుకున్నాను. తీరా చూస్తే యిదా ? కొంపతీసి నువ్వు కొత్తగా రాయబోయే కథలోని డైలా గులు నాకు అప్పగించడం లేదుకదా ? అసలు మా మధ్య కలతలు వస్తాయని నువ్వెలా అనుకున్నావు ? చిట్టిబాబు నన్ను ఎంతగా ప్రేమిస్తాడో నీకు తెలీదూ ?"

మళ్ళీ సముద్రం హోరు ఠక్‌మని ఆగింది.

నేను భరించలేని నిశ్శబ్దం నన్ను తినెయ్యడం మొదలెట్టింది నీలవేణి చాలా అందమైన అబద్ధం చెప్పి నన్ను నమ్మించాలని చూస్తోంది.

తిరిగి హోరు మొదలయింది. నేను కొంచెం ఊపిరి పీల్చుకున్నాను.

"అయితే నువ్వు చేస్తున్న ఉద్యోగం హఠాత్తుగా ఎందుకు మానేశావ్ ?"

"అదా ! ముందు కాలక్షేపం కోస మని చేరాను. కాని దానివల్ల నాకు ఏ విధమైన తృప్తి లభించలేదు. చిట్టిబాబు ఆఫీసునుంచి వచ్చే టైముకే సరిగ్గా నేనూ యింటికి చేరుకునేదాన్ని. వచ్చిన వెంటనే నేను వంటగదిలో ప్రవేశిం చడం ఉదయం కూడా అంతే. హడా

వుడిగా యింటిపనులు చక్కబెట్టుకుని ఎవరి ఆఫీసుకు వాళ్ళు పరుగెత్తడం ! జీవితంలో ఉండవలసిన థ్రిల్ నశించి పోతుందేమో అనిపించింది. ఇద్దరం కూడా యాంత్రికంగా తయారయ్యాం. కాస్సేపు సాయంత్రం ఏ బీచ్ వైపో రావాలన్నా, కులాసాగా కబుర్లు చెప్పుకో వాలన్నా కుదిరేది కాదు. అందుకే విసుగెత్తి నేను ఉద్యోగం మానేశాను. అదీ గాక మాకు ఆర్థిక ఇబ్బంది కూడా ఏదీ లేదు గదా ! మాకు ఇద్దరు పిల్లలు పుట్టినా చిట్టిబాబు సంపాదనతో హాయిగా బ్రతికెయ్యగలం !"

"నిజమే ననుకో ! పోనీ ఉద్యోగం మానుకునే బదులు యింటిపనికీ, వంట పనికీ ఓ పనిమనిషిని పెట్టుకుంటే సరిపోను గదా !"

"అబ్బబ్బ ! నీ ప్రశ్నలతో నన్ను చంపుతున్నా వనుకో ! అసలు నువ్వు యిన్ని కథలూ, కవిత్వమూ ఎలా రాస్తున్నావో నాకు తెలియడంలేదు. జీవితంలో కొన్ని అనుభూతులు వ్యక్తీకరించడానికి మాటలు దొరకవు. స్త్రీ జీవితంలో తను స్వయంగా వండి భర్తకు పెట్టడంద్వారా చాలా ఆనందాన్ని పొందుతుంది. అలాగే యిల్లు చక్కబెట్టుకోవడంలో కూడా ! ఈ విషయం ఇంతకంటె వివరంగానూ, అందంగానూ చెప్పడం నాకు రాదు !"

నీలవేణి చెప్పడం ఆపుజేసింది. వెన్నెల్లో ఆమె కళ్ళు మిలమిలా మెరుస్తున్నాయి. ఆమె కళ్ళలో వెలుగుతున్న ఆనందాన్ని నేను స్పష్టంగానే చదవగలుగుతున్నాను. అయినా నా బుర్ర చిక్కులుపడ్డ దారంలా తయారయింది. ఆ రోజు సుబ్బరాజు చెప్పినదంతా వట్టిదేనా ? అలా ఎందుకు చెప్పాడు ? కాదు - వాడికి అబద్ధం చెప్పవలసిన అవసరమేమిటి ? నిజమే అయి ఉంటుంది !

* * *

"నిజం గురూ ! నీలవేణి జీవితం సర్వనాశనమైపోయింది. చిట్టిబాబుగాడు వట్టి అనుమానాల పుట్టలా తయారయ్యాడట ! నీలవేణి స్వభావం నీకు తెలుసుగదా ! తన చుట్టూ ఉన్న నలుగురినీ నవ్విస్తూ, ఎప్పుడూ నవ్వుతూ తిరిగే మనిషి. తను పనిచేసే ఆఫీసులో అందరితోనూ సోషల్‌గా కలిసి మెలిసి తిరుగుతుంటే వీడు సహించలేక చాలా రకాలుగా హింసించడం ప్రారంభించాడట ! వాడి పోరుపడలేక ఉద్యోగం మానేసి యింట్లోనే కూర్చున్నా రకరకాల అనుమానాలతో ఎన్నో బాధలు పెడుతున్నాడట !"

"ఈ విషయాలన్నీ నీ కెలా తెలిశాయి ?"

సుబ్బరాజు మాటలకు మధ్యలో బ్రేక్‌వేస్తూ అడిగాను.

"నీలవేణి నేటివ్ గుంటూరే కదా !

తన విషయాలన్నీ ఎప్పటికప్పుడు తెలుస్తూనే ఉంటాయి కూతురు బ్రతు కిట్లా కాలిపోయిందని వాళ్ళమ్మగారు బెంగతో మంచం పట్టేసింది ఆవిడను చూడలేక ఈ మధ్య కనిపించడం కూడా మానేసాను దేవతలాంటి నీలవేణిని ఆ అనుమానాల రాక్షసుడు నంజుకుని తినేస్తున్నాడు గురూ !"

సుబ్బరాజు మాటలు నా గుండెను పిండేస్తున్నాయి ఆ క్షణంలో ఏడవడం లేదుగానీ వాడి ముఖంలో ప్రపంచం లోని విషాదమంతా పేరుకుపోయిన ట్టున్నాడు మేం ప్రయాణం చేస్తున్న రైలు పట్టాలు తప్పించుకుని నా మెదడులోంచి దూసుకుపోతున్నట్టుంది

చదువుకునే రోజుల్లో సుబ్బరాజు నీలవేణిని విపరీతంగా ప్రేమించాడు ఆమె చిట్టిబాబుని ప్రేమించి పెళ్ళిచేసు కుంది చిట్టిబాబు కూడా మా క్లాస్‌మేటే! చాలా రిజర్వ్‌డ్‌గా, హుందాగా ఉండే చిట్టిబాబు పెళ్ళయ్యాక ఇంత పాశవికంగా మారాడన్నమాట ! నీలవేణి సుబ్బరాజుని చేసుకున్నా సుఖంగా బ్రతుకును చేతులారా జీవితాన్ని నాశనం చేసుకుంది !

ఇంతలో నేను దిగవలసిన స్టేషన్‌లో ట్రైన్ ఆగింది సుబ్బరాజుని విషా దంలో విడిచిపెట్టి నా ఆలోచనల్ని చిత్ర వధ చేస్తున్న హోరుని తలనిండా నింపుకుని కిందకు దిగాను నాకేమీ అర్థంకావడంలేదు హోరు ! హోరు !!

* * *

"ఇక యింటికి వెడదామా? కాస్సేపు కూర్చుందామా ?" అడిగింది నీలవేణి అప్పటివరకూ ప్రచండంగా విన్పిస్తున్న హోరు ఒక్క క్షణం ఆగి నా ఆలోచ నల్ని కత్తిరించింది

బట్టలకు అంటుకున్న ఇసుక దులుపు కుంటూ పైకి లేచాం తలనిండా సాలె గూళ్లు పట్టినట్టుంది నాకు టైమ్ చూశాను ఏడయింది

చిట్టిబాబు ఆఫీసు పనిమీద ఎక్క డికో వెళ్ళాడట ! వచ్చేవరకూ ఆగుదా మంటే వినకుండా బలవంతంగా భోజనం వడ్డించింది అతను వచ్చేటప్ప టికి తొమ్మిది దాటవచ్చునంది

వరండాలో ఈజీఛైర్‌లో కూర్చు న్నాము నీలవేణి ఎక్కడా ఆగకుండా ప్రవాహంలా మాట్లాడేస్తోంది నేను శ్రోతగానే మిగిలాను ఇంతలో స్కూటర్ చప్పుడు వినిపించింది నీలవేణి ఛెంగున లేచి గేటుదగ్గరకు ఎదురు వెళ్ళింది చిట్టిబాబు వచ్చాడు

"ఎవరొచ్చారో చూడండి !" సెల యేరులా నీలవేణి !

"ఒరేయ్ యూ: హహ్హహ్హ ఏమిటిరా ? ఉత్తరం అయినా రాయకుండా ఈ మెరుపేమిటి ?"




నన్ను కౌగలించుకున్నంత పనిచేశాడు చిట్టిబాబు.

ఘనీభవించిపోతున్న స్పందన తిరిగి నా నరాల్లో పరుగులు తీయ సాగింది.

"ఇక్కడ సాహిత్యదీప్తి వాళ్ళు ఏర్పాటుచేసిన గోష్ఠికి నన్ను గెస్టుగా పిలిచారు. అది పూర్తయ్యాక మిమ్మల్ని చూసిపోవచ్చునని వచ్చాను. వచ్చే ముందు లెటర్ రాద్దామనుకున్నాను కాని వీలుపడలేదు."

"అవునులే ! మీ రచయితలు టన్నులకొద్దీ సాహిత్యాన్ని ఉత్పత్తి చెయ్యగలరుగానీ, ఫ్రెండ్స్‌కి ఉత్తరాలు మాత్రం రాయలేరు ! పోనీలే- గుర్తుంచుకొని చూడ్డానికైనా వచ్చావు. అదే చాలు !" నిష్ఠూరంగా అన్నాడు. కాని అందులో ఆత్మీయత కనిపించింది నాకు.

చిట్టిబాబుకి అన్నం వడ్డించి నాకు హార్లిక్స్ కలిపి తీసుకొచ్చింది నీలవేణి.

అర్ధరాత్రివరకూ వెనకటి సంగతులు తవ్వి పోసుకుంటూ గడిపాము. మంచు పడుతుందని చెప్పినా వినకుండా నేను ఒంటరిగా డాబామీద పడుకున్నాను. మళ్ళీ తలనిండా గజిబిజిగా ఆలోచనలు. దూరంగా సముద్రపు హోరు వినపడుతోంది కాని అంత స్పష్టంగా లేదు.

తెల్లవారాక వాళ్ళు ఎంతగా బలవంత పెట్టినా వినకుండా ప్రయాణానికి సిద్ధమయ్యాను. చివరకు చిట్టిబాబు నన్ను స్కూటరుమీద వాల్తేరు స్టేషన్‌కి తీసుకొచ్చాడు.

ట్రెయిన్ బయల్దేరడానికి కొద్ది నిముషాల టైముంది. చిట్టిబాబు హఠాత్తుగా అడిగాడు——

"ఏమిట్రా ? నిన్న బీచ్‌లో ఏవో వెధవ ప్రశ్నలువేసి నీలవేణిని కంగారు పెట్టేశావట ! కొంపదీసి ఈ మధ్య నీకు ఎక్కడైనా సుబ్బరాజుగానీ తగిలా డేమిటి ?"

ఉలిక్కిపడ్డాను. అయినా సర్దు కున్నాను.

"అబ్బే అదేం లేదులే ! చాలా మామూలుగా అడిగాను– అంతే ! ఏం ? సుబ్బరాజు సంగతేమిటి ?"

"ఏమో నాకూ అర్థంకావడంలేదు. మన పాత ఫ్రెండ్స్ ఎవరు కనిపించినా నీలూకీ నాకూ మధ్య మనస్పర్థ లొచ్చా యనీ, త్వరలో మేము విడాకులు తీసు కోబోతున్నామనీ, ఏమిటేమిటో చెప్తు న్నాడట ! మొన్న కేంప్‌లో శివరావు కనిపించి ఇదంతా చెప్పాడు !"

"చాలా చిత్రంగా ఉంది కదూ ?" అన్నాను, యింకేమనాలో తోచక.

ట్రెయిన్ కదిలింది. చిట్టిబాబు వెచ్చని చేతి స్పర్శను తీసుకుని నా సీట్‌లో కూలబడ్డాను. సుబ్బరాజు నా తలలో పెద్ద ప్రశ్నార్థకంలా తయా రయ్యాడు.

* * *

కేలండర్‌లో మరో నాలుగు కాగితాలు పాతబడిపోయాయి. చాలారోజుల తర్వాత గుంటూరు రావలసి వచ్చింది. రాత్రి రెండుగంటలకు మిత్రుడు రాజా రావు పెళ్ళి. యువతరంలో సంచల నాన్ని కలిగిస్తున్న మంచి రచయిత రాజారావు. పెళ్ళికి రాకపోతే డొక్క చించేస్తానని ఉత్తరం రాసాడు. సాయంత్రం నాలుగు గంటలకే గుంటూరు చేరుకున్నాను. బేగ్ పెళ్ళి వారింట్లో పెట్టి స్నానంచేసి బయటికి వస్తుంటే, "ఎక్కడి"కన్నాడు రాజారావు.

ఓ పాత ఫ్రెండ్‌ని కలిసి వెంటనే వచ్చేస్తానని చెప్పాను.

గుంటూరు బయలుదేరినప్పటినుంచీ నా తలలో సుబ్బరాజే కదులుతున్నాడు. వాడిని తప్పకుండా కలుసుకోవాలి. రిక్షా ఎక్కి నెహ్రూనగర్‌లోని సుబ్బ రాజు యింటికి చేరుకున్నాను. నీలవేణిని ప్రేమించి విఫలుడైన సుబ్బరాజు చివరకు తన మేనమామ కూతురు సత్యవతిని పెళ్ళిచేసుకున్నాడు. మంచి ఉద్యోగం కూడా సంపాదించాడు.

నేను వెళ్లేసరికి వాతావరణం విచిత్రంగా ఉంది. సుబ్బరాజు అత్త గారు ఒళ్లో రెండేళ్ళ కుర్రాణ్ణి పెట్టుకుని అరుగుమీద కూర్చుంది. అప్పటివరకూ ఆవిడతో కబుర్లు చెబుతున్న నలుగు రైదుగురు ఆడవాళ్ళు లేచి వెళ్ళి పోయారు.

"సుబ్బరాజు ఉన్నాడాండి ?" అడిగాను.

"లేడు బాబూ ! ఎవరు మీరు ?" ఆవిడ అడిగింది. ఎందుకో అప్పటి వరకూ ఏడ్చినట్టుంది ఆమె ముఖం.

నేను వివరాలు చెప్పాను. హాల్లో నన్ను కూర్చోమని చెప్పి కూతురిని పిలిచింది.

బెడ్‌రూమ్‌లోంచి సత్యవతి వచ్చింది. అంతకుముందు రెండు మూడుసార్లు సుబ్బరాజు యింటికి వెళ్ళి ఉండడంతో ఆమె నన్ను గుర్తుపట్టి నవ్వింది.

కాని ఆ నవ్వులో ప్రాణంలేదు.

సత్యవతి రూపం చూసి చాలా ఆశ్చర్యపడ్డాను నేను.

తలంతా రేగిపోయి, కళ్లు బాగా ఉబ్బి ఎర్రగా ఉన్నాయి.

"సుబ్బరాజు ఎన్నిగంటల కొస్తా డింటికి ?" అన్నాను.

సత్యవతి సమాధానంగా తల దించు కుంది.

ఆమె అపశ్రుతితో మధ్యలో ఆగి పోయిన పాటలా ఉంది.

పులి పంజానుంచి కొద్దిలో తప్పించు కున్న లేడిపిల్లలా ఉంది.

"ఎప్పుడొస్తాడో ఏం తెలుస్తుంది బాబూ ? ఒక అరగంటక్రితమే దానిని చావబాది బయటకుపోయాడు !"

షాక్ తిన్నాను. సత్యవతి కన్నీళ్లతో లోపలివైపు గదిలోకి వెళ్ళిపోయింది. సుబ్బరాజు అత్తగారు చెబుతోంది–

"మేనరికం గదా అని ముచ్చట పడి నా చిట్టితల్లి గొంతుకు ఉరితాడు తగిలించాము. ఓ అచ్చటా లేదు ముచ్చటా లేదు. దాన్నెవత్తెనో ఉంచు కుని కొత్తపేటలో వేరే కాపురం పెట్టాడు. వారానికో - పదిరోజులకో ఓసారి యిక్కడికి రావడం - దానిని నాలుగు తన్ని పోవడం ! ఒక్క సారిగా మమ్మల్నందరినీ చంపేసినా బాగుండును !"

"అదేమిటి ? సుబ్బరాజు యిలా ఎందుకు తయారయ్యాడు ?"

"ఏం చెప్పమంటావు బాబూ ? అంతా మేంచేసుకున్న ఖర్మ ! మనిషికి అన్నీ అనుమానాలు! ఓ సినిమా లేదు - షికారు లేదు - చివరకు వీధిలోకి కూడా రానిచ్చేవాడు కాదు. అది సత్యకాలపు పిల్ల గనక ఎలాగో ఓర్చుకునేది. ఎవరో బజారు ముండతో వేరే కాపురం వెలిగిస్తున్నా పల్లెత్తు మాటకూడా అన లేదు నా బిడ్డ ! అయినా యింటికి వచ్చాడంటే నానా బాధలూ పెడు తున్నాడు. చివరికి తన రక్తం పంచుకు పుట్టిన ఈ పసిబిడ్డకూడా తనకు పుట్టిన వాడుకాడని పెద్ద పెద్ద రంకెలేసి దాన్ని చితగ్గొడుతుంటాడు ! నలుగురిలోనూ తలెత్తుకుని తిరగలేకపోతున్నాం. ఈ పసిబిడ్డతో చావలేక, బతకలేక అది నరకంలో కొట్టుకుంటోంది !"

ఇంతలో సత్యవతి గ్లాసులో కాఫీ తెచ్చి నా చేతి కిచ్చింది.

ఆమె ముఖంలోకి చూడ్డానికి భయం వేసింది నాకు.

కాఫీ చేదుగా ఉంది !

---

# ప్రజా హృదయం

(గల్పిక)

దిబ్బపత్రిక ఎడిటరు మహా చిరచిర లాడుతున్నాడు.

"ఏమయింది ?" అన్నాను.

"ఎలెక్షను ! ... పాతప్రభుత్వమే గెలవాలని రోజూ సంపాదకీయాలు రాశాను. ఎక్కడో ఉత్తరదేశంలో పాత ప్రభుత్వం ఓడిపోయిందట నాకు రోజూ తిట్టు ఉత్తరాలు ! నేను కిరాతకాన్నీ, నియంతృత్వాన్నీ, పైశాచిక పరిపాలననూ, ప్రజాశత్రువులనూ సమర్థించి ప్రజలకూ, ప్రజాతంత్రానికీ ద్రోహంచేశానుట ! నాకు రాజకీయ పరిజ్ఞానంలేదుట ! నా సంపాదకత్వం కింద దిబ్బపత్రిక ప్రజలను అజ్ఞానాంధకారంలో ఉంచిందట !"

"విచారించకు. దిబ్బలో ఒక్క సీటుకూడా పోకుండా అన్నీ పాతప్రభుత్వానికే దక్కాయిగద ! ప్రజలు తమకు నియంతృత్వమూ, దౌర్జన్యమూ కావాలనీ, స్వేచ్ఛ అక్కర్లేదనీ ఎలుగెత్తి చాటి చెప్పారు. ప్రజాహృదయాన్ని నువు చాలా కరెక్టుగా ప్రతిబింబించావు !" అన్నాను.

"వాళ్ళకు రాజకీయ పరిజ్ఞానం చేసింది నేనేట !"

"తమ్ముడూ, ప్రజలకు రాజకీయ పరిజ్ఞానం కలిగించాలని రాజకీయవేత్తలే తాపత్రయపడరు. కందకు లేని దురద కత్తి పీటకా ? ఎన్నికలు వచ్చినప్పుడు ప్రజాభిప్రాయం తమపక్షాన ఉండాలని కోరటానికి మీటింగులు పెట్టి, ఏవో ప్రచారాలు చేస్తారు. ఇప్పుడు గెల్చిన పార్టీకి దక్షిణాది యావత్తూ వ్యతిరేకంగా వోటు చేసింది. వాళ్ళకేమన్నా బాధా ? కేంద్రం కోటలో పాగా వెయ్యటానికి అడ్డంరాలేదు. అందుచేత దక్షిణాది వేరే దేశమల్లే ప్రవర్తించినా వాళ్ళకి బాధలేదు. అందుచేత నువ్వు గమ్మునుండు ! నిన్ను విమర్శించిన వారితో, నాకూ, మా దిబ్బకూ పంచ మహాపాతక పరిపాలనే కావాలని చెప్పు, వాళ్ళ రోగం కుదురుతుంది !" అన్నాను.

---

***కొడవటిగంటి కుటుంబరావు***

అరేబియన్ నైట్స్

# దోసకాయల వెల

ఒకనాడు అమీర్ ముయీన్ ఇబన్ జైద్ వేటకు పోయినప్పుడు, గాడిద మీద సవారి అయి ఎడారిగుండా వస్తున్న ఒక అరబ్బీ కనిపించాడు. ముయీన్ అతన్ని సమీపించి పలకరించి, "ఎక్కడికి ప్రయాణం, అన్నా ? ఆ మూటలో భద్రంగా తీసుకు పోతున్నావు, ఏమిటది ?" అని అడిగాడు.

"అమీర్ ముయీన్‌ను చూడబోతున్నాను. ఆయనకోసం నా పొలంలో కాసిన తొలి దోసకాయలు తీసుకు పోతున్నాను. దేశంలో ఆయనను మించిన ఉదారుడు లేడు. నా దోసకాయలకు ఆయన తగిన వెల ఇస్తాడని నా నమ్మకం," అన్నాడు అరబ్బీ.

అతను అమీర్‌ను చూసిఎరగడని స్పష్టమయింది.

"అమీర్ నీ దోసకాయలకు ఎంత ఇస్తాడనుకుంటున్నావు ?" అని అమీర్ అడిగాడు.

"కనీసం వెయ్యి బంగారు దీనార్లు."

"అమీర్ అది చాలా ఎక్కువ అంటే ?"

"అయిదు వందలే ఇయ్యమంటాను."

"అది కూడా ఎక్కువేనంటే ?"

"మూడు వందలే అడుగుతాను."

"అది కూడా ఎక్కువేనని అతనంటే ?"

"వంద !"

"అదీ ఎక్కువేనంటే ?"

"యాభై."

"అదీ ఎక్కువేనంటే ?"

"ముప్ఫై."

"అది కూడా ఇంకా ఎక్కువేనంటే ?"

"నా గాడిదను జనానాలోకి తోలి, పారిపోతాను."

ఈ మాటకు ముయీన్ విరగబడి నవ్వి, తన గుర్రాన్ని అదిలించి, తన అనుచరులను కలుసుకున్నాడు. అతను ఆలస్యం చెయ్యకుండా తన భవనానికి తిరిగివచ్చి, అరబ్బీవాడు దోసకాయలు తీసుకునివస్తే లోపలికి ప్రవేశపెట్టమన్నాడు

మరొక గంటకు దోసకాయలతోసహా అరబ్బీ వచ్చి, లోపలికి ప్రవేశపెట్టబడ్డాడు. ముయీన్ చుట్టూ అధికార బలగమూ, సిబ్బందీ, ఖడ్గధారులైన రక్షకులూ, వైభవమూ చూసి, అరబ్బీవాడు తాను కలుసుకున్న రౌతు అతనే

